శ్రీ



# ఒకానొక గాడిద ఆత్మకథ

(నవల)

రచన:

కిషన్ చందర్

తెనుగు:

పిచ్చేశ్వరరావు



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2.

అయ్యలారా! అమ్మలారా!

నేను సన్యాసినీగాదు; సాధువునీకాదు; మహాత్ముణ్ణీకాదు; ధర్మాత్ముణ్ణీకాను; శ్రీ 108వ పీఠాచార్యగహమగహమానన్ద శిష్యుణ్ణీకాదు; ఆకూ యెరూ యిచ్చే సూఫీ గుర్ ముఖ్ సింగ్-నీ కాదు; వైద్యుణ్ణీకాదు; డాక్టర్నీకాదు; సినీమా నటుణ్ణీకాదు; రాజకీయ నాయకుణ్ణీకాదు.

నేనొక మామూలు గాడిదని; కాకపోతే చిన్ననాటి చెడ్డపనుల మూలాన్న వార్తాపత్రికలు చదివే పాడురోగం పట్టుకుంది నాకు. అది గూడా యేదో మామూలురోగమైతే బ్రదికిపోయెదాన్నే నేను. ఆ రోగం ముదిరిముదిరి నా మామూలు పని — యిటుకలు మొయ్యడం గూడా మరిచిపోయి, పత్రికలు చదవడం ప్రారంభించాను.

ఆ రోజుల్లో నా యజమాని వొక తాపీ మేస్త్రీ, పేరు శంభూ. మా దసలు అష్టవక్ర గ్రామం. (ఆ గ్రామం గాడిదలకు ప్రసిద్ధో, గాడిదల వల్ల ఆ గ్రామాని కా ప్రసిద్ధి వచ్చిందో, లేకుంటే ఆ గ్రామంలో గాడదలే ప్రసిద్ధో యిప్పుడు సరిగ్గా చెప్పలేను). నేను సయ్యేద్ కరామతలీశా, బారెట్లాగారి యింటిదగ్గర యిటుకలు మోసేదాన్ని. సయ్యేద్ కరామతలీ లఖనవూ (లక్నో)లో కల్లా పేరు మోపిన బారెట్లా. వారి సొంత వూరూ మా అష్టవక్రగ్రామమే. అంచేత వారు మావూరొచ్చి, తమ ప్రత్యక్ష యాజమాన్యం క్రింద ఒక నూతన గృహనిర్మాణం ప్రారంభించారు. సయ్యేద్‌గారికి చదువంటే మహాసరదా. తయారైన గదిని వెంటనే లైబ్రరీగా మార్చేశారు. అందులో పుస్తకాలూ అవీ పేర్చిపారేశారు. ప్రొద్దున్నే రాగానే, గదిముందు వరండాలో కుర్చీ వేసుకుని వార్తా పత్రికలు చదవడం ప్రారంభించేవారు. ఇటు మిగతా యిల్లు కట్టడం పరిశీలిస్తున్నట్టూ వుండేది. అటు పత్రికలు చదివినట్టూ

వుండేది. అప్పుడే నాకూ పత్రికలు చదివే వ్యసనం పట్టుకుంది. ఇటు లేచే గోడదగ్గర, నావీపుమీదున్న యిటుకలు సారేశి, అటులైబ్రరీవేపుకి పరుగెత్తేదాన్ని. సయ్యేద్‌గారు పత్రికతో తన్లీనమై వుండేవారేమో, నేవెళ్ళి వెనక నిలబడ్డానన్న సంగతిగూడా తెలిసేదికాదు వారికి. నేను నా పత్రికాధ్యయనం ప్రారంభించేదాన్ని.

కొన్నిరోజులకి అలవాటు శృతిమించి రాగానపడింది: ఒక్కో నాడు నేను సయ్యేద్‌సాహెబ్‌కంటే ముందేవెళ్ళి పత్రికా పఠనం ప్రారంభించేసేదాన్ని. ఒక్కోసారి నేను మొదటి పేజీ చదువుతుంటే, సయ్యేద్‌గారు సినిమా పేజీ అవలోకిస్తూండేవారు. నేనొకవైపున "ఓహెూ! మాక్మిలన్, ఐసెన్ హోవర్, కృశ్చేవ్!" అంటూంటే, వారింకోవైపున — "అహెూ!" యెంతచక్కని సినిమా, దిలీప్‌కుమార్, వైజయంతిమాల!" అంటూండేవారు. "అరెరే! యీ విమాన దుర్ఘటనలో యిరవైమంది చనిపోయారే" అని నేను విచారిస్తుంటే, "అయ్యబాబో బంగారంధర మళ్ళీ పెరిగిపోయిందే" అని వారు విస్తుపోతూండేవారు. మా గొడవలో మేమిలావుంటే, మా యజమాని ఇటుకలన్నీ లెక్కపెట్టి అప్పగించొచ్చి, నే నక్కడిలా నిలబడివుండడం చూచి వీపుపెళ్లేట్టు రెండు ఝుమురుకుని, నన్ను తోలుకెళ్ళిపోయేవాడు. ఏమాట కామాటే చెప్పాలి; సయ్యేద్ సాహెబు మాత్రం పల్లెత్తి ఒక్కమాట గూడా అన్న పాపానపోలేదు నన్ను. తర్వాతమళ్ళీ నేనెళ్ళినప్పుడు పత్రిక మొదటి పేజీ తీసి నాముందు పడేశేవారాయన. అది చదవడం అయిపోతే, లోపలికెళ్లి లైబ్రరీ పుస్తకం పట్టుకొచ్చికూర్చుని బిగ్గరగా చదవడం మొదలెట్టేవారు. మొత్తంమీద యిలా, సయ్యేద్‌గారి చమత్కారం అనండి, చలవఅనండి, నాకు చదవడమూ, మాట్లాడమూ వచ్చేసింది. అసలు సయ్యేద్‌గారి కొకఅలవాటుంది:పత్రికలు చదువుతూ,వాటిమీద వ్యాఖ్యానాలు చెయ్యడం; పుస్తకాలు బిగ్గరగా చదివి తాత్పర్యం చెప్పడం యిత్యాది: మా అష్టవక్రగ్రామంలో ఆ మాత్రం తీరుబడెవరికుంది? చదువుల బడికెళ్ళినవాళ్లే తక్కువ. ఉన్న నలుగురూ యెవరి పనులమీద వాళ్లుండేవారు. ఇకపోతే, గాడిదని నేను దొరికాను సయ్యేద్‌గారికి. ఎవరితోనో వొకరితో మాట్లాడాలి. మనసులో మాటలు చెప్పుకోవాలి.

సయ్యేద్‌గారికినేనంటే తర్వాతర్వాత మంచి స్నేహంగూడాయేర్పడింది. "అయ్యో! నువ్వు గాడిదవైపోయావుగాని, నువ్వే మానవ సంతానాని వైతే, నేను నిన్ను నాబిడ్డగా దత్తత చేసుకునేవాణ్ణి సుమా" అని చాలా సార్లన్నారుగూడాను నాతో. అన్నట్టు మీకు చెప్పటం మరచి పోయాను; ఆయనకు బిడ్డా పాపా లేరు.

సరే, యిప్పుడవంతా దేనికిలెండి! చివరికేమయిందంటే, సయ్యేద్‌గారి కట్టడం కట్టడం పూర్తయ్యింది. మా ఖామందు పని అయిపోయింది. పనైపోయిన నాటి రాత్రే, శంభూ బాగా కల్లు తాగొచ్చాడు. ఇంటికివొచ్చి నన్ను చచ్చేట్టు కొట్టాడు. కొట్టి బయటి కెళ్ళగొట్టాడు. నా మొహాని కింత గడ్డికూడా వెయ్యలేదు. అదేమంటే యిటుకలు తక్కువమోశా వన్నాడు; పత్రికలు యెక్కువ చదివా వన్నాడు. "నాకు యిటుకలుమోసే గాడిద కావాలిగాని. పత్తిరికలు సదివే గాడి దెందుకు?" అని కసిరికొట్టాడు.

రాత్రి తెల్లవార్లూ చలిలో గజగజా వణకిపోతూ, గుడిసె బయట అలాగే నిలబడున్నాను. తెల్లవారి, వెలుగొచ్చింతర్వాత, సయ్యేద్‌గారి భవనాని కెళ్ళి, "యిటుకలు మోసేపని లేకపోతే మానె, పుస్తకాలుమోసే పనైనా యిప్పించండి బాబా!" అని సయ్యేద్‌గారిని ప్రాధేయపడదాం అని నిశ్చయించుకున్నాను. షేక్స్పియర్ దగ్గర్నుంచి – స్టాన్లి గార్డెనర్ వరకూ అందరి పుస్తకాలూ చదివాన్నేను, పుస్తకాల్నిగురించి నాకు తెలిసినంత మరేగాడిదకీ తెలియదు. అంచేత సయ్యేద్‌గారు తప్పకుండా నా కుద్యోగం యిస్తారని ఆశపడ్డాను. కానేం లాభం? దురదృష్టం! ఆ క్రిందటినాటి రాత్రే నిర్వాసితులొచ్చి సయ్యేద్‌గారి యింటిమీద దాడిచేశారట. ఆయన ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని, పాకిస్తాన్‌కి పారిపోయాడు. ఆ నిర్వాసితుల్లో లాహోర్నుంచొచ్చిన గండాసింగ్ గూడా వున్నాడు. ఆయన్కి లాహోర్లో పళ్ళవ్యాపారమట. అక్కడ మోడల్ టౌన్‌లో ఆయన కొక గొప్ప భవనం వుందట. ఆ లెక్కని అంత పెద్దభవనం యిక్కడ గూడా ఆయనకి దఖలు చెయ్యాలట. అందువల్ల దేవుడిధర్మమా అని సయ్యేద్‌గారి భవనం గండాసింగ్‌గారి కిచ్చివేశారు.

నే నక్కడి కేళ్ళేప్పటికి గండాసింగ్ లైబ్రరీలో పుస్తకాలన్నీ తీసి బయట పారేస్తున్నాడు. ఖాళీఅయిన బీరువాల్లోకి పళ్ళు పట్టుకెళ్ళి పేరుస్తున్నాడు. షేక్స్పియర్ గ్రంధాలన్నీ తీసిపారేసి సీతాఫలాలూ, గాలిబ్ పుస్తకాలన్నీ విసరేసి కర్బూజాపళ్ళూ... యిట్లాగే... నేను చూస్తుండగానే, నా కళ్ళముందే పుస్తకాలన్నీ బయటపారేశాడు, పళ్ళన్నీ పేర్చిపెట్టాడు. ఆ పుస్తకాల ప్రారబ్ధాన్నిచూచి నాకళ్ళంట నీళ్లు గిర్రునతిరిగినై. ఇంతలో గండాసింగ్ తనపళ్ళ లైబ్రరీ లోపల్నుంచి బయటికొచ్చి నౌకర్ని పిలిచి, "యిదుగో, యీ బొక్కులన్నీ యీగాడిద మీదేశికట్టి, లఖనవూ (లక్నో)లో అమ్ముకురా. ఎన్ని వీశెలవ్వుతయ్యో జాగ్రత్తగా చూడు" అని పురమాయించాడు. ఆ పుస్తకాలన్నీ ఒక్క సారి నేనెక్కడ మొయ్యగలను? పెద్ద లారీడు పుస్తకాలూ! అవన్నీ లారీదగ్గరకి చేరవేసేటప్పటికే సాయింకాలమైంది. ఆ పని పూర్తయి పోగానే గండాసింగ్‌గారి నౌకరు, కొరడా తీసి నా వీపుమీద నాలు గిచ్చి, లాగొక్కతన్ను తన్ని నన్ను గెంటిపారేశాడు.

"పుస్తకాలకీ, పండితులకీ గౌరవంలేని గ్రామంలో వుండడం తగదు" అని అనుకున్నా నేను. ఇంకా వూరినుంచి ప్రస్థానంచేద్దామని సంకల్పించుకున్నా. ఊరివంక వొక్కసారి వెనక్కితిరిగిచూచి, నాలుగు గడ్డిపరకలు నోటితో కతికి ఢిల్లికి బయల్దేరాను నేను. "ఢిల్లీనగరం స్వతంత్రభారతదేశానికి రాజధానిగదా. కళలకూ, విద్యకూ, రాజ్యానికీ, రాజనీతికీ కేంద్రం గదా! ఎట్లాగోట్లా అక్కడ గడవక పోతుందటలే" నని దిలాసాచెప్పుకుని ధైర్యంగానే బయల్దేరా.

## అష్టవక్ర గ్రామంనుండి ఢిల్లీప్రయాణం

[అష్టవక్ర గ్రామంనుండి మస గాడిద ప్రస్థానం. ఢిల్లీ ప్రయాణం. ఆ సుందరనగర వర్ణన]

'ఢిల్లీ చెలో!' ఆ రోజుల్లో పిన్నా పెద్దా యెవరినోట విన్నా యిదే నినాదం. ఒక విధంగాచూస్తే, నేనూ ఆ నినాదాన్ని అమలు జరుపుదామనేగదా బయల్దేరింది. కాని, దారిలో ఏం జరుగుతుందో కానలేకపోయాను. కాస్తదూరం వెళ్ళిన తర్వాత, చూద్దునుగదా,

యేదో వొక చిన్నపల్లెలోంచి ఒక సాయెబు మూట చంకనబెట్టుకుని లగెత్తుకొస్తున్నాడు. చెప్పొద్దూ నాకు జాలేసింది. వీపుమీా దెక్కించుకుని, అంగలు సాచివెయ్యడం మొదలెట్టా; అతన్ని తరుముకొచ్చేవాళ్ళ కందకుండా వుందామని నామూలా న్నొక నిర్దోషికి ప్రాణాపాయం తప్పిందిగదా అని లోలోపల నన్ను నేనే అభినందించుకున్నాగూడా. ఇంతలో యిలా తల లేపి చూద్దునుగదా, యెదురుగుండా కర్రలు పట్టుకుని రోడ్డు టకాయించి కూర్చున్నారు కొందరు దుండగీళ్లు.

"చూశారా యీ సాయెబు పధవని; ఎవళ్ళదో హిందువుల గాడిదని దొంగిలించుకు పోతున్నాడు" అన్నాడు వాళ్లల్లో వొకడు. పాపం, ఆ సాయెబు నెత్తీ నోరూ కొట్టుకుని యెంత గోలపెట్టినా వినలేదు వాళ్ళు. ఆ సాయెబు ప్రాణాలు బలి తీసుకున్న తర్వాతగాని వాళ్ళు శాంతించలేదు. తర్వాత, నా మెడకొక పలుసేశి, స్వొంత వూరికి బయల్దేరాడా ముఠా మనిషి.

దారిలో ముసల్మానుల వ్వాళ్లున్నె. వాళ్లు నన్ను చూచి "చూశారా, పాపం యిది యే సాయెబు గాడిదో అయివుంటుంది; హిందూరౌడీలు పట్టుకుపోతున్నారు" అంటూ యితని మీాద దాడి చేశారు. ఇతనూ నెత్తీ నోరూ కొట్టుకున్నాడు; యెంతో గోలచేశాడు. వేడుకున్నాడు. ఐనా వినలేదు వాళ్లు. అతని ప్రాణాలక్కడే ఖతమ్! తర్వాత నా పలుపొక మౌల్వీసాహెబ్ పట్టుకున్నాడు. నన్నుతోలుకొని, మశీదువైపు బయల్దేరాడా మౌల్వీ. దార్లో, నే నా మౌల్వీగారి కాళ్ళా వేళ్ళా పడినంత పనిచేశాను.

నేను : నన్నొదిలెయ్యండి బాబూ!

మౌల్వీ : నిన్నెట్లా వదుల్తాను? నువ్వు మహదొడ్డవస్తువ్వి!

నేను : అయ్యా! నే నేం దొడ్డవస్తువుని? మామూలు గాడిదని! కాకపోతే యీ పాటికి నా ప్రాణాలూ హరీ మనేవి.

మౌల్వీ : సరే, ను వ్వొక సంగతి చెప్పు. నువ్వు హిందూవో, ముసల్మానువో చెబితే, తర్వాత యేం చేసేదీ నేను చెబుతా.

నేను : బాబయ్యా! నేను హిందువునీ కాదు; ముసల్మాన్నీ కాదు.

నే నొక గాడిదని. గాడిదలకు మతం వుండదుగా బాబయ్యా-

మౌల్వీ : నే నేసిన ప్రశ్నకి సూటిగాచెప్పు సమాధానం.

నేను : నే చెప్పింది నిజమేబాబూ! ఒక్కో హిందువూ గాడిద కావచ్చు. ఒక్కో మహమ్మదీయుడూ గాడిద కావచ్చు. కాని... గాడిద హిందువూ కాలేదు; ముసల్మానూ కాలేదు.

మౌల్వీ : నువ్వు పెద్ద బద్మాష్‌కి మల్లే వున్నావు. ఇంటికెళ్ళికాని నీ పని చెప్పను.

అని నన్ను తీసుకెళ్ళి, మసీదు బయటకట్టేసి, ఆ మౌల్వీగారు మసీదులోవలి కెళ్ళారు. నేను యిదే అదుననుకుని, ఆ తాడుకాస్తా కొరికి, తెంచుకుని, కాళ్లకి బుద్ధిచెప్పాను. ఒకటే పరుగు; వెనక్కి తిరిగిచూస్తే వొట్టు. ఇక ఈ సంకీర్ణహృదయుల తగాదాల్లో తల దూర్చ గూడదు. హిందువులకి సాయం చెయ్యగూడదు; సాయెబులకీ సాయం చెయ్యగూడదు" అని నిర్ణయించుకున్నా. పగలల్లా యే చెట్టునీడనో పండు కోవడం; యే పొలంలోనో, మైదానంలోనో పడి యింత తినడం; చీకటి పడగానే రోడ్డునేపడి ప్రయాణం చెయ్యడం. యిలా నా నా ఇబ్బందులూ పడి, ఢిల్లీ చేరుకునేటప్పటికి నాలుగైదు నెలలు పట్టింది.

## ఢిల్లీ నగరం

ఉత్తరాన నిర్వాసితులు, దక్షిణాన నిర్వాసితులు, తూర్పున నిర్వాసితులు, పడమట నిర్వాసితులు; మధ్య ఇండియారాజధాని ఢిల్లీ. ఢిల్లీలోకల్లా కళ్ళకు కొట్టొచ్చినట్టు కనిపించేది సినిమా ప్రకటనలూ, వ్యాపార ప్రకటనలూ! అందులోనూ నపుంసకతైలం, శక్తివర్ధక ఔషధం, ధాతుపుష్టి మాత్రలు... వీటికి సంబంధించిన ప్రకటనలు కళ్ళు చెదిరేట్టు కన్పిస్తూవుంటాయి. ఒకనాడు నేను చాందినీచౌక్‌లోంచి వెళ్తున్నా. ఎదురుగా ఒక 'టాంగా' (గుర్రబ్బండి)లో ఒక సుందర యువతి వస్తోంది. ఆవిడ నెత్తిమీద చీరకొంగు సవరించుకుంటూ, ముందున్న అద్దంలో చూచి, వంకెలుజుట్టు నొక్కుకుంటూ నేనే అప్సరసనన్నట్టు మురుసుకుంటోంది. కాళ్ళనున్న కాశ్మీర్ చెప్పుల

జలతారు నగిషీని చూచుకుంటూ అర్ధనిమీలిత నేత్రాలతో ఆనంద పరవశమైపోతోంది. చూద్దునుగదా? ఆ కాలిచెప్పు ఆనిన దిమ్మమీద "అసలు సిసలైన ధాతుపుష్టి మాత్రలు ఇంద్రసింగు జిలేబీవాలా దగ్గర దొరుకుతాయి" అని పెద్ద పెద్ద అక్షరాలతో ఓక చిన్న వ్యాపార ప్రకటన! నా కదిచూస్తే నవ్వొచ్చింది. ఆపుకోలేక, చాందినీ చౌక్ నడిబజారులో నిలబడి డొక్కలదిరేట్టు నవ్వడం మొదలెట్టా. దారేపోయే వాళ్ళు నా గాడిదనవ్వు చూచి పనులు మరిచిపోయి పరకాయించి చూడ్డం ప్రారంభించారు. వాళ్ళు నా గొంతు విని నవ్వుతూంటే; నేను వాళ్ళ నాగరికతని చూచి నవ్వా. ఇంతలో ఒక పోలీసొచ్చి, చేతికర్రతో నన్ను నాలుగు పుచ్చుకొని టౌన్‌హాల్ వైపుకి తరిమాడు. అప్పుడప్పుడూ గాడిదలుగూడా నవ్వుతాయనీ, మానవుల్ని చూచి గాడిదలూ నవ్వొచ్చు ననీ బహుశా వాళ్ళ కెవళ్ళకీ తెలిసుండదు.

అన్నట్టొకటి చెప్పడం మరచిపోయాను. ఢిల్లీ వొచ్చేవాళ్ళందరూ ఒక సంగతి గుర్తుపెట్టుకోవాలి. ఢిల్లీలో వెళ్ళడాని కనేక దర్వాజా (గేట్) లున్నై! ఢిల్లీ దర్వాజా, అజ్మీరీ దర్వాజా, తుర్కిమాన్ దర్వాజా యిత్యాది. కాని యీ దర్వాజాల్లోగుండా ఢిల్లీ లోపలికి వెళ్దామనుకుంటే మళ్ళీ మీరు పప్పులో కాలేసినట్టే. ఎందుకనంటే యీ దర్వాజాల దారికడ్డంగా గేదెలూ, ఆవులూ, ఎడ్లూ పండుకునుంటై. ఇవి లేకుంటే మధ్యలో మంచాలేసుకుని పోలీసులు గురకలు కొడుతుంటారు. కాకపోతే యీ దర్వాజాల కటూ యిటూ బోలడన్ని పక్కదారు లుంటై. ఆ దారులంటబడి ఢిల్లీలో కెళ్ళొచ్చు. ఇంగ్లీషువాళ్ళుగూడా యిక్కడొక గేట్ (దర్వాజా) కట్టించారు. ఇండియా గేట్. అందులోంచీ లోపలి కెళ్ళేందుకు వీల్లేదు. ఢిల్లీలో యిళ్ళకూ కూడా యిలాంటి దర్వాజాలే పెడితే, జనం కిటికీల్లోంచి ప్రవేశ, నిష్క్రమణలు చేసినా చూచి అబ్బురపడవలసిన పనుండదు.

ఢిల్లీలో కొత్తఢిల్లీవుంది. కొత్త ఢిల్లీలో కొన్నాట్ ప్లేస్ వుంది. కొన్నాట్ ప్లేస్ చాలా చక్కని ప్రదేశం. సాయంకాలంపూట అక్కడ జనం లోహ గార్ధభాల మీద యెక్కి పూరికే చెక్కర్లు కొడుతూండడం గూడా చూశాన్నేను. ఈ లోహ గార్ధభాలు మాకంటే వేగంగానే

పరుగెత్తగలవు కాని, మాలా అరవడం చేతగాదు వాటికి. ఇక్కడ చాలమంది గొర్రెచర్మం కప్పుకుంటారు. ఆడవాళ్ళు ముహానికీ, గోళ్ళకీ రంగువేసుకుంటారు; జుట్టు నెత్తిమీది కెగదువ్వి రిబ్బన్లు కడతారు. దూరానికచ్చంగా అవి గాడిదల చెవులల్లాగా కన్పిస్తాయి. గాడిదలు కావడం వాళ్ళ కెంత సరదాయో అది చూచింతర్వాతగాని తెలియలేదు నాకు.

నేనలా కొన్నాట్ ప్లేస్‌లోంచి ఇండియా గేట్ వైపుకి బయల్దేరాను. ఇండియా గేట్ దగ్గర యెటుచూచినా చక్కని పచ్చటిగడ్డి పరిచినట్లుంది. కడుపులో పేగులు కిలకిలలాడేంతటి కమ్మనివాసన. రెండు మూడు రోజుల్నుంచి కడుపుకాశాలుతూందేమో వంచిన తలెత్తకుండా ఆ పచ్చిక బొక్కడం మొదలెట్టాను. ఉన్నట్టుండి నా వీపు విమానం మోతమోగింది. నేను అదరిపోయి వెనక్కి తిరిగిచూశాను. పోలీసు నిలబడున్నాడు. చేతికర్ర పైకెత్తి రెండోదెబ్బ వేశేందుకు సిద్ధంగా "ఈ పాడుగాడిద యిక్కడి కెట్టావొచ్చి చచ్చింది" అంటూ.

"యేం భాయీ! కొత్త ఢిల్లీలోకి గాడిదలు రాగూడదన్నేమైనా రూలుందా?" అనడిగా న్నేను.

ఇకా పోలీసు పై ప్రాణాలు పైనే పోయాయంటే నమ్మండి. పాపం ఇదివర కెప్పుడూ మాటలు నేర్చిన గాడిదని చూచుండడు. కళ్ళింతచేసుకుని నావంక చూచాడు. తర్వాత కాస్సేపటికి తేరుకుని, నా మెడ కొక తాడేసి పోలీసు స్టేషన్‌కి లాక్కెళ్ళాడు. అక్కడ హెడ్ కాన్‌స్టేబుల్ ముందు నిలబెట్టాడు నన్ను.

"దీన్నిక్కడి కెందుకు తీసుకొచ్చావు, రామ్‌సింగ్?!" అనడిగాడు హెడ్‌కాన్‌స్టేబుల్, కాన్‌స్టేబుల్‌వంక ఆశ్చర్యంగా చూచి.

"ఇదొక గాడిదండీ!" అన్నాడు రామ్‌సింగ్.

"గాడిదేలే నాకూ కనబడతానేవుంది. దీన్నిక్కడి కెందుకు తెచ్చావ్ అనడుగుతున్నా."

"అది ఇండియా గేట్ దగ్గర గడ్డి తింటాందండీ!"

"అది గడ్డితింటే నీ కేమయ్యా! నీ బుద్ధి గడ్డితిందా? ఈ నోరు లేని జంతువు నిక్కడికెందుకూ తేవడం? ఆ బందులదొడ్లో పెట్టక!"

రామ్‌సింగ్ నావంక సగర్వంగా చూశాడు. చూచి "అయ్యా! ఇది నోరులేని జంతువుకాదు. మాట్లాడుతుంది!" అన్నాడు. హెడ్ కానిస్టేబుల్‌కి మరీ చిర్రుమంది. "రామ్‌సింగ్! నీకు మతేమన్నా పోయిందా?"

"లేదండీ, ఆ కాన్‌స్టేబుల్‌గారనేది అక్షరాలా నిజమే" అని నెమ్మదిగా తలూపుతూ అన్నా న్నేను.

దెయ్యాన్ని చూచినట్టు కుర్చీలో యెగిరిపడ్డాడు హెడ్‌కాన్‌స్టేబుల్. న్యాయాని కతనంత ఆశ్చర్యపడ్డంలో తప్పూలేదు. ఎందు కనంటే — కొత్త ఢిల్లిలో గాడిదలా మాట్లాడే మనుష్యులు చాలామంది వుంటే వుండొచ్చుగాక; కానీ, నాలా గాడిదలావుండి, మనుషుల్లా మాట్లాడేవాళ్ళని ఆయన కనీ వినీ యెరిగుండడు. అంచేత పాపం అతని తలతిరిగిపోయింది. ఏం చెయ్యాలో తోచినట్టులేదు. కాస్సే పటూ, యిటూ చూచి, ఆలోచించి చివరి కొక రిజిస్టర్ తీసి—

"నీ పేరు?" అనడిగాడు హెడ్ కాన్‌స్టేబుల్.

"గాడిద."

"తండ్రి పేరు?"

"గాడిద."

"తాత పేరు."

"గాడిద."

"యేం వాగుడది, తలా తోకా లేకుండా?" అన్నాడు కోపంగా. "అందరి పేరూ వొకటేనా!" నవ్మొద్దూ, నన్ను చూడు; నాపేరు జ్యోతిసింగు. మా నాన్నపేరు ప్యారేలాల్. మా తాతపేరు జీవన్‌దాస్ అట్లా నిజం చెప్పాలి. కాని యెందు కిట్లా అబద్ధమాడతావ్?" అని నావంక అనుమానంగా చూచాడు.

"అయ్యా! నే నబద్ధమాడడంలేదు. నేను చెప్పేదానికి తలా వున్నది. తోకా వున్నది; మీలాగా మా పేర్లు మారవు. తండ్రిపేరూ,

కొడుకుపేరూ, మనమడి పేరూ ఒకటిగానే వుంటుంది" అని విన్నవించుకున్నాను.

"అలా అందరి పేర్లూ ఒకటే ఐతే లాభంయేమిటి ?" అనడిగాడు జ్యోతీసింగ్.

"లాభం వుంది. ఇందువల్ల వంశావళిని తేల్చుకోవడం చాలా తేలికౌతుంది. ఉదాహరణకి మీ ముత్తాతగారి ముత్తాత పేరేమిటో చెప్పగలరా మీరు ?" అని వినయంగానే అడిగాన్నేను.

"లేదే !" అని విచారంగా నిట్టూర్చాడాయన.

"కాని, నేను చెప్పగలను ! మీలో పది పదిహేను తరాల నాటి వంశ పురుషుడి పేరు చెప్పగలగడం చాలా గొప్ప. ఎంతో వున్నత వంశంవారు గాని అలా చెప్పలేరు. నేను చూడండి, పదహారు తరాలు కాదు పదహారు యుగాలకిందటి మా వంశ పురుషుడి పేరు గూడా చెప్పగలను : శ్రీ గాడిద! మరి మా గాడిదలు, మీకంటె వున్నత వంశానివౌనో కాదో మీరేచెప్పండి."

జ్యోతిసింగ్ కనురెప్ప వాల్చకుండా చూశాడు నన్ను. ఉన్న కొద్దీ అతని అనుమానం పెరిగింది. రామసింగ్‌ని దగ్గరికి పిలిచాడు. ఇద్దరూ గుసగుస లాడుకున్నారు :

జ్యోతి. సిం : వీడు చాలా ప్రమాదమైన మనిషికిమల్లేవున్నాడు. మొత్తం మీద యే విదేశ గూఢచారో అయ్యుంటాడు. వేషం వేసుకుని ఢిల్లీ బజారులో తిరుగుతూ వుండుంటాడు.

రామ్‌సింగ్ : ఔనండి. వీడిచర్మం తీసిచూస్తే మంచిది. లోపలున్న మనిషి బయటపడతాడు. బయట పడగానే బేడీలేసి, జెయిల్లో పెట్టెయ్యొచ్చు !"

జ్యో సిం. : నిజమే. నువ్వనేది నిజమే. ఎందుకైనా మంచిది. ఈ సంగతి సబిన్‌స్పెక్టర్ చానన్‌రామ్‌గారికి చెప్పి, వారి ఆర్డర్ తీసుకునిచేయడం మంచిది. పద ఆయనగారి దగ్గరికెళ్దాం.

వాళ్ళు గుసగుసలాడుకుంటున్నాం అనుకున్నారుగాని, నేనంతా వింటూనేవున్నా. నేనుగూడా నెమ్మదిగా వాళ్ళ వెంటే సబిన్‌స్పెక్టర్ గారి గదిలోకెళ్ళా.

చానన్‌రామ్‌గారి మీసాలు తేలుకొండేల్లా పైకినిక్కిబొడుచుకున్నైన్నె. ఆయన మొహం పేలాలేగుతూన్నట్టుంది. ఆయ నింతవరకెప్పుడూ నవ్విగాని, మందహాసంచేసిగాని యెరుగడు. అథవా పొరపాటు నెప్పుడైనా అలా నవ్వివున్నా చూసినవా ళ్ళెవ్వళ్ళూ లేరు. అందుకనే ఆయన చాలామంచి పోలీసాఫీసరని పేరుపడింది.

వాళ్ళు చెప్పిందంతా విన్నాడు సబిన్‌స్పెక్టర్. నావంక మిర్రి మిర్రి చూశాడు. "ఐతే, నువ్వు పాకిస్థాన్ గూఢచారి వన్నమాట?" అన్నాడు.

నేను మాట్లాడలేదు.

ముందున్న బల్లమీద గట్టిగా గుద్ది "తెలిసిందిలె, నువ్వు రష్యా ఏజెంటువి" అన్నాడు.

ఐనా, నేను మాట్లాళ్ళేదు.

పళ్ళు పటపటా నూరాడు సబిన్‌స్పెక్టర్ : "బద్మాష్ ! ఫూల్ ! రాస్కెల్ ! కమ్యూనిస్టు ! సున్నంలోకి ఎముక లేకుండా యిరగ్గొడతా నిన్ను. చెపుతావా, చెప్పవా ? ఎవరవ్ నువ్వు !" అంటూ కారాలూ, మిరియాలూ నూరాడు.

నూరి వూరుకున్నాడా లేచి యిష్టంవొచ్చినట్టు అడ్డగోలుగా తన్నడం మొదలెట్టాడు నన్ను. కొట్టికొట్టి చేతులు చచ్చుబడిపోయినై అతనికి. నేనూ ఆ బాధ భరించలేక ఆర్తనాదం చేశాను. నా గొంతు విని, నాకేసి ఆశ్చర్యంగా చూశాడు. తర్వాత రామ్‌సింగ్‌ని చూచి "అరే, యిది వొట్టి గాడిదరా! ఇదేదో విదేశీగూఢచా రంటా రేమిటి మీరు! నాతోనటరా హాస్యం మీకు? ఆగండి మిమ్మల్ని డిస్మిస్‌చేస్తేగాని ..." అంటూ వాళ్ళమీద విరుచుకుపడ్డాడు.

రామ్‌సింగూ, జ్యోతిసింగూ యిద్దరూ గడగడ వణికిపోయారు. చేతులు రెండూ జోడించి, "అయ్యా! యిప్పటిదాకా యిది మా గదిలో మాట్లాడిందండీ, అచ్చంగా మనుషులికిమల్లేనే మాట్లాడిందండీ" అంటూ కాళ్ళా వేళ్ళా పడడం మొదలెట్టారు.

"ఏడిశారు. పని చేసిచేసి మీ మెదడు నిద్రపోయుంటుంది. ఆ నిద్రలో కలలు కనుంటారు. సంతోషించండాంగాని దీన్నిక్కణ్ణుంచి

తోలుకుపోయి బందుల్దొడ్లో పెట్టండి. పొండి. మూణ్ణాలుగు రోజుల్లో దీని ఖామందొస్తే సరేసరి. లేకపోతే వేలాం వెయ్యండి.'

బ్రతుకు జీవుడా అని బయట బడ్డాను. నేనేశిన యెత్తు పారింది ఆ యెత్తు వెయ్యకుండా, నేను మాట్లాడం మొదలెడితే వాళ్ళు నన్ను చచ్చినా వదిలేవాళ్ళుకాదు. లోప లెవడో గూఢచారున్నాడని నా చెర్మం వొలిచి మరీ చూచేవారు.

మూణ్ణాలుగు రోజులు కాదు; వారం రోజులు చూచారు నన్ను బందులదొడ్లో పెట్టి. ఖామందు వుంటేగా వొచ్చేందుకు. తర్వాత వేలం వేశారు నన్ను. ఆ వేలంలో ఒక చాకలిపేర కొట్టేశారు నన్ను. అతని పేరు రాముా. యమునానది కవతలివొడ్డునవున్న కృష్ణనగరంలో వుండే వాడతను.

రామూది కృష్ణనగరం అని చెప్పాను గదూ. అంతే మొద ట్నుంచీ అతని దదేవూరని కాదు. ఏదో వూరునుంచి యీ వూరు వలసొచ్చాడు. ఆ పాత వూళ్లో వాళ్ళందరూ పాకిస్తాన్ వెళ్ళిపోయా రట. మిగిలిన వాళ్ళెవళ్లయినా వుంటే వాళ్ళకి చాకలి అవసరమే లేక పోయింది. ఎవరిగుడ్డలు వాళ్లే వుతుక్కునేవాళ్ళు; అంత బీదలు. అందు కని అతనీ యమునానది వొడ్డునవున్న కృష్ణనగరాని కొచ్చాడు. మొత్తంమీద యిక్కడ నేను బాగా వళ్లొంచి పని చేయాల్సొచ్చింది. ప్రొద్దున్నే లేవగానే నా మీదన్ని గుడ్డల మూటలేసి చాకిరేవుకి బయ ల్దేరేవాడు రామూ. రేవుకెళ్ళగానే, యమునానదిలోదిగి, 'వుష్షో — వుష్షో' అంటూ చాకిరం మొదలెట్టేవాడు. మధ్యాహ్నానికతని భార్య అన్నంమూట పట్టుకునొచ్చేది. అప్పటి కుతికిన బట్టలు తీసుకుని నా మీదేశి యింటికి తోలుకెళ్ళేది యిస్త్రీ చెయ్యడానికి. మళ్ళీ చాకి రేవుకొచ్చి, రామూ పనయ్యేదాకా అక్కడే యమునానది గట్టున గడ్డిమేస్తూ వుండేదాన్ని. యమునానది పంతెన మీదుగా పోయే జనాన్ని చూస్తుండేదాన్ని. పనిపూర్తి కాగానే మళ్ళీ నామీద మూట వేసి,తానుగూడాయెక్కి యింటిముఖం పట్టేవాడు రామూ. ఇంటికెళ్ళిం తర్వాత నన్నొకకట్టుగొయ్యకి కట్టేసి, నా ముందింత గడ్డేశావాడు. కాళ్లు రెండూ ఒక కుక్కిమంచంలో బారజాపుకొని గురకలు కొట్టే

వాడు. తెల్లవారింతర్వాత మళ్ళీ యథాప్రకారం, రోజూ యింతే. చాకిరేవునుంచి యింటికి, యింటినుంచి చాకిరేవుకి. ఇక పుస్తకాలూ, పత్రికలూ యెట్లా దొరుకుతై? బయటి ప్రపంచంలో యేం జరుగుతూందో? విజ్ఞానం అంటే యేమిటో? సినిమా అని దేన్నంటారో?

సంస్కృతి, సంస్కారం, నృత్యం, సౌందర్యం... వీటికీ, నా బ్రతుక్కీ సంబంధంలేకుండా పోయింది. నేనంటే ఫర్వాలేదు; గాడిద కాబట్టి. రాముా కుటుంబమూ, ఆ చుట్టుప్రక్కల యిళ్ళవాళ్ళూ గూడా అంతే. నాలాగానే నికృష్టజీవితం వెళ్ళబోస్తున్నారు. ఎంత మంచి మంచి గుడ్డ లొచ్చేవని వాళ్ళ యింటికి! చక్కని జరీచీరెలు, మెత్తని పూలక్రేపులు, మబ్బుల్లా యెగిరిపోయే పంచెలు, సిల్కు చొక్కాలు, ఉన్ని కోట్లు. రాముా, రాముా భార్య, రాముా కూతురూ వేసుకొనే బట్టలకీ, వాటికీ హస్తిమశకాంతరం. సాయంకాలం యమునానది దగ్గర్నుంచి యింటికొచ్చేప్పుడు, దార్లో పెద్ద పెద్ద సినిమా హాళ్ళు కన్పించేవి. ఆ హాళ్ళముందు జనం గుంపులు గుంపులుగా వుండేవారు. రాముా వాళ్ళందర్నీ చూచి నిట్టూర్చేవాడు. రంగు రంగుల బొమ్మలు గోడలమీదచూచి గుటకలు వేసేవాడు. రాముాకీ, అతనితోటి చాకళ్ళకీ సినిమా చూడాలనేవుండేది, కాని యెట్లా? జేబుల్లో డబ్బులుచూస్తే అటు సినిమా టిక్కెట్టుకో, యిటు నూకలకో దేనికో వొకదానికే సరిపోయేటట్టుండేవి. సరేలెమ్మని సినిమా వదులుకుని నూకలు కొనుక్కునేవారు. ఎవడన్నా దారితప్పి, ఆ పూట నూక లొదులుకుని సినిమాటికెట్టు కొన్నాడో, ఆ వేళ రాత్రి యింట్లో నానా హంగామా ఆలగోల, బాలగోల. ఒకసారి రాముా గూడా అదేపనిచేశాడు. ఆవాళ కల్లు తాగెళ్ళి సినిమా టిక్కెట్టు కొన్నాడు. నన్ను బయటెరిగున్న ఒక టాంగా (జట్కా) వాలా కప్పగించి లోపలికెళ్ళి హాల్లో కూర్చున్నాడు.

## టాంగా గుర్రాల సకిలింపు సంభాషణ

హాలుబయట మూడు నాలుగున్నై అలాంటి టాంగాలు. ఆ టాంగాల గుర్రాలు సకిలిస్తూ సంభాషణ ప్రారంభించినై. అందులో

వొక గుఱ్ఱం బాగా దొరగావుంది. ముహాన తెల్లనిమచ్చ. ఎవరిదో సొంత టాంగాగుఱ్ఱం. అందుకనేమో దాని మాటల్లో గర్వం వుట్టిపడుతోంది. ముందది మాట్లాడ్డం మొదలెట్టింది : "మా యజమానికి కొట్లాటల స్టంటు సినిమాలంటే యిష్టం. ఆ సినిమాలు చూచి బయటికి రాగానే కొరడా పుచ్చుకుని నాలుక్కాళ్ళ సవారీ వేయించుతాడు. ఒక పర్యాయం యేం చేశాడనుకున్నారు! సినీమా చూసొచ్చి, నడి బజారులో, సినీమాలో చూసినట్టు సవారీ వెయ్యమని నాలుగేశాడు నన్ను. చాలామందికి దెబ్బలు తగిలినై ఒక కుఱ్ఱాడు పాపం టాంగా కిందపడి చనిపోయాడు గూడాను. మా యజమాని పెద్ద షావుకారులే. కేసొస్తే ఆ చచ్చిపోయినతను వళ్ళు తెలవకుండా తాగి తూలుతూ బండికింద పడ్డాడని రుజువుచేసి, శిక్ష తప్పించుకున్నాడు".

ఇంతలో రెండో గుఱ్ఱం అందుకుంది : "నా టాంగాలో యిద్దరాడవాళ్లొస్తారు. వాళ్ళు సినీమా చూడ్డానిక్కాదు వొచ్చేది. మధుబాల యే ఫేషన్ చూపిస్తుందో చూద్దామనొచ్చారు. అందులో ఒకావిడ పెద్ద పర్సులో, కాగితాలూ, పెన్సిలూ గూడా తీసుకొచ్చింది. సినీమాహాల్లోకూర్చునే యెప్పటి కప్పుడు మర్చిపోకుండా గీసేస్తుందిట. ఆ రెండో ఆవిడతో చెబుతూంటే విన్నా."

మూడో గుఱ్ఱం మొదలెట్టింది. "మా యజమాని మంచి మర్యాదస్తుళ్లే. వారానికొకసారి తన ప్రేయసిని కలుసుకోడాని కొస్తూంటాడు యిక్కడికి. పాపం ఆ యమ్మాయి చాలా బీదదట. అందుకని సినీమా చూపిస్తాడు. కావాలంటే కొత్తఢిల్లీకి తీసికెళ్లి యింతకంటే మంచి సినీమాహాల్లోనే కూర్చో బెట్టగలడు కాని, యెగిరిన వాళ్లెవరైనా యెదురు బడితే? మర్యాద మట్టిపాలు కాదూ? అందుకని యిక్కడికే తీసుకొస్తాడు."

నేనూ వుండబట్టలేకపోయాను. అవి ఉన్నతజాతి గుఱ్ఱాలని తెలిసి, సిగ్గుపడుతూనే "ఏమండీ, ఇదేం సినిమా?" అని అడిగేశాను.

నా ప్రశ్నవిని ఆ గుఱ్ఱాలు నావంక చూచాయి. ఆ చూపుల్లో యెంత అసహ్యంవుందని. "గాడిదనిపించావు మొత్తానికి!" అన్నట్టున్నై

ఆ చూపులు. అలా చూచి, పగలబడి నవ్వినై వూరికే సకిలించేస్తూ. నవ్వి, నా ప్రశ్నకి జవాబు చెప్పకుండానే, మళ్ళీ వాటి మాటలది మొద లెట్టినై. నాకు చిన్నతనంవేసి వూరుకున్నాను.

కాస్సేపున్న తర్వాత, హాల్లోపల గంటమోగింది. "ఇంటర్వెల్ అయ్యిందనుకుంటా" అంది దోరగుర్రం.

ఇంకాస్సేపటికి సినిమాగూడా ఐపోయింది. రామూవచ్చి నామీం దెక్కాడు. చూసొచ్చిన సినిమాలో పాటలు దిక్కులు దద్దరిల్లేట్టు పాడ్డం మొదలెట్టాడు. ఇంతకుపూర్వం అతను తోలుకెళ్ళేవాడు నన్ను ఇంటికి. ఇవాళ తను బాగా తాగివున్నాడు కదూ, ఇంటికి దారి నేనే చూపించ వలసొచ్చింది. దార్లో మూణ్ణాలుగుసార్లు దొర్లి క్రింది పడబోయాడు; నేనే యెలాగో సర్దుకుని మొత్తాని కింటికి జేరేశాను. ఇంటి కెళ్ళిం తర్వాత అతని భార్య వూరూ, వాడా యేకంచేసింది. వొచ్చిన నాలుగురాళ్ళూ సినీమాకి పెట్టాడుగదూ రామూ. అందుకని ఆ పూస యింట్లో పొయ్యిలో పిల్లి లేవదులే. పిల్లలు అంగలార్చి అట్లాగే నిద్రపోయారు. భార్యా భర్తలమధ్య రామరావణ యుద్ధం జరిగింది.

"నువ్వు కల్లెందుకు తాగినట్టు? సినిమాకెందు కెళ్ళినట్లు. ఇంట్లో అన్నీ నిండుకున్నయ్యని తెలుసుగదా నీకు? తెలిసిగూడా యీ పనెందుకు చేసినట్టు?" అని భార్య.

"తెలుసు, యేం జెయ్యను? బుర్రలో "హుష్షా హుష్షా!" అంటూ ఒకటే రొద. ఆ రొదతో బుర్ర పగిలిపోతందేమో అనిపిస్తంది. ఆ రొద వినబడకుండా వుంటానికని కల్లు తాగబుద్దేస్తుంది. నేను మాత్రం రోజూ చూస్తన్నానా సినిమా? ఒట్టు. ఆర్నెల్లతర్వాత యివ్వాళెళ్ళాను. ఈ గలీజు బజారు గలీజంతా చూచి చూచి, ఈ కంపిక భరించలేక కాస్సేపా సినిమాహాల్లో కూర్చుని ఆ మంచిమంచి బొమ్మ లన్నీ చూద్దామనిపించింది. ఇది గూడా పాపమేనా? ఒక చక్కటి యిల్లు చూచాను. అందమైన డాన్సుచూచాను. పాలబుగ్గల పసిపిల్లల్ని చూచాను. మన పేటంతా గాలించిచూచినా కనిపించని అందమైన ఆడాళ్ళని చూచాను" అని భర్త.

"ఛీ, యింటిల్లిపాదీ కడుపులూ యెండగట్టి, నువెళ్ళి సినిమాలు చూస్తావా ? సినిమాలు !" అంటూ రాముా చెంప ఛెళ్ళు మనిపించింది భార్య.

రాముా యెదురుతిరగలేదు. "నేను మాత్రం తిన్నానా ? నాకూ ఆకలిగానేవుంది. కడుపుకాలితే నిజమే, అంతకంటే కష్టం యింకొకటుండదు. కాని ఒక్కోసారి కడుపుఆకలికంటే మించిన ఆకలిగూడా కలుగుతుంది. నేను చాకలినైతే మాత్రమేం ? నేనూ మనిషినే, నాకూ కలుగుతుంది, ఆ రెండో ఆకలి. మనసులో యేదో భట్టీపెట్టినట్టు రగులుకుంటూ వుంటుంది ..." అంటూ యేమిటేమిటో అన్నాడు.

ఆవేళ రాత్రి నాముందింత గడ్డివేశినవాళ్ళుగూడా లేరు. ఒక వైపున కడుపు కాలుతూనేవుంది. రెండోవైపున రాముా చెప్పింది నిజమేనని ఆలోచిస్తూ కూర్చున్నా. రాముా నాలా గాడిద కాదుగదా, వూరికే గుడ్డలటూ యిటూ మోశి, రోజుకు రెండుసార్లు కడుపులో యింత పడేశి, కూర్చోడానికి ? రాముా మనిషి. అతని కొక్క కడుపాకలేగాదు; యింకా చాలా రకాల ఆకలి వుంటుంది. మంచి మంచి గుడ్డల ఆకలి, సుందరాకృతుల్ని చూడాలన్న ఆకలి. సుందర దృశ్యాల్ని చూడాలన్న ఆకలి. నాకు బాగా గుర్తు. ఒక్కోసారి యమునా నది దగ్గర యెంత చక్కని సూర్యాస్తమయ దృశ్యం కనిపిస్తుందని. బంగారంతెచ్చి యమునా జలంలో కలిపి రంగరించేసినట్టుంటుంది. అది చూస్తూంటే గాడిదని నేనే తన్మయం ఐపోయేదాన్ని. కాని రాముాకి యిదేదీ చూసేఅవకాశమే వుండేదికాదు.

మొలబంటిలోతులో నిలబడి, మెడవంచి, ఒకటే చాకిరం. తన ప్రక్కనే యెంతమనోహర దృశ్యం ఆవిర్భవించిందో ఆగి చూచే ఆస్కారంగూడా లేదనితనికి. రాముా మనిషే ! కాని యేం లాభం. అతనికంటే నేనే మెరుగు. ఈ జీవితంలో, యీసంఘంలో, యీనాడు గూడా లక్షలాది జనం, కోట్లాదిజనం గాడిదలకంటే కనాకష్టంగా బ్రతుకుతున్నారంటే ...

ఆవేళరాత్రంతా యివే ఆలోచనలు. ఇలాంటివే యింకెన్నో ఆలోచనలు. కంటిమీాద కునుకులేదు. కడుపులో ఆకలిసంగతికూడా

మరచిపోయాను. కాని, రాముూదగ్గర తర్వాత వెంతో కాలం లేను. అంతే నాఅంతట నేను కావాలని అతన్ని వదలిపెట్టి పారిపోయానని కాదు.

నిజానికి నా కక్కడవుండడం చాలా కష్టంగానే వుండేది. చదువుకునేందుకు పత్రికలు దొరికేవికాదు; పుస్తకాలమాట యెత్తడానికే వీల్లేదసలు. పుస్తకం రూపంచూచి యెన్ని రోజులైందో. యమునానది చుట్టుపట్ల వున్నవాళ్ళదగ్గర పుస్తకాలు కొనగల తాహతుమాత్రం యెక్కడిది? చాలామందికి చదువే రాదు. మెదితే, కదితే పోట్లాటలూ, కొట్లాటలూ, ఏదో వొక పోట్లాటరావడం, ఆ కోపం అంతా యింటి గాడిదమీదో, పిల్లలమీదో చూపించడం. యీ తప్పంతా యెవరిది? మంచి మంచి మనుష్యుల్నికూడా పశువులుగా మార్చే ఆ పరిస్థితులదే కావచ్చు ఆ తప్పు. కాని ఆ పరిస్థితుల్ని కర్రతో చావ బాదలేరుగదా! వాళ్ళు. అందుకని యింటి గాడిదమీదికే దిగేది ఆ కోపం. అదేమీ చట్టవిరుద్ధమైనపని కాదుగదా!

ఇన్ని యిబ్బందులు పడుతూన్నా, రామూని వొదిలెళ్ళాలంటే కాళ్ళాడేవికాదు నాకు. రామూని జూస్తే నాకు విచారంవేసేది. జాలి కలిగేది. ఇంట్లోవాళ్ళని పోషించేందుకు ప్రొద్దుకూకులూ యేదో వొకపని చేస్తూనేవుండేవాడు. అలాంటి కష్టజీవి నెలా వదలగలను? కాని విధివైపరీత్యం ...

ఒకనాడు ఎప్పటిలా యమునానదిలో దిగి చాకిరం చేస్తూనే వున్నాడు; ఒక మొసలొచ్చి రామూ కాలు పట్టుకుంది. రామూ వది లించుకోవాలని యెంతో యాతనపడ్డాడు. మధ్యాహ్నం – అటు వంతెనమీద బోలెడుమంది నడిచెళ్తున్నారు. ఒక రైలుబండిగూడా పరుగెత్తుతోంది. వంతెన కటూ యిటూ పోలీసులూ వున్నారు. రామూ గొంతెత్తి కేకలేశాడు. కాని ఆ మొసలి అతని మొరలు విననేలేదు. రామూని లాక్కుని లోతునీళ్ళల్లో కెళ్ళిపోయింది.

రామూ, చనిపోయాడని తెలిసి అతనికి గుడ్డలేశేవాళ్ళందరూ విచారించారు. వేసిన గుడ్డలు పోయాయే అని అంతకంటే యెక్కువగా విచారించారు. వాళ్ళే కొంతమంది వొచ్చి, రామూ భార్యతో

తగాదాకూడా పెట్టుకున్నారు. ఒక వైపున భర్త పోయాడని, ఆవిడ నెత్తీ నోరూ కొట్టుకుని యేడుస్తూంటే వీళ్ళు రావటం, మా షిఫ్ఫాన్ చీరేమైంది; మేం మొన్నే బోలెడు డబ్బోసి కుట్టించుకున్నాం, ఆ జాకెట్టేమైంది, చూడు చూడు, ఆ మాసిన బట్టల మూటలో వున్నా యేమో చూడు, అంటూ వూపిరాడ నివ్వకపోవటం.

నాకిదంతా చూస్తే చీమలూ జెర్రులూ పాకినట్టయింది. మేం గాడిదలమే అయినా, మాలో యెవరైనా చనిపోతే, వెళ్ళి వాళ్ళ భార్యాబిడ్డల్నిలా వేదించుకు తినడం నేను చూచెరగను.

ఏది ఆగినా కాలం ఆగదుగదా. కొంతకాలానికి రామూ భార్యా బిడ్డల పరిస్థితి దుర్భరమైపోయింది. తినడానికి తిండిలేదు. పస్తులే పస్తులు. చాకలిపేట పెద్ద, రామూ భార్యమీద యెప్పట్నించో కన్నేశుంచాడు. అదును దొరగ్గానే, యింత పప్పూ, వుప్పూ పంపాడు. ఒకనాడు సాయంకాలాని కల్లా తానూ సిద్ధమయ్యాడు బాగా కల్లు తాగి. ఇక్కడెందుకు, మా యింటికొచ్చెయ్యంటూ రామూ భార్యని బలవంతం చెయ్యటం మొదలెట్టాడు.

రామూ భార్య బాగా మొహం వాచేట్టు చీవాట్లు పెట్టింది వాడికి. నోటి కొచ్చిన తిట్లల్లాతిట్టి, యింట్లోంచి బయటికినెట్టి, నెత్తి పట్టుక్కూర్చుని యేడవడం మొదలెట్టింది. నేను దగ్గరకెళ్ళి, "అమ్మా, యేం ఫర్వాలేదు. గాభరాపడకండి. నేనున్నాగా" అని దిలాసా యిచ్చాను.

నా మాటలువిని, ముందు తన చెవుల్ని తానే నమ్మలేక పోయింది రామూ భార్య. నేను మళ్ళీ ఆ మాటలే అనేప్పటికి నావంక అలాగే చూస్తూ వుండిపోయింది. కొత్త ఢిల్లీనుంచి వొచ్చింతరువాత యింతవరకెవరితోనూ నేను మాట్లాడలేదు. ఇదే ప్రథమం. రామూతో మాట్లాడవలసిన అవసరమే కలగలేదు. నా మాటలు విని రామూభార్య గాభరాపడిపోయింది. మొత్తంమీద దెల్లాగైతేనేం నేను మాట్లాడడంలో పెద్ద ఆశ్చర్యమేమీ లేదనీ, ఇందులో చమత్కారం అంతకంటేలేదనీ, ఇదంతా పరిస్థితుల ప్రభావమేననీ నచ్చచెప్పేప్పటికి నా తాతలు దిగొచ్చారు.

"అమ్మా, నిజమే! నేను గాడిదనె! కాని, యిన్నిరోజుల్నుంచీ మీ యింటి వుప్పుతిన్నాను గదా. మీ రేమో విచారించొద్దు, ఈ పిల్లల్ని పెట్టుకుని యింట్లోనే కూర్చోండి, నేను చేయగలిగినంతా చేసుకొస్తాను" అనన్నాను రాము భార్యతో.

"నువ్వేం చేయగలవు? మాలాటి బీదా బిక్కీల కెవళ్ళూ సాయం చెయ్యరు" అన్నదావిడ.

"బీదవాళ్ళమైతే మాత్రం యేమమ్మా? యిప్పుడు రాజ్యం మనదే. జీవితం మనది. సంఘం మనది. ఇప్పుడు మనం స్వతంత్రులం. ఏది చెయ్యాలన్నా చెయ్యొచ్చు. మీకెందుకు, మీరు బాధపడ బోకండి. నే నివ్వాళే వెళ్ళి మీ తరఫున మునిసిపల్ ఆఫీసులో అర్జీ పెట్టొస్తాను" అని చెప్పిబయల్దేరా నేను.

కృష్ణనగర్ మునిసిపాలిటీ గుమాస్తా, పెద్ద గుమాస్తా అందరూ కలిసి పేకాట ఆడుకుంటున్నారు. నే వెళ్ళేప్పటికి పేకముక్కలు చేత్తో పట్టుకుని కాదు; ముందు పెద్దపెద్ద రిజిస్టర్లు తెరచి, ఆ రిజిస్టర్లలో పేక ముక్కలు పేర్చుకుని ఆడుకుంటున్నారు. నేను నెమ్మదిగా వెళ్ళి ఆ గుమాస్తావెనక నిలబడి, "అయ్యా, బలేకష్టం వొచ్చిపడిందండీ" అన్నాను, చెవిలో చెప్పినట్లుగా.

ఎవరో స్నేహితుడొచ్చి, తన వెనక నిలబడి, పేకాటనుచూచి తానంటే జాలిపడుతున్నాడని అనుకున్నాడులావుంది ఆ గుమస్తా. వెనక్కి తిరిగిచూడకుండానే, "నిజమే భాయీ, యేమాడాలో తెలపడం లేదు. ఇదిగో, యీ ముక్కేశానా, కోశేస్తాడు. పోనీ యీ ముక్కేద్దాం అంటే పెద్ద ముక్క యింకా కిందపళ్ళేదు..." అంటూ చెప్పుకుపోతున్నాడు.

నేను మాట మధ్యలోనే తుంచి, "చాకలిరాము చనిపోయాడు అనేశాను.

"చస్తే చచ్చాళ్ళేవయ్యా, ఈ ఆట పాలుపోక నేచస్తూంటే యెవడో చాకలాడు చచ్చాడని చెపుతావేంటి?" అంటూ విసుక్కున్నా డాయన. విసుక్కుంటూ వెనక్కి తిరిగిచూశాడు. నిలబడుంది

నేను. స్నేహితుడూకాదు, చట్టుబండలూకాదు. అగ్గిమీద గుగ్గిలమై పోయాడాయన. బంట్రోతుని పిలిచి, "గాడిదలుగూడా వస్తున్నై మనాఫీసులోకి ? కొట్టు, బయటికి కొట్టు ?" అంటూ కేకలేశాడు.

బంట్రోతొక కర్ర పట్టుకొచ్చి బయటికొట్టాడు నన్ను. కాస్సేపాగి, మళ్ళీ లోపలికి వెళ్ళా. నేను గుమాస్తాదగ్గర కెళ్ళి చెవులు రెండూ నిక్కించి, నమస్కారంచేసి "అయ్యా! ఆ చాకలి రాముా సంగతి ..." అంటూ విన్నవించుకోబోయాను.

గుమాస్తా తలెత్తిచూశాడు. కాని గాడిద మాట్లాడుతోం దేమిటా అన్న సందేహంకూడా కలగలేదా మహానుభావుడికి. జీవితం అంతా మాట్లాడే గాడిదల్తో, మాట్లాడడమే అలవాటైపోయిందో యేమో ఆయనకి. "సరే, చెప్పే దేమిటో తొందరగా చెప్పు" అన్నాడు.

"అయ్యా, నా దొక మనవి. ఈ భృత్యుడు చాకలి రాముా గాడిద. యమునానదిలో గుడ్డ లుతుకుతూంటే రాముాని మొసలేసుకుపోయింది. మూడురోజు లౌతుంది. పాపం, ఇంటిదగ్గర రతని పెళ్ళాం బిడ్డలు తిండిలేక మలమల మాడిపోతున్నారు."

"ఐతే, నన్నేం చెయ్యమంటావు ? నేనిక్కడేమన్నా అనాథాశ్రమం పెట్టా ననుకున్నావా ?" అంటూ యెగిరిపడ్డాడు.

అయ్యా, కోపగించకండి. చాకలి రేవుపన్ను వసూలు చేస్తారు గాదా మీరు. వంతెనమీదనుంచి బట్ట లేగాడిద మీదైనా వేసుకుని తీసుకెళ్తూంటే దానికీ పన్ను తీసుకుంటారుగదా. ఇన్ని పన్నులొసూలు చేసినా, పస్తులుండే ఒక బీదచాకలి కుటుంబానికి సహాయం చెయ్యలేరా ?" అనడిగాను దీనంగా.

"ఏం సాయం చెయ్యమంటావ్ ? మేం చంపామా వాణ్ణి ? మొసలి చంపింది !" అని, దీనికి సమాధానం చెప్పినట్టు చూశాడు సగర్వంగా.

"భలేవారండీ మీరు ! మీరు చాకలి రేవుపన్ను వసూలు చేసే దెందుకు? పన్ను వసూలు చేసినప్పుడు ఆ రేవులోకి మొసళ్ళొగిసళ్లొ

రాకుండా చూసే బాధ్యత మీదికాకపోతే యింకెవరిది ?" అన్నాను నేను కాస్త కారంగానే.

గుమాస్తా సామాన్యుడు కాదు. జిత్తులమారి. "చాకళ్లు అనవసరంగా మొసళ్ళతో తగాదా పెట్టుకుంటే యింతేజౌతుంది. రామూ చూచైనా వాటితో కాస్త స్నేహంగా మసులుకోమని చెప్పు మిగతా వాళ్ళకి !" అన్నాడు.

"అయ్యా, మీ రట్లా మాట తప్పించొద్దు. మీరేం చెయ్యగలరో చెప్పండి" అని సూటిగా అడిగేశాను.

ఇంకెట్లాగూ తనను వదల్ననుకున్నాడు గుమాస్తా. దాంతో కాస్త మెత్తబడ్డాడు. "అది కాదు నాయనా ! ఆ చాకిలిరేవు మా యిలాకాలోనిది కాదు; యమున రేవులన్నీ ఢిల్లీ మునిసిపల్ కమిటీ యిలాకాలోనివి; ఢిల్లీ టౌన్‌హాల్ దగ్గరికెళ్ళు, యికిక్కడుంచెళ్ళు" అని మళ్ళీ పేకాటలో పడ్డాడు.

నేను వెనక్కి తిరిగాను. యమునానది వంతెనమీదుగా వెళ్తూంటే అక్కడ గస్తీపోలీసు (సెంట్రీ) "యేయ్, ఎక్కడి గాడిదవ్ నువ్వు ? వెళ్తున్నావ్" అంటూ గదమాయించాడు.

"టౌన్‌హాల్‌కి" అని ముహంమీద కొట్టినట్టు ఠక్కున చెప్పాను సమాధానం.

"నీ ఖామందేడీ ?"

"నాకు ఖామందు లేడు. ఇవ్వాళ్టినుంచే నేను సర్వస్వతంత్రుణ్ణి!"

"ఇదెక్కడి తంతు ! స్వతంత్రం అంటే యజమాని లేకుండా పోతాడా ? ఎవరో వొకరుండుండాలి. నువ్వెవళ్ళ చెప్పుచేతల్లో వుంటావో చెప్పు.

"సరే, ముందు నీ కథ చెప్పు. నువ్వెవళ్ళ చెప్పుచేతల్లో వుంటావ్?" అన్నా న్నేను.

ఈమాత్రం తెలియదా అన్నట్లు, "హెడ్‌కానిస్టేబుల్!" అన్నాడు సెంట్రీ.

"ఆయన ?"

"సబినస్పెక్టరు! సబినస్పెక్టరుపైన డీయెస్పీ, డీయెస్పీ పైన ఐజి. ఇట్లాగే వజీరుగారిదాకా!" అన్నాడు విసుగ్గా.

"వజీరుపైన యెవరు?"

"వజీరుకి జీతం స్టేటుబ్యాంకిస్తుంది."

"ఆc. వజీరుకంటే పైన స్టేటుబ్యాంకు!"

"స్టేట్ బ్యాంకు పైన?"

"స్టేటు బ్యాంకులో డబ్బుంటుంది. ఈ మాత్రం తెలవటూ? స్టేటుబాంకు కంటే పైన డబ్బు!" అంటూ కోపంతో మండిపడ్డాడు సెంట్రీ.

"సరే, డబ్బుకంటే గొప్పయెవరు?"

"డబ్బుకంటే గొప్పా?" అంటూ బుర్ర గోక్కున్నాడు సెంట్రీ, కాస్సేపు. తర్వాత నన్ను చూచి, "డబ్బుకంటే గొప్ప యెవరబ్బా! నాకు తెలవదే. నీకేమన్నా తెలుసా" అనడిగాడు.

నే నేమని చెప్పేది. "నాదేముందయ్యా. నేనొక మామూలు గాడిదని. ఇంత కష్టమైన ప్రశ్నకి నేనెల్లా జవాబు చెప్పతాను? ఆc, నన్ను టౌన్‌హాల్ కెళ్ళనివ్వు, చాకలి రాముా కుటుంబానికి డబ్బు సాయంకోసం వెళ్తున్నాను. అక్కడి కెళ్ళింతర్వాత డబ్బుకంటే గొప్ప యెవరో తెలిస్తే వొచ్చి నీకు చెబుతాను" అన్నాను.

"తప్పకుండా చెప్పుతావా?" అనడిగాడు.

"ఓ, తప్పకుండా నే చెప్పుతాగాని, యేమిటి నువ్వింత వేగిర పడుతున్నావ్."

"ఏమీలేదు. డబ్బుకంటే గొప్పెవరో తెలిస్తే యీ పాడు ద్యోగం యెందుకు, అక్కడే నౌకరీ చేసుకోవచ్చుగదా అని" అన్నాడు.

"ఊc, తెలివిగలవాడిలాగానే వున్నావే!" - అంటూ సెంట్రీని వుబ్బేసి అంగలేసుకుంటూ వంతెన దాటాను.

## ఒక్క గాడిద, ఆరుగురు మనుషుల్తో సమానం!

ఎట్లాగైతేనేం టౌనుహాలు యెక్కడుందో కనుక్కున్నాను. ఇది వరకటిలాగా మామూలు గుమాస్తాని కలుసుకుని లాభంలేదు; ఈసారి

సూటిగా ఛెయిర్మన్‌గారి దగ్గరకే వెళ్ళడం మంచిదనిపించింది. మరి ఛెయిర్మన్‌గారిని కలుసుకోవాలంటే ఇంగ్లీషులో మాట్లాడితేతప్ప పని జరగదు. సరాసరి ఎంక్వయిరీ ఆఫీసుకెళ్ళి అక్కడి గుమాస్తాని, "ఛెయిర్మన్‌గారి ఆఫీసెక్కడ ?" అని యింగ్లీషులోనే డబాయించడిగేశాను.

గాడిద యింగ్లీషు మాట్లాడ్డం చూచి, ఆ గుమాస్తా అదిరిపోయాడు. కుర్చీలోంచి లేచి నిలబడి, "పదిహేనో నంబరుగది సార్. అదిగో ఆ 'లిఫ్ట్'లో ఎక్కితే వెళ్ళొచ్చు"అని చెప్పి, ఒక బంట్రోతుని పిలిచి నన్ను ఛైర్మన్‌గారి దగ్గరికి తీసికెళ్ళమని పురమాయించాడు. బంట్రోతు ఆశ్చర్యంగా చూశాడు నా వంక. అంతే. పెదవి కదపలేదు. బంట్రోతు తీసుకెళ్ళి నన్ను "లిఫ్ట్‌మాన్'కి అప్పగించాడు. అతను చాలా మర్యాదగా 'లిఫ్ట్' తలుపు తెరిచాడు. "లిఫ్ట్" లోపల "ఆరుగురు మాత్రమే" అని వ్రాసింది. కాని యెక్కింది నేనొక్కణ్ణే. మిగతా వాళ్ళందరూ బయటే వుండపోయారు. అప్పుడుగాని నా కర్థంకాలేదు. 'ఒక్క గాడిద ఆరుగురు మనుష్యుల్తో సమానం' అని. పైకెళ్ళేంతర్వాత ఛైర్మన్‌గారి గదిదగ్గరికెళ్ళి బయట కూర్చున్న బంట్రోతుతో "వెళ్ళి, అష్టవక్రగార్దభంగారొచ్చారని చెప్పు" అని చెప్పాను ఠీవిగా.

లోపలి కెళ్ళిన బంట్రోతు బయటికొచ్చి, దణ్ణంపెట్టగానే నేను లోపలి కెళ్ళి, బిగ్గరగా 'గుడ్‌మార్నింగ్' అనేశాను గట్టిగా. హిందూస్థానీలో మాట్లాడితే ఓ గాడిద ననుకుంటారేమోనని నా భయం. ఢిల్లీ ఆఫీసు లన్నిటిలోనూ యింతే. ఇంగ్లీషువాళ్ళ రాజ్యమైతే పోయింది గాని, ఇంగ్లీషుభాషా రాజ్యం యింకా అలాగేవుంది చెక్కు చెదరకుండా. ఉర్దూలోనో, హిందీలోనో మాట్లాడితే ఖాతరుచెయ్యని వాళ్ళంతా, యింగ్లీషు ముక్కలు నాలుగు గుక్క విడవకుండా విసరగానే వెనక్కితిరిగి చూస్తారు. బ్రహ్మరథం పడతారు. మనం పని మీద వెళ్ళినట్టే అనిపించదు. వాళ్ళే మనతో పనుండి నోరెళ్ళబెట్టి మనం చెప్పే మాటలన్నీ బెరుపోకుండా వింటున్నారా అనిపిస్తుంది.

ఛైర్మన్‌గారు నల్లగా, పొట్టిగా వుంటారు. మొహం మహా గంభీరంగా వుంటుంది. నాలుగైదు ఎలక్షన్లలో ఢక్కామొక్కీలు తిని ఆరితేరితేనేగాని రాని చాతుర్యమూ, తెలివితేటలూ, 'దూరదృష్టి

ఆయన కన్నుల్లో మిలమిలలాడుతూంటుంది. మనిషి మాంచి అనుభవజ్ఞుడు. అందుకనే గాడిదన్నేను గదిలో కెళ్ళినా, ఏ వొక్క రెప్పపాటు వులిక్కి పడ్డారో, అంతే; వెంటనే సర్దుకున్నారు. ఇక తర్వాత జీవితం అంతా యింగ్లీషు మాట్లాడే గాడిదల్తోనే గడిపినట్టు, మాట్లాడ్డం మొదలెట్టారు నాతో యింగ్లీషులో.

"దయచెయ్యండి" అన్నారు నవ్వుతూ.

"నేను కూర్చుంటే యీ కుర్చీ విరిగిపోతుంది. ఎందుకులెండి, నే న్నిలబడే వుంటాలెండి!" అన్నాను నేను నవ్వుతూ.

చైర్మన్‌గారు మళ్ళీ నవ్వారు; నే నన్నది నిజమేగదూ, అందుకని, ఒక్క క్షణంఆగి, "ఎందుకూ యింత పటాటోపంగా వచ్చారు. మామూలు దుస్తుల్లోనే రాకపోయారా!" అన్నారు.

"ఇది పటాటోపమూకాదు, పగటి వేషమూకాదు నిజమే!" అన్నా న్నేను.

"సరేలెండి, ఎవళ్ళ సరదా వారిది. ఆ మాటనటం నాదే తప్పు" అన్నారు చైర్మన్, చిరుకోపం అభినయిస్తూ. "అసలు యీ ఢిల్లీలో ఒక పెద్దమనిషి లాంతరూ, గంటా పట్టుకుని ఎన్నికల్లో పోటీచేసినప్పుడే అనుకున్నా యికనుంచెవర్ని గురించీ యేమీ అనకూడదని, మీరు కూడా కావాలంటే యీ గాడిదవేషంతోనే ఎన్నికల్లో పోటీచేయండి. ఏ వేషమైతేనేం, కావలసింది ఓట్లు. అవి పడితే మహాబాగే."

"అయ్యా, నేను దశావతారా లెత్తే మనిషిని కాదు. నిజంగానే గాడిదనే. నామాట నమ్మండి" అన్నాన్నేను.

ఐనా, చైర్మన్‌గారికి నమ్మకం కలగలేదు. "ఊరుకోండి సార్. ఇప్పటికి ఆరుఎలక్షన్లలో పోటీచేశాను. ఓటమి అన్నమాట యెరుగను. నా కంతా తెలుసు సార్. సరేగాని, మీ రేవార్డునుంచొచ్చారు?"

"కృష్ణనగర్ రేవు నుంచండి."

చైర్మన్‌గారి నెత్తిమీది జుత్తొకసారి సవరించుకున్నారు. ఓహో, ఐతే కృష్ణనగరం వార్డులో నిలబడ్డారన్నమాట. ఐతే ఏపార్టీ నిలబెట్టింది మిమ్మల్ని? కాంగ్రెసా, జనసంఘమా, ప్రజాసోషలిస్టులా, కమ్యూనిస్టులా? అంటే మీ రేపార్టీ ప్రతినిధులూ అని?"

"అయ్యో, నాదేం వుందండి. మీ దయవుంటే చాలు" అన్నాను నేను.

ఛైర్మన్‌గారు ముసిముసినవ్వులు నవ్వారు. ఎవడో దేవాంతకుడే నే! అనుకున్నట్లున్నారు. "చాల్లే, వూరుకోండి సార్. ఇంతకీ అసలు పనేమిటో చెప్పండి. నా వల్ల అయ్యే దేదైనావుంటే తప్పక చేస్తాను. కాని ఒక చిన్న షరతు. మీరు గెలిస్తే ఒక టీపార్టీ ..."

"చూడండి!" అంటూ మాటలమధ్యలో యిరకబోయాను గాని, వారా అవకాశమే యివ్వలేదు నాకు.

"మీ రే పార్టీ పేర గెలిస్తే నాకేం? ఛైర్మన్ పదవికి పోటీ వచ్చినప్పుడు మాత్రం మీ వోటు నా కెయ్యండి, సరేనా!" అంటూ చేయిచాచారు కరచాలనంకోసం. నేను నా చెవిని అందించాను. పట్టుకొని గట్టిగా వూపా రాయన. దాంతో ఇది నిజంగానే అసలు సిసలైన గాడిదచెవి అని గుర్తించివుంటారు. యిది పగటివేషమూ కాదు పాడూకాదు అని తెలిశుంటుంది. ఊరికే గాభరాపడిపోయారు. దాంతో నోట్లో చుట్టజారి, ముందున్న కాగితాల మీద పడింది. కాగితాలకి నిప్పంటుకుంది భగ్గుమన్నై.

"నా తప్పేమీలేదండీ. నేను మొదట్నుంచి చెబ్తూనేవున్నా నేనొక గాడిదనని. మీరే ఎనలేదు." అంటూ క్షమించమన్న ధోరణిలో చెప్పుతున్నాను.

ఛైర్మన్‌గారు కాగితాల కంటుకున్న నిప్పు ఆర్పాలని ప్రయత్నిస్తూ "నేను మీరు లాలా సంతరామ్‌గారనుకున్నా. కృష్ణనగర్ కాంగ్రెసభ్యర్థి ఆయనే" అన్నారు.

"ఐతే నేను సంతరామ్‌గారి లాగా కన్పించానా?"

"దాన్దేముందిలే. కొంతమంది బయటికి గాడిదలకి మల్లే వుంటారు. కొంతమందికి లోలోపల గాడిద బుద్ధుంటుంది. మీరు బయటా లోపలా గూడా గాడిదలే. ఐతే మరీ మంచిదిగదా, తప్పకుండా ఓటు నాకే వేస్తారనుకున్నా నేను. కాని యిదంతా వూరికే వృధా కాలయాపన ఔతుందని నాకేం తెలుసు?"

"నేను చెప్తూనే వున్నానండి. మీరు వినిపించుకోలేదు. నేను చాకలి రాముా భార్యా బిడ్డల ... ..."

"యిక మీరు నోరెత్తితే ఊరుకోను. ఊళ్ళోవున్న చాకలాళ్ళందరూ చనిపోయినాసరే. చూద్దంలా, నిప్పెట్లా అంటుకుందో ..." అంటూ బల్లమీదున్న గంట ఠపీ ఠపీ మని కొట్టారు ఛైర్మన్‌గారు.

నిప్పు నిజంగానే బాగా అంటుకుంది. ఛైర్మన్‌గారు గంటకొట్టి అగ్నిమాపకదళానికి ఫోన్ చేయించారు. నేనూ గదిలోనుంచి బయటికొచ్చి వరండాలో నుంచుని ఓంౘద పెట్టానుగట్టిగా. కాస్సేపట్లో గంట కొట్టుకుంటూ రెండు అగ్నిమాపక యంత్రాలొచ్చిపడినై. అన్నిటికంటే ముందు నన్ను నాలుగుతన్ని బయటికిగెంటి నిప్పు ఆర్పటం మొదలెట్టారు. ఇంకాస్సేపు యిక్కడ నిలబడితే, నువ్వే నిప్పెట్టావని జైల్లోకి తోసినా దిక్కుండదనుకుని, ఈసారి "లిఫ్టు" జోలికిపోకుండా గబాగబా మెట్లు దిగేశాను. క్రిందకొచ్చి, ఒక ముసలి గుమాస్తాతో రాముా కథంతా చెప్పాను. పాపం;మా ముసలి గుమాస్తా కళ్ళనీళ్ళు బెట్టుకున్నాడు. ఈ పాడుసంఘాన్నీ, యీ పనికిమాలిన రోజుల్నీ యీ ధనిక నియంతృత్వాన్నీ నాలుగు తిట్టాడు. తర్వాత నెమ్మదిగా నన్ను దగ్గరికి పిలిచి, "నువ్వొక రెండురూపాయలిచ్చావంటే నీ అర్జీరాసి పునరావాసశాఖకి పంపే యేర్పాటుచేస్తాను" అని చెప్పాడు మెల్లగా.

"నాదగ్గర రెండురూపాయ లెక్కడై? నేను చాకలి గాడిదని. రెండురూపాయలేవుంటే రెండుమళ్ళ పచ్చగడ్డీ, ఒక శేరు వులవలూ ..."

"రెండురూపాయలు పెడితేనేగాని నాకు యింజెక్షన్ రాదు. యిదిగో, యీ దగ్గుతో హతమారిపోతున్నా. రోజు కొక యింజెక్షన్ తీసుకోకపోతే వూపిరిగూడా ఆడదు" అంటూ ఖళ్ళుఖళ్ళున దగ్గడం మొదలెట్టాడతను.

నేనేం చెయ్యను. ఏమీ పాలుపోక నెమ్మదిగా జారుకున్నాను.

## పునరావాసశాఖ

వాళ్ళనీ, వీళ్ళనీ అడుగుతూ పునరావాసశాఖ ఆఫీసుకు చేరుకున్నా. ఆఫీసులో అడుగుపెట్టానో, లేదో ఆ గది అందం చూచి

మూర్ఛపోతా ననిపించింది. గదికిమధ్య ఒక పెద్ద ముక్కాలిపీటమీద ఒక చక్కని పూలకుండిలో రకరకాల రమ్యమైన పూలు నయనానంద కరంగా అమర్చబడివున్నై. ఒక మూల టెలిఫోన్ ఎక్స్ఛేంజ్. అక్కడే, ఒక అందాలభరిణె చేతి గోళ్ళకు రంగేసుకుంటూ కూర్చుంది. టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ బల్లనిండా లిప్‌స్టిక్ భరిణె, ఫేస్ క్రీమ్, పౌడర్ల డబ్బాలు పడివున్నై. ఇదేమిటి నేను పునరావాస శాఖ ఆఫీసనుకుని, ఈ మాక్స్ ఫాక్టర్ అలంకరణల ప్రదర్శనశాల కొచ్చానని గాభరా పడిపోయి, వెనక్కి తిరుగుదామని అనుకున్నానో, లేదో యింతలో ఆ అందాలభరిణె విశాలనయనాలు తెరచి, "యెస్ ప్లీజ్!" అంది నావం కెంతో ప్రేమగా చూస్తూ.

"నేను ... నే నొక చిన్నపని మీదొచ్చాను" అన్నాను బిడియం బిడియంగా.

ఆవి డొక స్విచ్‌నొక్కి "రామ్‌లు భాయీ! నీ కోసం యెవరో వచ్చారు" అంది టెలిఫోన్‌లో.

ఆ టెలిఫోన్ చెడిపోయిందో యేమో తెలియదు. లేకుంటే అదొక కొత్తరకం టెలిఫోనో యేమో. టెలిఫోన్‌కి రెండు వైపు లున్నవాళ్ళ మాటలూ చాల స్పష్టంగా వినిపించినై నాకు. ఆ యమ్మా యీమాట చెప్పగానే, అవతలివైపునుంచి, ఇప్పుడు నేను లస్సీతాగు తున్నాను. ఫస్ట్‌క్లర్క్ దగ్గిరికి పంపించెయ్యతన్ని" అనొచ్చింది సమా ధానం.

ఆ అందాల భరిణె, పెదవులకి రంగేసుకుని, ఫస్టుక్లర్క్‌కి టెలి ఫోన్ చేసింది.

"ఎవరు ?" అని ప్రశ్న ఆ చివరినుంచి.

"నేను నిర్మల్ని."

"అహో ప్రెయసీ!" అంటూ గేదెలా నిట్టూర్చాడు ఫస్ట్‌క్లర్క్.

"విను. పాపం యెవరో బీదతను ... "

అవతలతను యీ నిర్మల మాటలు కొనసాగనివ్వలేదు. "ఇక్కడి కెప్పుడూ బీదవాళ్ళే వొస్తార్లే. సరేగాని ఒక మాటడుగుతా చెబుతావ్

నిర్మలా ? నీ గొంతింత తియ్యగా వుంటుందేం ! యెంతసేపు విన్నా తనివే తీరదు! నిర్మలా ! నిమ్మో ! ! యివ్వాళ మొదటాట సినిమాకి ..."

నిర్మల టెలిఫోన్ పెట్టేశింది. తర్వాత బుగ్గలకి రంగేసుకుంది. మళ్ళీ ఫోన్ తీసి, డిప్యూటీ సూపరింటెండెంట్ కి ఫోన్ చేసింది. ఆయన "యిప్పుడుకాదు నిర్మలా. నేను బిజీగా వున్నాను. తీరికలేదు. సర్దార్ దర్బార్ సింగ్ గారని మిలిటరీ కాంట్రాక్టర్ లే. వొచ్చారు. ఇప్పుడిక్కడే వున్నారు. పాపం ఆయనా శరణార్థే. వాళ్ళ ఆస్తంతా పోయిందట. ఒక లక్షకావాలని కూర్చున్నాడు. ముందీపని చూడాలి. నీ దగ్గరకొచ్చినతన్ని యింకెవరిదగ్గరకన్నా పంపు" అన్నాడు.

"ఆలాగేనండి" అని నిర్మల టెలిఫోన్ పెట్టేసెయ్యబోయింది కాని, యింతలో మళ్ళీ అవతలినుంచి పిలుపు.

"హెలో, నిర్మలా !"

"సర్ !"

"ఆ చీరెనచ్చిందా నీకు ?" అనడగారు డిప్యూటీ సూపరింటెండెంట్.

"ఆ చీరకట్టుకునే వొచ్చానండీ ఆఫీసుకి !" అంటూ బడాయిగా చెప్పి ఫోన్ పెట్టేసింది నిర్మల. తర్వాత అద్దంతీసి, అందులో ముహం చూసుకుని, ఒక చిన్న చిరునవ్వు విసిరి, ముహానికి పౌడరద్దుకుని, మళ్లీ టెలిఫోన్ చేసింది.

"చూడండీ !" అన్నది టెలిఫోన్ లో

"ఓహ్హో ! యిక్కణ్ణుంచి నిన్ను చూచేదెట్లా ! ఇది టెలివిజన్ టెలిఫోన్ కాదే ! యిక్కడికి రారాదూ ?" అని అవతలి గొంతు.

నిర్మల కిలకిలా నవ్వింది. "ఒక బీదతను యేదో సాయం కోసం ..."

"మాకూ కావాలే సాయం" అంటూ ఇంద్రసభలో కూర్చున్నట్టు అన్నారు సూపరింటెండెంట్.

నిర్మల చిరుకోపం అభినయిస్తూ "ఇది ఆఫీసు టైమండోయ్ తెలుసా ! ..." అన్నది.

"ఆఁ, నిజమే. అన్నట్టు భలేగా గుర్తుకుతెచ్చావ్. ఇవ్వాళొక కొత్త ఆర్డరొచ్చింది. ఆఫీసుల్లో పనిజేశే ఆడవాళ్ళు పెళ్ళిచేసు కుంటే ఉద్యోగంలోంచి తీశెయ్యాలని. ఇప్పుడు చెప్పు, నువ్వే మంటావో?"

"నేను పెళ్ళి మానుకున్నాను."

సూపరింటెండెంటుగారు సంతోషంగా నవ్వారు. "మరి ఆ ఫిలిప్స్ రేడియో సెట్ ..."

"ధన్యవాదాలండి. చాలా బావుంది ... మీరీ పేదవాడితో రెండు నిమిషాలు మాట్లాడండీ పాపం."

"ఎవరతను?"

"ఒక గాడిద."

"సూపరింటెండెంట్ పగలబడి నవ్వారు. నువ్వు బాగా హాస్యంగానే మాట్లాడ్తావే! సరే, రమ్మను గాడిదకాకపోయినా చెవులు రెండూ పిండి గాడిదనుచేసి పంపుతాను" అన్నారు.

నిర్మల చిటికెనవేలు నోటిచివర పెట్టుకుని, నావంక అదోరకంగా వంకరచూపులు చూస్తూ "వెళ్ళండి" అంది. నేను గాడిదనైపోయాను గాని, లేకుంటే, నేను మనిషినైతే ఆ చూపులగాలానికి నా మనసూ చిక్కుకునేదే.

సూపరింటెండెంట్ నన్నుచూచి ఆదేపనిగా నవ్వారు. మళ్ళీ టెలిఫోన్ తీసి, యీ ప్రత్యక్షహాస్యానికి నిర్మలని అభినందించారు. తర్వాత రెండడుగులు ముందుకేశి నా చెవులు పట్టుకుని, "చూడండీ, మిస్టర్ గార్దభరావుగారూ! మిమ్మల్నిప్పుడు లాగొక తను తన్ని బయటిగ్గెంటితే యెట్లా వుంటుందో చెప్పండి!" అన్నారు.

"మీరు నన్నలా తన్ని పంపటానికి వీల్లేదు. నేను మీ దగ్గరికొక అర్జీ దాఖలా చేసుకుందామనొచ్చాను" అని చెప్పా నేను.

సూపరింటెండెంట్ కి ఆశ్చర్యంతో మూర్ఛబొయ్యేంత పన య్యింది. అతికష్టంమీద నిభాయించుకుని, "ఆఁ, ఆఁ, మళ్ళీ అనండి. యేమిటీ మళ్ళీ చెప్పండి!" అంటూ నత్తులు కొటాడు.

మళ్లీ చెప్పాను.

మాట్లాడేది స్వయంగా నేనేనన్న సంగతి అప్పటిగ్గాని అర్థం కాలే దాయనకి. "మీ వుచ్చారణ నాకంటే చాలా బావుందే!" అన్నాడు నోరెళ్లబెట్టి.

"నేను లఖనవూ (లక్నో) పరిసర ప్రాంతాల్నుంచొచ్చాను. బహుశా మీరు పంజాబీ వారయ్యుంటారు."

"ఔనౌను. నిజమే మాది పంజాబే" అని రెండు నిమిషాలాగి, "ఆఁ, యేం పని మీదొచ్చామన్నారు ?" అనడిగారు.

"ఒక చిన్నసాయం ..."

"మీరు శరణార్థులా."

"కాదు."

"ఐతే యిక్కడికెందుకొచ్చినట్టు ?" అన్నారు కాస్త కోపంగా.

"సాయంకోసం."

"పాకిస్తాన్‌లో అంతా పోగొట్టుకు నొచ్చిన శరణార్థులకే సాయం చేస్తారిక్కడ."

"ఐతే మరి హిందూస్తాన్‌లో అంతా పోగొట్టుకున్నవాళ్ళ కెక్కడ చేస్తారు సహాయం ?"

సూపరింటెండెంట్ కింకాస్త కోపం యెక్కింది. "అది నాకు తెలవదు. ఈ శాఖమాత్రం అందుక్కాదు. తమ రింకెక్కడికైనా దయ చెయ్యండి" అంటూ బల్లమీద గంటకొట్టారు.

బంట్రోతొచ్చి, నన్ను బయటికొక్కట్టాడు.

మళ్ళీ ఆ అందాల భరిణే కనిపించింది. నా వాలకం చూచి, "ఏం, పనికాలేదా ?" అనడిగింది.

జరిగిం దంతా చెప్పాను.

"సూపరింటెండెంటుగారు చెప్పింది నిజమే. మీరు పాకిస్తాన్ వాళ్ళయితే, గాడిద అనిగూడా సందేహించకుండా యేదో వొక సాయం చేశేవారే. ఇక మీరు కార్మికపరిశ్రమల శాఖకి వెళ్ళడం మంచిది"అని సలహా చెప్పింది నిర్మల.

"అదెక్కడ?"

ఆ అందాల పాలవెల్లికి నా మీద జాలికలిగినట్టుంది. పూర్తి ఎడ్రెస్ సవివరంగా చెప్పింది. పునరావాసశాఖ నుంచి కార్మికశాఖకి బయల్దేరా నేను.

పి. క్యు. రంగాచారిగారిది తమిళనాడు. ఐనా సంస్కృతం కాశీ పండితుల్లాగానూ, ఇంగ్లీషు ఆక్స్‌ఫర్డ్ ప్రొఫెసర్లలాగానూ, హిందీ సాహిత్యసమ్మేళనం వక్తల్లాగానూ, ఉర్దూ అబ్దుల్ కలామజాద్ లాగానూ మాట్లాడగలడు. ఆయన కిదివరకే పదిభాష లొచ్చును; యింకో పదిభాష లిప్పుడు నేర్చుకుంటున్నాడు. ఆయన మొట్టమొద టొక మామూలు గుమాస్తా. ఇప్పు డాయన కార్మిక, పరిశ్రమల శాఖలో ఉపకార్యదర్శి పదవి అలంకరించి కూర్చున్నాడు. ప్రతి విషయాన్నీ స్తనశల్యపరీక్షచేసి చూచిగాని వదలడు. అందుకని యీాయన హయాం వచ్చినదగ్గరనుంచీ యే ఫైలైనా సరే కనీసం పదిసార్లయినా ప్రదక్షిణం చెయ్యాలి. అప్పటికైనా పని పూర్తయితే గొప్పే. ఆ గొప్పమూలానే ఆయన ఉపకార్యదర్శి పదవి నధిష్టించాడు. సంయుక్త కార్యదర్శి కావాలని కలలు కంటున్నాడు. ఆ కలలుకూడా తప్పక ఫలించి తీర్తాయి. పి. క్యు. రంగాచారిగారిలాంటి వ్యక్తుల కడ్డంటూ వుండదు. ఆయన ఆఫీసులో ఫైళ్ళు ఆగుతాయే తప్ప, ఆయనలాంటివాడి ప్రమోషన్లు ఆగడమంటూ వుండదు.

పి. క్యు. రంగాచారిగారు నే నిచ్చిన అర్జీని చాలా జాగ్రత్తగా చదివారు. మధ్య మధ్య పెన్సిల్తో గుర్తులు పెట్టుకున్నారు. నేను చెప్పిందంతా అతి శ్రద్ధగా విన్నాడు. తర్వాత జాయింటు సెక్రటరీని పిలిచాడు. ఆ సెక్రటరీ పేరు వై. జెడ్. సుబ్రహ్మణ్యం. ఆయన్దీ తమిళనాడే. సుబ్రహ్మణ్యంగారికి యిరవయైదు భాషలూ, పదిమంది సెట్టుబడిదార్లూ, యిద్దరు మంత్రులూ చాలా బాగా తెలుసు.

"చూడండి, వై జెడ్ గారూ! పెద్ద చిక్కొచ్చిపడిందే" అన్నాడు రంగాచారి.

"ఏమిటి?" అన్నాడు సుబ్రహ్మణ్యం నన్ను యెగాదిగాచూస్తూ.

"ఒక చాకలి చనిపోయాడు. అతని గాడిదొచ్చి పింఛను అడుగుతోంది."

"ఊఁ ?"

"చట్టరీత్యా ఒక గాడిదొచ్చి అర్జీ దాఖలు చెయ్యడానికి వీల్లేదు. ఒకవేళ చేసినా మనం ఆ అర్జీని పరిశీలించగూడదు. ఎందుకనంటే, గాడిద మనిషికాదు. న్యాయస్థానం మనుష్యుల మాటలే వింటుంది తప్ప, జంతువులమాటలు వినదు."

అయ్యా! ఇది నా గడ్డివిషయం కాదు. మీ బుద్ధికి సంబంధించిన సంగతి. పాపం రాముా పెళ్ళాం ఆ బిడ్డలు పస్తులు పడుకుంటున్నారు. ప్రభుత్వం ఆ చాకలిరేవు లన్నిటినీ కట్టుదిట్టంచేసి, జాగ్రత్తగా చూస్తే యీనాడీ కష్టం కలగకపోను; రాముా చనిపోయి యుండక పోను" అన్నా న్నేను.

"నిజమే, యీ విషయమూ ఆలోచించవలసిందే" పి. క్యు అన్నాడు. వై. జెడ్. "పోనీ ఆ దరఖాస్తుమీద రాముా భార్యతో వేలి ముద్ర వేయించుదాం. తర్వాత ?"

## చాకలి కార్మికుడేనా ? కాదా ?

"సరే, వేయించుతాం. ఆ కుటుంబానికీ గాడిద బాధ్యత వహించడంగూడా అంగీకరించొచ్చును. గొప్ప గొప్ప కుటుంబాల కింతకంటే పనికిరాని గాడిదలే బాధ్యత వహిస్తున్నై. కాబట్టి యిందుకు మన మేమీ అభ్యంతరం చెప్పవలసిన అవసరం లేదు. అందులోనూ యిది చదువుకున్న గాడిదలా వుంది. కాని అసలు సమస్య అలాగేవుందే ! 'చాకలి కార్మికుడా ?' అన్న ప్రశ్న అలాగే వుందే" అన్నాడు పి. క్యు. రంగాచారి.

"చాకలి కార్మికు డెలా ఔతాడు ?" అన్నాడు వై. జెడ్. సుబ్రహ్మణ్యం తలడ్డంగా వూపుతూ.

"అదేమిటండీ, చాకలి కార్మికుడు కాకపోతే యింకా యెవ డౌతాడు. కార్మికుడు పనిచేసే దెనిమిది గంటలే. పాపం చాకలి

రోజుకు పనెండుగంటలు రెక్కలు ముక్కలుచేసుకున్నా రెండు పూటలూ కడుపునిండా తిండి దొరకడం కష్టమే. చాకలి కార్మికుడు కాకపోవటం యేమిటి?" అన్నా న్నేను, మధ్యలో సందు చూచుకుని.

"కార్మిక చట్టం యాభయ్యొకటి ప్రకారం ఫ్యాక్టరీలో పనిచేసే వాడే కార్మికుడు. మరి చాకలిరేవు ఫ్యాక్టరీకింద కొస్తుందంటూరా" వై. జెడ్. గారూ? అనడిగాడు రంగాచారి.

"వీల్లేదలా రావడానికి వీల్లేదు"అన్నాడు సుబ్రహ్మణ్యం. "చాకలి కార్మికుడు కాదు. అంచే తతనికి పింఛనూ వుండదు, ప్రావిడెంట్ ఫండూ వుండదు. పోనీ యేఖాతాలో నుంచైనా అతనికోసం డబ్బు తీసి సాయం చేద్దామా అంటే అందుకూ వీల్లేదు. ఎవరైనా కేసు పెట్టినా చెల్లదు. ఆ న్యాయమేమీ లేదు."

"ఐతే మరి!" అంటూ పి. క్యు., వై. జెడ్. మొహమూ, వై. జెడ్., పి. క్యు. మొహమూ చూస్తూ వూరుకున్నారు. "నేను వాళ్ళిద్దరి మొహాలవంకా చూస్తూ నుంచున్నా. ఉన్నట్టుం డొక్కసారి యెగిరిపడ్డారు వాళ్ళిద్దరూ, కొత్తభావం యేదో తట్టినట్టు. అదిచూచి నేనూ యెగిరిపడ్డా ఆనందంతో" చాకలి రాముా సంగతేమిటో తేలి సాయం దొరుకుతుందేమోనని.

"ఇంకో సంగతిగూడా ఆలోచించాలి" అన్నాడు రంగాచారి. "చాకలి కార్మికుడు కాదు, సరే. అతని హెూదా యేమిటో తేలాలి. చట్టప్రకారం అత నేమిటో స్పష్టంకావాలి. లేకుంటే రేవులో ప్రతి రోజూ ఒక చాకలి చస్తుంటాడు, అలా చాకలి చచ్చినప్పుడల్లా మన నెత్తిమీదకి బెడద వొచ్చిపడుతూంటుంది."

"ఈగాడిద అర్జీని ఒక ఫైల్లోపెట్టి అలాంటి కేసుల కాఫైలు కేటా యిస్తే సరిపోతుందనుకుంటా" అన్నాడు సుబ్రహ్మణ్యం.

రంగాచారి నా అర్జీ తీసుకున్నాడు. నేను నా చెవుల్తో వాళ్ళిద్దరికీ కరచాలనం చేసి, "ధన్యవాదాలు రంగాచారిగారూ! లక్ష ధన్య వాదాలు, కోటి ధన్యవాదాలు! ఒక బీద చాకలి కుటుంబాన్ని సం

రక్షించిన ఘనత మీకే దక్కింది. ఆ విన్నపం ఫలితం వినడానికి నన్నెప్పుడు రమ్మంటారు ?" అనడిగా.

రంగాచారి, సుబ్రహ్మణ్యమూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. చివరికా రంగాచారే నోరు తెరచి మాట్లాడ్డం మొదలెట్టాడు.

"ఫైల్ దేముంది ? ఫైలివ్వాళే పెట్టేస్తాం. కాని, అది మూడో తరగతి క్లర్కునుంచి, మొదటి తరగతి క్లర్కు దగ్గరకి రావాలి. తర్వాతిక ప్రతి టేబుల్ దగ్గరా ఆగాలి. ప్రతిమనిషి దానిమీద రిమార్కులు రాయాలి. తర్వాత డిప్యూటీ సూపరింటెండెంటు, అక్కణ్ణుంచి సూపరింటెండెంటు, తర్వాత నాదగ్గర కొస్తుంది. నేను డిప్యూటీ సెక్రటరీని, నాదగ్గర్నుంచి జాయింట్ సెక్రటరీకి, ఆ సంయుక్త కార్యదర్శిగారి దగ్గరినుంచి, ప్రధానకార్యదర్శిగారి దగ్గరికి, అక్కణ్ణుంచి ఉపమంత్రిగారి వద్దకి, సమస్య చూస్తే చాలా క్లిష్టమైనది. రాముూ పురుషుడం కాదు; ఇప్పుడు చాకలి కార్మికుడౌనా కాదా అన్నదే ప్రధానమైన సమస్య."

అంచేత అవసరమైతే వ్యాపార మంత్రిత్వశాఖకిగూడా పంపింప వలసి రావచ్చు. చాకలే కార్మికుడైతే మరి కుమ్మరీ, కంచరీ, మాదిగా వీళ్ళంతా కార్మికులు కారా ? అనేది మళ్ళీ ఓ కొత్తసమస్య. ఇవ్వాళ రాముూకి పెన్షనిస్తే, రేపు లక్షలాది, కోట్లాది జనానికివ్వొద్దూ ? వీళ్ళందరికి స్టేట్ బ్యాం కెక్కణ్ణుంచి తెచ్చిస్తుందీ డబ్బు ? అంచేత ఆర్థికశాఖగూడా యీ సమస్యను పరిశీలించక తప్పదు. ఆర్థికశాఖగూడా యిదమిత్థమని నిర్ణయించలేకపోతే, ప్రధానమంత్రి ముందుంచుతారు. ఆయ నీ సమస్యను పార్లమెంటుముం దుంచొచ్చును. మరప్పుడు మన రాజ్యాంగాన్ని మార్చవలసివచ్చినా మనం ఆశ్చర్యపడ గూడదు" అంటూ వేళ్ళమీద లెక్కలేసి, మొత్తంమీ దెంతలేదన్నా, ఈ విషయం తేలేప్పటికి కనీసం వొక పది సంవత్సరాలైనా పట్టొచ్చును" అని చెప్పాడు.

"అప్పటిదాకా రాముూ పెళ్ళాంబిడ్డల గతేంకాను ?" అనడిగా నేను.

"మే మేం చెయ్యగలం చెప్పరింటే. మీా పూర్తి సానుభూతే వుంది. కాని మరి చట్టాన్ని మార్చలేంగదా?" అన్నాడు రంగాచారి.

## తెలివి ఎవడబ్బ సొమ్ము?

"రంగాచారీ, అసలు విషయం చూస్తే కార్మికుడౌనా, కాదా అనికూడా కాదు. అసలు రామూని చంపిం దెవరూ అన్నది ప్రధాన సమస్యేమో అనుకుంటాను" అని నావంక చూచాడు సుబ్రహ్మణ్యం. నాకోపం వచ్చింది. "మొసలి! యింకెవరు!" అన్నాను.

"మొసలా!" అన్నాడు సుబ్రహ్మణ్యం ఆనందంగా. "ఐతే అసలు యిది మా శాఖకు సంబంధించిన విషయం కానేకాదు. మొసలి మత్స్యజాతికి చెందిన జలచరం. కాబట్టి యిది 'డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫిషరీస్' అంటే మత్స్య పరిశ్రమ శాఖకి సంబంధించిన సంగతి. దయ చేసి మీారక్కడికి వెళ్ళడం మంచిది."

రంగాచారి సుబ్రహ్మణ్యం చేయిపట్టుకుని వూపివేశాడుగూడ జారిపోయేట్టు. "ఆహాహా! మంచిసంగతి కనిపెట్టారు! అందుకనే మీారు సంయుక్త కార్యదర్శయ్యారు. నే నింకా వుపకార్యదర్శిగానే వున్నాను. తెలివి ఎవడబ్బసొమ్ము?" అంటూ యీర్ష్యాసూయల్తో కలగాపులగమైపోయిన అభినందన పరంపరలు కురిపించాడు.

నేను కిమ్మనకుండా నా అర్జీ తీసుకుని బయటికి నడిచాను.

మత్స్యపరిశ్రమ శాఖకెళ్తే, అదింతా చేపల బజారులా కోలాహలంగా వుంది. ఆ గందరగోళంలో ఎవరేమనేది సరిగ్గా వినిపించనే వినిపించడంలేదు. ఇప్పుడు నాకు ఆఫీసుల్లోకి వెళ్ళడమంటే కొట్టిన పిండైపోయింది. కాబట్టి ముందు యెదురుగావున్న మొదటి కిటికీ దగ్గరకే వెళ్ళాను.

"నేను చేపల గుడ్ల ఫైలు చూస్తుంటాను. మీారింకా ముందు కెళ్ళండి" అన్నాడు ఆ గుమాస్తా.

"నాదగ్గరుండే ఫైల్లో యీ జాతి చేప లెక్కడున్నాయన్న సంగతుంటుంది. అదిగూడా మూడుకాల చేపల్ని గురించి మాత్రమే,

బెత్తెలు, పరిగలు, జెల్లలు. మీారన్న పేరేమిటి?" అనడిగాడు రెండో గుమాస్తా.

"రాముా" అన్నా నేను నెమ్మదిగా.

"ఆ పేరు చేపల ఫైలు నా దగ్గరలేదు. ముందుకెళ్ళండి!"

"కాని..."

"కానీ లేదు, అర్ధణా లేదు. ముందవతలికి నడు."

మూడో గుమాస్తా దగ్గరకెళ్ళి, "ఒక మొసలి..." అని నేను ప్రారంభించానో లేదో, "చేపల నూనెను గురించైతేనే, నా దగ్గిర మాట్లాడండి. లేకుంటే యింకాస్త ముందుకెళ్ళి కనుక్కోండి" అన్నా డతను నామాట పూర్తిగా వినకుండానే.

## ముసలిగుమాస్తాతో ముప్పతిప్పలు

నాలుగోగుమాస్తా దగ్గర కెళ్ళేప్పటికి నా ఓపిక ఫెళ్ళుమంది. ఆ గుమాస్తా బాగా ముసలాడు. ముక్కుచివర కళ్ళజోడు పెట్టుకుని, ఒక పెద్ద రిజిస్టరు ముందేసుకుని, ఆ రిజిస్టరులో మొహంపెట్టి గురకలు కొడుతున్నాడు.

"ఇదుగో బాబూ, ఈసారి నే చెప్పేదంతా పూర్తిగా వినాలి; వినక పోతే వూరుకోను. ఒక మొసలి ఒక చాకలిని తినేశింది" అన్నాను.

ముసలిగుమాస్తా చెవిదగ్గర చెయ్యిపెట్టి "యేమిటీ?" అంటూ రాగం తీశాడు.

నే నింకాస్త బిగ్గరగా, "ఒక చాకలిని మొసలి తినేసింది" అని చెప్పా.

ముసలిగుమాస్తా మొహంమీాద ముసిముసి నవ్వులు తొణికిస లాడినై. "ఒక చాకలి ఒక చేపని తిన్నాడా? మంచిదే, చేపలు తినే చాకళ్ళు బోలెడుమం దున్నారు, ఎవరూ చేపలు తినకపోతే, యిక మా డిపార్టుమెం టెందుకూ?"

"తిన్నది చాకలికాదు; చాకలినే మొసలి తినేసింది."

"ఓహో, తిన్నది చాకలి కదూ! మొసలి తిన్నదా చేపల్ని; సరే, సరే. అందుకు మన మేం చేస్తాం! మొసళ్ళు చేపలుతింటాయ్! తినకపోతే పాపం అవెట్లా బ్రతుకుతాయ్!"

"అదికాదు. సరిగ్గా వినండి !" అంటూ బిగ్గరగా కేకేశాను. "ఒక మొసలి..."

"ఆఁ! ఒక మొసలి !".

'ఒక చాకలి. ఒక మొసలీ, ఒక చాకలీ తెలిసిందా ?"

"ఆ, ఆ, తెలిసింది. ఒక చాకలీ, ఒక మొసలీ. ఆఁ తర్వాత?"

"చాకలి చాకలిరేవులో గుడ్డ లుతుకుతున్నాడు, గుడ్డలు."

"ఆఁ, గుడ్డలుతుకుతున్నాడు. బాగానే వుతుకుతున్నాడా ?"

"బాగా వుతుకుతాడో, లేదో, అది నీ కెందుకులే."

"మా చాకలి సరిగ్గా వుతకడులే. కావాలంటే నా గుడ్డలు మీ చాకలికే..."

"ముందు నే చెప్పేదంతా పూర్తిగా వింటావా, లేదా?" అంటూ గద్దించా నేను.

"సరే చెప్పు. ఒక చాకలి; ఒక మొసలి; చాకలి గుడ్డలుతుకు తున్నాడు, ఊఁ, తర్వాత ?"

"ఇంతలో వొక మొసలొచ్చి, ఆ చాకలి కాలు పట్టుకుంది."

"ఏం పట్టుకుంది. బిగ్గరగా చెప్పవయ్యా కాస్త. నా కసలే చెముడు."

"కాలు ! కాలు !" అంటూ మళ్ళీ బిగ్గరగా అరిచి మరీ చెప్పాను.

"ఏమిటీ ? కోడికాలే !!" అంటూ కుర్చీలో లేచి కూర్చు న్నాడు ముసలి గుమాస్తా.

"కోడికాలుకాదు; చాకలికాలు."

"చాకలి కాలా ? చాకలి కాలు నే నెప్పుడూ తినలేదే, యెట్లా వుంటుందేమిటి ?"

ఇక నాకు విసుగు పుట్టుకొచ్చింది. "అదికాదయ్యా బాబుః! చాకలి గుడ్డ లుతుకుతూంటే, మొసలొచ్చి అతని కాలుపట్టుకు నీడ్చుకు పోయింది. తెలిసిందా యిప్పుడు ?"

"ఓ ! మహా బాగా తెలిసింది. చాకలి గుడ్డలుతుకొంటూంటే మొసలొచ్చి గుడ్డలు మింగేసింది !"

మరి లాభం లేదనుకుని, అతన్ని మింగబోయినట్టు చూచి, తర్వాత కిటికీ దగ్గరి కెళ్ళా.

## మొసళ్ళ వేటలోవున్న మజా

అక్కడొక బట్టతల ఆంగ్లోఇండియన్ కూర్చునున్నాడు. దగ్గర కెళ్ళగానే సారాకంపు గుప్పున కొట్టింది. నన్ను చూచి, యెంతో మర్యాదగా "అయ్యా, చెప్పండి. నేను మీ కేం చెయ్యగలను?" అనడిగాడు.

మళ్ళీ ఆ ముసలి గుమాస్తాలాగా ఇతనితోగూడా పేచీపడవలసి వస్తుందేమోనని, అతి నెమ్మదిగా, యెంతో తాపీగా, "చూడండి, ఒక మొసలుంది" అన్నాను.

ఆంగ్లోయిండియన్ కళ్ళు మిలమిలా మెరసిపోయినై. "ఆఁ, ఎక్కడుందీ?" అన్నాడు.

"యమునా నది రేవుదగ్గర."

"యమునానది రేవులు చాలా వున్నయ్యే. అందులో ఎక్కడ?"

నేను చెప్పిందంతా అతి జాగ్రత్తగా కాగితంమీద వ్రాసుకుంటున్నాడాయన. ఫర్వాలేదు గట్టెక్కాం లెమ్మని నన్ను నే నభినందించుకుని పూర్తి వివరాలు చెప్పా. "కృష్ణనగర్ దగ్గిర, రైలువంతెన కింద."

చెప్పింది వ్రాసుకుని, "పొడు గెంత? వెడ ల్పెంత?" అనడిగాడు.

"ఏమిటీ? రేవు పొడుగా?"

"కాదు, కాదు. ఆ మొసల్ది."

"నే నైతే చూళ్ళేదుగాని, చూచినవాళ్ళంతా ముప్పైఫ అడుగులకి తక్కువవుండ దంటున్నారు.

"నిజం?" అన్నాడు ఆంగ్లోయిండియన్. మళ్ళీ అతని కళ్ళు మిలమిలా మెరిసినై; ఆ కళ్ళతోపాటీసారి అతని బుగ్గలుగూడా నిగ్గుదేరినై. "ముప్పైఫ అడుగుతే?! భలే, భలే!! నన్నక్కడికి తీసుకెళ్ళగలరూ?" అనడిగాడు.

"ఓ."

"మనం ఒక రైఫిల్ గూడా పట్టుకెళ్దాం."

"ఎందుకూ? రైఫిలెందుకూ!"

"మొసళ్ళ వేటకి! మీ రొచ్చిందందుకా కాదూ? మొసళ్ళవేట కనేగా మీ రొచ్చింది!" అన్నాడు న న్నాశ్చర్యంగా చూస్తూ.

"అది కాదండీ, అసలు విషయం యేమిటంటే, ఆ మొసలి ఒక చాకల్ని పొట్టబెట్టుకుంది. పాపం అతని పెళ్ళాం, బిడ్డలు నిరాధారంగా వున్నారు. వాళ్ళకి సహాయం ..."

"ఓహో!" అంటూ ఒక్కసారి విల్లబడిపోయా డాయన. అతని కళ్ళల్లో మిలమిలల మాయమైపోయింది. మామూలు అధికార స్వరంతో, "నేను మొసళ్ళు వేటాడేవాణ్ణే కాని, రామూ కుటుంబానికి సాయం చేసేవాణ్ణికాదు, సారీ. మా శాఖకీ, చాకళ్ళకీ యేమీ సంబంధంలేదు" అన్నాడు.

నాకు విసుగు పుట్టింది. "మరిక నన్నెక్కడికి వెళ్ళమంటారు? మీ శాఖకీ, చాకలికీ సంబంధంలేదు. మిగతా శాఖలకీ, మొసళ్ళకీ సంబంధంలేదు. నా గోడు వినేవాళ్ళెవరూలేరా?" అనడిగాను.

ఆంగ్లో యిండియన్ యెంతో సానుభూతి చూపుతూ "ఆ చనిపోయినతను మీ సంబంధీకుడా?" అనడిగాడు.

"కాదు; నే నతని గాడిదను."

"ఐనా, ఇంత సానుభూతి చూపుతున్నావన్నమాట! సరే! నే నొక సలహా యిస్తాను, వింటావ్? యీ రోజుల్లో యింత సానుభూతి చూపటం మంచిదికాదు!"

"మీ సలహాలూ, బొలహాలూ నా కనవసరం. నాగోడు యెవరితో మొరబెట్టుకుంటే వింటారో, మీకు తెలిస్తే చెప్పండి; లేకుంటే లేదు."

## ఆంగ్లోయిండియన్ అసాధారణమైన తెలివితేటలు

ఆంగ్లోయిండియన్ పెన్సిల్ పళ్ళతో కొరుకుతూ ఆలోచించడం మొదలెట్టాడు: "ఇది మొసళ్ళ వ్యవహారం. మొసళ్ళతో కోర్టుల కేం సంబంధంలేదు. లేకపోతే యీ హత్యాభియోగాన్ని కోర్టుకెక్కిస్తే

పోయేది. మొసళ్ళకీ, జంతు ప్రదర్శనశాలకీ, సంబంధమైతే వుంది మరి; కావాలంటే నువ్వక్కడికెళ్ళొచ్చు. కాని, వాళ్ళుమాత్ర మేంజేస్తారు?" వాళ్ళ దగ్గరి కిదివరకే వాళ్ళకి సరిపడా మొసళ్ళుండి వుంటై. ఐనా జంతుప్రదర్శనశాలకీ, చాకలికీ సంబంధం యేంవుంటుంది? వుండదు! యెందుకనంటే అందులోవుండే జంతువులు గుడ్డలేసుకోవు!" అంటూ ఆలోచించాలోచించి, ఒక్కసారి, "ఆఁ!" అంటూ యెగిరి గంతేశాడు. అప్పు డతని మొహంచూస్తే పి. క్యూ, వై. జెడ్‌ల మొహాలు గుర్తు కొచ్చినై నాకు.

"ఆఁ, ఒకుపాయం తోచింది" అన్నాడు ఆంగ్లోయిండియన్.

"యేమిటది?"

"విను. చాకలికి సబ్బులు కావాలి. సబ్బులు యెగుమతి, దిగుమతులు చూసేది వాణిజ్యశాఖ. చాకలికీ, గుడ్డలకీ సంబంధం వుంది. ఆ గుడ్డలకీ, మళ్ళీ యీ వాణిజ్యశాఖకీ సంబంధం వుంది. చూశావ్! నువ్వు నేరుగా వాణిజ్య శాఖామాత్యుడి దగ్గర కెళ్ళిపో. చాకలిరామూ సంగతంతా ఆయనకు నివేదించు! పని జరగొచ్చు."

అయ్యో! ఆ భవన సౌందర్యం యేమని వర్ణించగలను; వేయి శిరసుల ఆదిశేషుడుగూడా వర్ణించలేడు. గాడిదను నేనేమి వర్ణించ గలను? ఆ భవనాని కన్నివైపులా అందమైన తోటలు, ఆ తోటల నిండా చెట్లు. రకరకాల ఫలాలతో వంగి వూగిసలాడే కొమ్మలు, దారి కిరువైపులా రంగురంగుల పూలు, సువాసనలు విరజిమ్మే పూలు. పచ్చని మెత్తలా పరచున్న పచ్చిక, ఎంత పచ్చగడ్డని! నాలాంటి గాడిద లొకపంద పడి, రోజులతరబడి మేశినా తరగని గడ్డి. మంత్రి గారి యింటిముందు యింత గడ్డి వుండవలశిన అవసరం యేమిటో అర్థంకాలేదు నాకు. మంత్రిగారికా అసరంలేదు. పోనీ గాడిద లేమైనా వున్నాయేమోనని చుట్టుప్రక్కల అంతా కలయజూచాను. ఒక్కటీ కనిపించలేదు. ఇంత గడ్డి అనవసరంగా మానవుల కాళ్ళకిందపడి నలిగి నాశనమైపోతూందే అని విచారమేసింది. ఈలోకంలో యిప్పు డున్నది మోటారుకార్ల వాళ్ళ రాజ్యమేకాని, గాడిదలు కలవాళ్ళ రాజ్యం కాదనేదాని కిదొక తిరుగులేని నిదర్శనమేనేమో ననిపించింది. కుమ్మరి,

కమ్మరి, చాకలి, తాపీవాళ్ల రాజ్యం కాదుగదా మరి. వాళ్ల దే రాజ్య మైతే ఈ గడ్డి ఇలా వృథాఅయ్యేది కాదుగదా! పోనివ్వండి, మిమ్మల్ని గాడిదల గడ్డినిగురించి విసిగించడం దేనికి! అసలు విషయానికొద్దాం. నేను మంత్రిగారి భవన ప్రాకారంలోకి అడుగు పెట్టేటప్పటికి, మంత్రి గారు అక్కడే వరండాలో పచార్లు చిత్తగిస్తున్నారు. వారి పిల్లలు సమీపంలోనే కూర్చుని సమోసాలు తింటున్నారు. ఎవరో యిద్దరు స్త్రీలు పూలచీరెలు ఆరగడుతున్నారు. ఎంత చక్కని దృశ్యం! నేను రెండు చెవులూ జోడించి మంత్రిగారికి నమస్కారం చేశాను, ఎంతో వినయంగా. మంత్రిగారు గోచి సరిదిద్దుకుంటూ "సోంఛె!" అన్నారు.

"అయ్యా, నాకు జలుబు చేయలేదండీ" అన్నా నేను.

"అరే, నేను మీరు మా ప్రాంతంవారే, అహ్మదాబాదునుంచే వచ్చారేమో ననుకున్నానే" అన్నారు మంత్రిగారు.

"కాదండీ, మాది ఉత్తరప్రదేశ్."

"ఓహో, అదా! బీహార్ తర్వాతుంటుంది ?"

"ఔనండి. అటునుంచొస్తే తర్వాతుంటుంది; యిటునుంచి ఎత్తే ముందుంటుంది."

మంత్రిగారు నవ్వారు. "మీరు చూడ్డానికి గాడిదలా వున్నారు గాని, కాదండీ అన్నయ్యగారూ!"

"పొరబడ్డారండి మీరు, నేను నిజంగానే గాడిదని అన్నయ్య గారూ, కాదంటే నా చెవులు పిండి చూడండి."

మంత్రిగారు నా చెవులు మెలేసి చూచారు. నేనన్నది నిజమే నని అప్పటిగ్గాని వారికి నమ్మకం కుదరలేదు. "సరే, యేం పనిమీ దొచ్చారు ?" అనడిగారు.

"మంత్రిగారూ నాకొక గడ్డిపరక్కూడా అవసరం లేదు. నేను చాకలి రామూ విషయం మాట్లాడదా మనొచ్చాను" అని కథంతా పూసగుచ్చినట్టు చెప్పాను.

ఏమాట కామాటే చెప్పుకోవాలి. మంత్రిగారు నాతో చాల మర్యాదగా మాట్లాడారు. గాడిదతో మాటాడుతున్నారన్న భావమే కలగలేదు నాకు.

"సోదరా !" అనే సంబోధించారు నన్ను. "సోదరా ! సబ్బులు చాలా ప్రియమై పోయినై, అంచేత చాకళ్ళు సబ్బులు కొనలేక యిబ్బంది పడుతున్నారు అంటే, ఏదైనా చెయ్యగలను నేను. లేదూ, చాకళ్ళకి కావలసిన పౌడర్ సరిగ్గా దొరకడంలేదంటే పన్ను యింకా స్త తగ్గించి, వ్యాపారస్తుల్తో చెప్పి, అందరికీ అందేట్టట్టు చూడగలను. మిల్లుల్నుంచొచ్చే గుడ్డ మరీ నాసిరకంగా వుంటోంది. చాకలి బండ మీద నాలుగు దెబ్బలెయ్యగనే వదావదలూ, బదాబదలూ ఐపోతోందనంటే నేను మిల్లు యజమానుల్తో చెప్పి యింకా స్త గట్టి ముతకగుడ్డలు తయారుచెయ్యమని చెప్పగలను; లేకుంటే చాకళ్లకింకా స్త మెత్తని రాతిబండలు సప్లయిచెయ్యడానికి ప్రయత్నించగలను. కాని, మీరు చెప్పేసంగతి అసాధారణమైనది. ఒక చాకలి చనిపోయాడంటున్నారు. అతని పెళ్ళాం, బిడ్డలు పస్తులు పండుకుంటున్నారంటున్నారు. వాళ్ళకిక 'మా' అన్న దిక్కు లేదంటున్నారు. నా కేం పాలుపోవడంలేదు. ఎంత పెద్ద మంత్రయినా ఈ విషయంలో యేమీ చెయ్యలేదనే నా వుద్దేశం" అన్నారు.

"ఏం ? యెందుకనండీ ?" అడిగా న్నేను, నిరుత్సాహ పడిపోయి.

మంత్రిగారు, దిక్కులు చూచి, నెమ్మదిగా "యిదసలు కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన మూల సమస్య. ప్రధానితప్ప యీ సమస్యనింకెవ్వరూ పరిష్కరించలేరు" అన్నారు.

"ఐతే మీ వుద్దేశం ... నే నెళ్ళి ..." అంటూ నసిగా నేను.

"ఔను. మీరు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారిని కలుసుకోవలసిందే. గత్యంతరం లేదు" అన్నారు మంత్రిగారు.

ప్రధానమంత్రిని కలుసుకోవాలంటే, ఉదయం ఏడున్నరా యెనిమిదీ లోపలైతేనే మంచిదనీ, లేకపోతే తర్వాత వచ్చే పొయ్యేవాళ్లు ఫర్లాంగులకొద్దీ బారులుతీరి నిలబడినట్లుంటారనీ, అప్పుడు మాట్లాడేందుకు ఒక నిమిషం దొరికినా ఘనమేననీ వాళ్ళూ వీళ్ళూ అనుకోవటం విన్నా నేను. రేపు ప్రొద్దున ప్రధానిని కలుసుకోవా లనగా, యీ కాక్రిందటి రాత్రంతా కంటిమీద కునుకులేదు. ఉదయం ఆరింటికల్లా

ప్రధాని భవనం దగ్గర కెళ్ళిపోయా. కాపలావాళ్ళు నన్ను చూశారు కాని, యేమంత పట్టించుకున్నట్టు కనిపించలేదు. నెమ్మదిగా గోడ పక్క పక్కనే, పచ్చిక మేస్తూన్నట్టు నటిస్తూ, సింహద్వారం దాకా వెళ్ళాను. అక్కడి కెళ్ళేటప్పటికి కాపలావాళ్ళు చెయ్యెత్తి బెదిరించాలని చూశారు. మొదట్నుంచీ పథకం సిద్ధంచేసుకునే వుంచుకున్నాన్నేను. అందుకని బెదిరినట్టూ, జడిసినట్టూ నటిస్తూనే గేటులోపలికి పరుగెత్తా. వాళ్లు నా వెంటపడ్డారు. కాస్తదూరంపచ్చి మామూలు గాడిదకోసం యింత యాతనపడ్డం యెందుకులే అనుకున్నట్టున్నారు. తోటమాలిని కేకేసి చెప్పారు. ఒగ్గాడిద తప్పించుకొచ్చింది, కాస్త బయటకొట్టెయ్యమని చెప్పి, వాళ్ళ గేటుదగ్గరకి వాళ్ళెళ్ళిపోయారు.

తోటమాలి నా వంక మిర్రి మిర్రి చూశాడు. అప్పటివరకూ గులాబీ చెట్లదగ్గర పార పుచ్చుకుని పచ్చిక డోకుతున్నవాడల్లా అక్కడ పడేసి, తోటలోవున్న తన యింట్లోకి వెళ్ళాడు. ఒక పెద్దకర్ర పుచ్చుకుని బయటి కొచ్చాడు. నీ పని చెబుతాచూడు అంటున్నట్టు.

ఇటు చూద్దునుగదా, ప్రధాని తోటలో షికారు చేస్తున్నారు. అటు గులాబీమొక్కల వేపుకి వెళ్తున్నారు, ఇదే అదననుకొని లేడిలా ఒక్కగెంతుగెగిరి ప్రధాని వెనక్కెళ్ళా నేను. వెళ్ళి, నెమ్మదిగా "పండిట్ జీ!" అన్నాను.

ఆశ్చర్యంగా, వెనక్కి తిరిగి చూచారు ప్రధాని. అక్కడ మనుషులెవ్వరూ లేకపోవడం చూచి, మళ్ళీ ముందుకడుగు వేశారు.

"మళ్ళీ, నేను పండిట్ జీ!" అన్నాను.

ఈసారి పరిశీలించిచూచినట్టు చూచారు ప్రధాని. "నాకు దెయ్యాలంటే నమ్మకం లేదు" అన్నారు.

"నేను దయ్యాన్ని కాదండి. ఒక మామూలు గాడిదని నమ్మండి!" అన్నా నేను.

నేను మాట్లాడ్డం చూచిన తర్వాత, ప్రధాని ఆశ్చర్యమంతా హర్షంగా మారింది.

"ఇటలీలో ఆల్జీబ్రా లెక్కలన్నీ యిట్టె చేసెయ్యగల గుర్రం వున్నదని చదివా నెక్కడో కాని, మాట్లాడే గాడిదని చూచేందు కిదే

మొదలు. మానవ విజ్ఞానం సాధించలేని కార్యమంటూ లేదు. సరే, యేం కావాలో చెప్పు. మళ్ళీ నా కవతల పనుంది అన్నారు."

"మీతో ఒక్క పదిహేను నిమిషాలు మాట్లాడదామనొచ్చాను. నేను గాడిదనని మీరు తిరస్కరించరుగదా."

పండిట్ జీ నవ్వారు. "నాతో మాట్లాడేందుకు ఒకళ్ళని మించిన గాడిద లింకొకళ్ళు వస్తూనేవుంటారు. ఇంకోగాడిద వొచ్చిందను కుంటాను; యేం ఫర్వాలేదు. ఏమిటో చెప్పు."

ఏమిటో చెప్పుదామని గొంతు సవరించుకోబోయానో లేదో, యింతలో తోటమాలి వొచ్చిపడ్డాడు, చేత్తోకఱ్ఱ పట్టుకుని. నే నటు మాలివంకా, యిటు ప్రధానివంకా చూచాను. ప్రధానికంతా అర్థ మైంది. చేత్తో తోటమాలిని వారించి, మళ్లి షికారుచెయ్యడం మొద లెట్టారు. నేనూ వారివెంటే నడుస్తూ, చాకలి రాముా విచారగాథ నంతా సంక్షిప్తంగా చెప్పేశాను. ప్రధాని చాలా విచారపడ్డట్టు కన్పించారు. "ఈ విషయంలో ప్రభుత్వం చెయ్యగలిగిం దేమీాలేదు. నేను నా జేబులోని ఒక వందరూపాయ లిస్తాను; తీసుకెళ్లు" అంటూ వందరూపాయల నో టొకటి జేబులోంచి తీసి నా చేవిలో యిరి కించారు.

"పండిట్ జీ! కీర్తిశేషులైన కిద్వాయిగారు గూడా యిలాగే సాయం చేశేవారు. దీనివల్ల కొంతమందికి తాత్కాలికంగా మేలు జరుగుతుందే అనుకోండి. కాని యెంత యేదైనా యిది దానమే గదా!" అన్నా నేను.

"నిజమే, దానమే మరి."

"దానాల్ని ఆపివెయ్యాలి. ఏ భారతీయుడైనాసరే, చనిపోతే అతని పెళ్ళాం, బిడ్డల భవిష్యత్తుకి భారతప్రభుత్వమే బాధ్యత వహిం చాలి. మన స్వాతంత్ర్యసిద్ధాంతాలలో యిది ప్రాథమిక సిద్ధాంతంగా వుండాలి."

"సిద్ధాంతం మంచిదే" అన్నారు ప్రధాని. "కాని, యిలాంటి సిద్ధాంతాల నమలుపరచాలంటే జనం రాత్రింబవళ్ళు చెమటోడ్చి

శ్రమించాలి. మర లా శ్రమించేవాళ్లు చాలా తక్కువమంది కన్పిస్తున్నారు. నీలాగానే, విప్లవాన్నిగురించీ, సంస్కరణల్ని గురించీ మాట్లాడేవాళ్ళు చాలామం దున్నారు. కాని చాకలి రాములాంటి వాళ్ళ భార్యా బిడ్డలకి న్యాయం చెయ్యాలంటే, యిప్పుడు ప్రభుత్వ బొక్కసంలో వున్న డబ్బు చాలదు. ఆ డబ్బు నెక్కువ చెయ్యాలనే దృష్టితోనే మేం పంచవర్ష ప్రణాళికలు ఏర్పాటు చేశాం. దేశంలో చెయ్యవలసిన పని చాలా వుంది. కాని జనంనుంచి నే నాశించిన ఉత్సాహం మాత్రం కన్పించటం లేదు.

తమరంటే ప్రజల కెంతో ప్రేమ వుంది; ఆదరం వుంది. తమరు వేసే ప్రణాళికలంటే యిష్టమూవుంది. తమ ప్రతి ఆదేశాన్నీ, దేశప్రజలంతా ఔదలదాలుస్తున్నారు. తమరు ప్రపంచ శాంతికోసం చేసే ప్రయత్నాలు చూచి, ఒక్క దేశపు ప్రజలేకాదు, విశ్వప్రజానీకమంతా తమరికి జేజేలు పలుకుతున్నారు."

పండిట్ జీ మందహాసం చేశారు. "గాడిదవైనా, చక్కగా మాట్లాడగలవు నువ్వు'' అన్నారు.

నేను నా సంభాషణ ఆపదలుచుకోలేదు. "నా కివ్వాళ ఒక మహారాజకీయవేత్తతో మాట్లాడే సదవకాశం లభించింది. మళ్ళీ యిలాంటి అవకాశం కలుగుతుందో, లేదో చెప్పడం కష్టం. అంచేత నా మనసులోని మాటలన్నీ మర్మంలేకుండా మీకు చెప్పేసెయ్యాలనిపిస్తోంది పండిట్ జీ, మీ విదేశాంగవిధానం సరియైనదని అందరూ అంగీకరిస్తారు. మీ దేశభక్తీ, ప్రజలంటే మీకున్న ప్రేమా, దేశంకోసం మీరు చేస్తున్న సేవా చూచి సంతోషించనివారంటూ లేరు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింతర్వాత, యింత కొద్ది కాలంలోనే, మన మాతృదేశాన్ని మీరు అంతర్జాతీయ రాజకీయాల్లో శిఖరాగ్రంమీద నిలబెట్టారన్న సంగతినీ యెవ్వరూ కాదనలేరు. కాని పండిట్ జీ! ఇంతేనా మీరు చేయగలిగింది? మన యీ దేశం, యింత పెద్దదేశం, యింత గొప్పదేశం ఒక్క వ్యక్తిమీద ఆధారపడి యెంత కాలం మనగలదు? అశోకచక్రవర్తీ, అక్బరూ వెళ్ళిపోయింతర్వాత మన దేశం గతి యేమైందో మీకు తెలియందికాదు."

"అశోకుడూ, అక్బరూ అంటే వాళ్లు చక్రవర్తులు. మన దిప్పుడు ప్రజాస్వామ్యం !" అంటూ జ్ఞాపకం చేశారు ప్రధాని.

"ఓటు వున్నంతమాత్రాన ప్రజాస్వామ్యం వున్నట్టేనా, పండిట్ జీ! ఇది ప్రజాస్వామ్యంకాదు పండిట్ జీ; నెహ్రూ రాజ్యం. ఒకేఒక వ్యక్తి మీాద ఆధారపడిన రాజ్యం యిది... ఆ వ్యక్తి లేనినాడు యేమౌ తుందో ? ఆ మాట తలచుకుంటేనే భయమేస్తోంది నాకు."

"ఆ ప్రశ్నకి సమాధానం ఇదివరకే చెప్పాన్నేను" అన్నారు ప్రధాని. "నా తర్వాతింకో వుత్తమనాయకుణ్ణి సృష్టించుకోలేనంతటి నీరసమైన జాతికాదు యీ భారతజాతి. నా భారత ప్రజానీకం మీాద నా కా మాత్రం నమ్మకంవుంది."

"మీా నమ్మకం వమ్మౌతుందని నేనూ అనడంలేదు. కాని ఆ నమ్మకం సఫలం కావాలంటే మన ప్రజల్లోని నిద్రాణశక్తుల్ని జాగృతం చెయ్యడాని కిప్పట్నుంచీ ప్రయత్నించాలిగదా అని మాత్రమే నే నంటూన్నది. ప్రజల్లోవున్న నిర్మాణశక్తిని అభివృద్ధిచేయాలిగదా అనే నే ననేది. పండిట్ జీ! నా మాటల్ని మీారు పొరపాటుగా అర్థం చేసుకోవొద్దు. కాని ఒక్కమాట, యిప్పుడు మీా అధికారు లంతా కారులున్నవాళ్ళు. పాటకజనానికి ప్రాతినిధ్యం వహించే వాళ్ళొక్కళ్ళయినా వున్నారేమో. మీారే చెప్పండి.. మన దేశ ఆర్థిక సౌష్టవం పెంపొందాలంటే, మన ప్రణాళికలు విజయవంతం కావా లంటే, మన దేశ పురోభివృద్ధి మూడు పూవులూ, ఆరుకాయలూ కావాలంటే మన రాజ్యాంగం మారాలి; పైనుంచి క్రిందివరకూ పరి వర్తనం రావాలి, పైనుంచి క్రిందివరకూ అన్ని అంతస్తుల్లోనూ, అన్ని అంచెల్లోనూ ప్రజలకు నిజమైన ప్రాతినిధ్యం వుండాలి. పెట్టుబడి దారులూ, కాంగ్రెసువాళ్ళూ, కార్మికులూ అంతా సమైక్యంగా కృషి చెయ్యాలి. అలా జరిగిననాడే దేశంలో యీ మూలనుంచా మూల వరకూ కార్యోత్సాహం వెల్లుబుకుతుంది. ఈనా డెంతో ఆర్థిక నష్టంతో, నైతికహానితో పదిపదిహేనేళ్ళకుగాని పూర్తిగాని పని, ఆనాడు యెంతో ఆర్థికపుష్టి చేకూర్చి పెడుతుంది. నైతికౌన్నత్యానికి దోహదం చేస్తుంది. అతి తక్కువకాలంలో పూర్తి అవుతుంది."

సం ్రెట్ నీ మళ్ళీ మందహాసంచేశారు. "నువ్వు నాతో ఇంటర్వ్యూ కోసంవచ్చా వనుకున్నాను. తీరా చూస్తే నువ్వే నాకు ఇంటర్వ్యూ యిచ్చేందుకు వచ్చినట్టుంది !" అన్నారు.

నేను గాబరా పడిపోయి, వూరుకున్నాను. వా రన్నది నిజమే.

నేను మెదలకుండా వూరుకోవడం చూచి, "కాదు కాదు, చెప్పు. నేనిప్పటికీ విద్యార్థినే. గాడిదలనగ్గర నేర్చుకోవలసింది చాలా వుంటుందనే నా వుద్దేశం" అన్నారు ప్రధాని.

"అయ్యా; నాదగ్గర మీరు నేర్చుకునేదేంవుంటుంది ? సూర్యుడి ముందు దివిటీని నేను. నేనొక బీదవాకలి నంటిపెట్టుకుని బ్రతికిన దౌర్భాగ్యపు గాడిదని. నాకు బీదవాళ్ళ బాధలు తెలుసు. మీకూ తెలుసా బాధలు. అంచేతనే మీమాటల్లో ఆ కష్టనిష్టూరాలు ప్రతిబింబం చూచుకుంటాయి. కాని మీ మామధ్య ఓ పెద్ద అఖాతం ఏర్పడింది. అఖాతం అభ్యుదయ నిరోధకం; తాసీలు నడక; మీ ఆశయాల్ని ఆచరింపకుండా అవహేళనచేసే ప్రభుత్వయంత్రం, ఆ యంత్రంలో మా శ్రేయస్సుకి భిన్నమైన, వ్యతిరేకమైన శక్తులు పని చేస్తున్నై. జరిగే కొద్దిపాటిపనీ, మీరంటేవున్న భయంవల్ల జరుగుతుందేతప్ప శక్తివల్లకాదు. ఇప్పటినుంచే తగిన కట్టుదిట్టాలు జరక్కపోతే, మీరులేనినా డీ భయంగూడా మాయమైపోతుంది. ఎవరికి వారు స్వైరవిహారంచేస్తారు."

"అంటే, నా సహచరులనా ని వుద్దేశ్యం ?"

"వాళ్ళదేముంది, వాళ్ళు వయసులో మీ కంటే వృద్ధులు. నేననేది సంఘటిత జాతియ ప్రభుత్వాన్ని గురించి వచ్చే పది పది హేనేళ్ళలోనూ, దేశంలోని వివిధ వర్గాలకీ, విభిన్న రాజకీయ సిద్ధాంతాలకీ అందులో ప్రాతినిధ్యం ఉండాలని. అప్పుడే దేశం సర్వతో ముఖంగా అభివృద్ధి పొందగలదని."

"ప్రభుత్వ యంత్రాంగం నాతో సహకరించ టంలేదంటే నమ్మను. ఏమైనా సోదాహరణంగా చెప్పు చూస్తాను" అన్నారు ప్రధాని.

"ఉదాహరణ కేం? కోకొల్లలు! మీప్రణాళిక ప్రకారం ప్రైవేట్ రంగంకంటే పబ్లిక్ రంగాని కక్కువ ప్రాముఖ్యం వుండాలి. కాని

ఆచరణలో ప్రైవేట్ రంగమే పైకొస్తోంది. టీ, బ్యాంకు మొదలైన వాటిని మినహాయించినా, రెండు నూనె శుద్ధి కర్మాగారాలు షుమారొక పాతిక కోట్ల పెట్టుబడితో ప్రారంభమైనై."

"వాటిమీద మా కంట్రోలుంటుంది."

"ఆంగ్లో-యిరానియన్ కంపెనీలాగానే ఈ కంపెనీలూ తయారైతే వీటిని కంట్రోలు చేస్తూ చేస్తూ మా ప్రధానిగూడా డాక్టర్ ముసాదిక్ లా క్షీణించిపోతే."

"నువ్వు నిజంగానే శుద్ధ గాడిదవి" అన్నారు ప్రధాని కోపంగా. "ఎప్పుడో రాసిన పుస్తకాలు చదివి మతి పోగొట్టుకుంటున్నారు మీరంతా. భారతదేశంలోవున్న ప్రత్యేక పరిస్థితుల్ని గమనించకుండా, వూరికే విప్లవం విప్లవం అని నినాదాలిచ్చి లాభంలేదు. మన ప్రజానీకం మనోవృత్తిని అధ్యయనం చేయాలి. మన ప్రజలు శాంతిప్రియులు; అహింసాధర్మం అంటే వారికున్న అపార ఆదరాన్ని గుర్తించాలి. మన భారతదేశంలో అన్నీ అతి నెమ్మదిగా జరుగుతాయి. నెమ్మది నెమ్మదిగా మన సంఘమూ మారుతుంది; జాతీయ కర్తవ్యాల రూపమూ మారుతుంది. సాంఘిక చైతన్యం నెమ్మదినెమ్మదిగా కలుగుతుంది. నెమ్మది నెమ్మదిగా ఒక నూతనసమాజం ఆవిర్భవిస్తుంది. ఇదంతా ఒక్కనాడు జరగాలంటే జరగదు. నెమ్మది నెమ్మదిగా జరుగుతుంది. నేను చెబుతున్నానుగదా, నమ్ము. గాడిదా!"

"ఐతే, యీలోగా చాకలి రామూ పెళ్లాంబిడ్డలు యేంకాను? వుద్యోగం దొరక్క, కూలి దొరక్క నికృష్ట పరిస్థితు లనుభవించే వాళ్ళందరి గతి యేంగాను? నానాటికీ పాపంలాగ పెరిగిపోతూన్న యీ నిరుద్యోగం యేంగాను?"

"నే నేం మాయలఫకీరునా, మంత్రగాడినా? కళ్లుమూసుకో, తెరచెప్పటి కిక్కడ నీకొక స్వర్గం సృష్టించిస్తానని చెప్పేందుకు? ఒకసారి ప్రపంచచరిత్ర తిప్పిచూడు."

"ఏ దేశమూ, నువ్వన్నంత తొందరగా మారిపోలేదు. కష్టపడి వొళ్ళువంచి పనిచెయ్యాలి. దేశ ఆర్థిక సంపత్తిని సముత్పన్నం చెయ్యాలి" అని అంటూ ప్రధాని నా వీపుమీద చెయ్యివేశి నిమిరారు.

"చూశావా, నువ్వొచ్చి పదిహేన్నిమిషాలు పైనైంది. నాకు పనుంది; వెళ్ళాలి" అన్నారు.

పండిట్ జీ! నా దొక చిన్న మనవి. తమరు బహుశా యింగ్లండులో యెప్పుడైనా గాడిదలెక్కారేమో తెలియదు కాని భారత, దేశంలో మాత్రం యెక్కి నట్టెప్పుడూ వినలేదు. నా ప్రార్థన మన్నించి ఒక్కసారి... .. అని విన్నవించుకోబోయాను. నా మాట పూర్తికాక ముందే ఒక్కెగురెగిరి నా వీపుమీద కూర్చున్నారు ప్రధాని.

కూర్చుని తోటంతా సవారీచేశారు. ఊరికే పరుగెత్తించారు. నా కపరిమితమైన సాలొచ్చింది. "పండిట్ జీ! ఇక సవారీ చాలు, దిగండి" అని పదే పదే మొత్తుకున్నాను.

"ఇప్పుడు చెప్పు. నెమ్మది కావాలనే దెవ్వరో!" అంటూ నవ్వుతూ, క్రిందికి దూకారు.

చూద్దునుగదా, దరిదాపుల్లో యిద్దరు ఫొటోగ్రాఫర్లు నిలబడి మా ఫొటోలు తీసుకుంటున్నారు. బహుశా ప్రధాని నామీద సవారీ చేసే ఫొటోకూడా తీసుకునేవుంటారు. ఒక రిద్దరు కార్యదర్శులు ప్రధాని యెప్పు డివతలికి వస్తారా అన్నట్టు చంక్రమణం చేస్తున్నారు. నెహ్రూగారు నా వీపుతట్టి, "చాకలి కా వందరూపాయలనో టివ్వడం మర్చిపోబోకు" అని చెప్పి, కార్యదర్శులున్న వేపుకి కదిలారు.

నేను సగర్వంగా తోకూపుకుంటూ ప్రధాని భవనంనుండి బయటికి బయల్దేరాను. ఎంతచెడ్డా భారత ప్రధాని సందర్శనంచేసిన గాడిదనిగదా మరి. బయటి కడుగుపెట్టానో లేదో, ఫొటోగ్రాఫర్లూ, పత్రికావిలేఖరులూ అంతా నన్ను చుట్టుముట్టారు.

ప్రధాని భవనం బయటి కడుగు పెట్టానోలేదో, ఇంక ఈ ప్రపంచంలో నాయంతటి ప్రసిద్ధమైన గాడిదలేదేమో ననిపించింది. ఆ క్రిందటిక్షణంవరకూ పూరూపేరూలేని ఒక అనామకమైన గాడిదని; కాళ్ళరిగేట్టు యెక్కేగడపా, దిగేగడపా అని లేకుండా, నా దరఖాస్తు పట్టుకు తిరిగిన గాడిదని — ప్రధాని సందర్శన భాగ్యంతో నా అదృష్టం పండింది. గేటు బయటికి అడుగుపెట్టగానే, పత్రికా

విలేకరులూ, ఫొటో గ్రాఫర్లూ నన్ను చుట్టుముట్టారు. ఫోటోమీద ఫోటో తీసిపారేశారు. చివరకంతా కలిసి నన్ను పట్టుకుని కాన్‌స్టిట్యూషన్ క్లబ్బులోకి లాక్కుపోయారు.

ఇకక్కడ నామీద ప్రశ్నలవర్షం కురిపించారు.

"ప్రధానమంత్రీ, మీరూ యేమేమి మాట్లాడారు?" అనడిగాడొక విలేకరి.

"ఏదో కొంత గడ్డిని గురించీ, మరికొంత గులాబీలని గురించీ మాట్లాడుకున్నాం" అని చెప్పా నేను.

"ఎందుకండీ, మమ్మల్నిలా యేడిపిస్తారు? నిజం చెప్పండి వున్నదున్నట్టు!" అన్నాడు మరో విలేకరి.

నే నేనా అంత తెలివితక్కువదాన్ని! "యేదో చాకళ్ళనీగురించీ, చాకళ్ళ గాడిదల్ని గురించీ, యిప్పుడు మన దేశంలో తయారయ్యే కొత్తకొత్త గాడిదల్నిగురించీ కాస్సేపు మాట్లాడుకున్నాం" అని కోశా.

"విదేశాల గాడిదల్ని గురించి యేమైనా మాట్లాడుకున్నారా?" అనడిగాడు మూడో విలేకరి.

"ఆఁ, ఆఁ, మాట్లాడాం. పండిట్‌జీ విదేశాల్లో వున్నప్పుడు గాడిద స్వారీ చేశేవారట. హార్డ్‌ఫర్డ్ షైర్ గాడిదలంటే వారికి బాగా యిష్టం."

పత్రికా విలేకరులంతా తెల్లకాగితాలు నలుపు చేస్తూనేవున్నారు. కాగితాలకు కాగితాలు బరికేస్తూనే వున్నారు. కాని, వాళ్ళక్కావలసిన విషయం దొరికినట్టులేదు. వాళ్ళ దాహం తీరినట్టులేదు. వాళ్ళని చూస్తుంటే నాకు జాలేసింది. చివరికొక ప్రకటన చేసేశాను:

"మహాజనులారా! సోదరీ, సోదరులారా!! (విలేకరుల్లో కొందరు స్త్రీలు గూడా వున్నారు.) పండిట్‌జీని వీపుమీద యెక్కించుకుని స్వారీ చేయించుకున్నానన్న ఘనత, సౌభాగ్యం దక్కిన ఏకైక గాడిదని నేనే యీ విశాల భారతదేశంలో."

ఈ మాటలు విని కొందరు విలేఖరులు యెగిరి గంతేశారు; వాళ్ళకి తమ తమ పత్రికల్లో పతాకశీర్షికలకు కావలసిన సమాచారం

చిక్కింది. పతాకశీర్షికల్లో యీదుతూన్నట్టు నన్నునే నూహించుకుని సంతృప్తిగా ఒకసారి అర్ధనిమీలితనేత్రాలతో ఆలోచించుకోబోయాను. ఇంతలో ఎవరో నా చెవిబట్టుకుని సాగదీశారు. ఉలిక్కిపడి చూద్దును గదా, అతను "లైఫ్" (అమెరికన్ పత్రిక) విలేకరి.

"ఓమిష్టర్! నువ్వు మా "ఫ్రాన్సిస్"ని గూడా తలదన్నావే!" అన్నాడతను.

"ఫ్రాన్సిస్" యెవరు?

"మాటలునేర్చిన కంచరగాడిద. మెట్రోగోల్డ్విన్ మేయర్ సినిమాల్లో పనిచేస్తుంది. కాని, ఆ గాడిదకూడా ఒక మహావ్యక్తిని సందర్శించే అదృష్టం పట్టలేదు."

ఇంతలో 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక విలేకరి, ఆ 'లైఫ్' విలేకరి భుజం పట్టుకుని వూపేస్తూ, "మన ఫ్రాన్సిస్‌నీ, యీ భారత దేశం గాడిదనీ ఒకేసారి టెలివిజన్‌లో చూపిస్తేనా..." అన్నాడు లొట్టలు వేస్తూ.

"నిజమేఁ, యిప్పుడే అమెరికాకి కేబుల్ పంపేస్తాను: ఫ్రాన్సిస్‌ని ఒక ప్రత్యేక విమానంలో యిక్కడికి పంపించమని. నువ్వన్నట్టు, దేవుడి తోడు. బ్రహ్మాండంగా వుంటుందిలే" అన్నాడు 'లైఫ్'.

## రాజకీయ అభిప్రాయాలు

"కాని అసలీ గాడిద రాజకీయాభిప్రాయాలేమిటో తెలుసుకోవడం మంచిదికాదూ?" అన్నాడు 'మాంఛెష్టర్ గార్డియన్' విలేకరి యింతలో.

"ఇదుగో, మిస్టర్ గార్దభరావ్! వ్యక్తిస్వాతంత్ర్యాన్ని గురించి మీ వుద్దేశ్య మేమిటి?" అనడిగాడు "లండన్ టైమ్సు" విలేకరి, రాయల్ కమిషన్ సభ్యుడి పోజుపెట్టి.

"ప్రతి గాడిదకీ గడ్డిమేసే హక్కువుండాలి" అన్నా నేను.

"సహజీవనాన్ని గురించి!"

"ప్రతి గాడిదా తాను బ్రతకాలి; యితరుల్ని బ్రతకనివ్వాలి! మా గాడిదలన్నీ యీ కనీస నియమాన్ని పాటిస్తానేవున్నై, మనుషుల సంగతి మాకు తెలియదు!"

"జాతి, వర్ణ విభేదాల్ని గురించి మీ అభిప్రాయం?"

"మా గాడిదల్లో ఆ భేదభావాలేమీలేవు. నల్లగాడిదైనా, దాని తలమీద తెల్లచుక్కవున్నా, నల్లచుక్కున్నా... మాకన్ని గాడిదలూ ఒక్కటే; గాడిదలన్నీ సమానమే!" అన్నా నేను.

"చూశారా, నేను చెప్పలా. ముందీ గాడిద రాజకీయాభిప్రాయాలేమిటో తెలుసుకోవాలని!" అన్నట్టు సగర్వంగా 'లైఫ్', 'న్యూయార్కు టైమ్స్' విలేఖరులవంక చూశాడు 'మాంచెస్టర్ గార్డియన్' విలేఖరి.

"ఫ్రాన్సిస్‌ని పిలిపించడం అనవసరమే ననుకుంటా" అన్నాడు 'లైఫ్', 'న్యూయార్కు టైమ్స్'ని చూచి.

"మహాశయా, ప్రస్తుతం ప్రాక్పశ్చిమ దేశాలమధ్య యేర్పడ్డ యీ ప్రచ్ఛన్నయుద్ధ వాతావరణాన్ని గురించి మీ అమూల్యాభిప్రాయ మేమిటో తెలియజేస్తారా?" అనడిగాడు, మాంచెస్టర్ గార్డియన్.

అయ్యా! మా గాడిదలకి ప్రచ్ఛన్నయుద్ధమంటే యేమిటో, ప్రత్యక్షయుద్ధమంటే యేమిటో తెలియదు. నిజం చెప్పాలంటే మాకు 'యుద్ధం' అంటేనే అసహ్యం. పచ్చిక మైదానాల్లో మీరు చూసేవుంటారు. ఒకే మైదానంలో డజన్లకొద్దీ గాడిదలు మేతమేస్తూవుంటాయి. ఐనా అవి తన్నుకోవు; కుమ్ములాడుకోవు. మానవులుకూడ అలా యెందు కుండగూడదో, యెందుకనుండరో మాకు తెలియదు. అదీగాక, మీరు చూచేవుంటారు. రంగు రంగుల గాడిదలన్నీ కలిసి యిటుకలు మోసి ఒక కొత్తయిల్లు కట్టడానికి సమిష్టిగా సాయం చేస్తాయి. విభిన్న వర్ణాల, జాతుల మనుష్యులుగూడా అలాగే కలిసి కట్టుగా ఒక కొత్త యంత్రాంగాన్నీ, నూతన సమాజాన్నీ, నవ్య ప్రపంచాన్నీ, నిర్మించేందుకు యెందుకని యేకం కాలేకపోతున్నారో మాకరం కావటంలేదు!"

అదంతా సరే, 'పంచశీల'ని గురించేమంటారు మీరు?" యీ ప్రశ్న అడిగింది 'మాంచెస్టర్ గార్డియన్' విలేకరి.

ఈప్రశ్నవిని 'లండన్ టైమ్స్' విలేకరి ముహంముడుచుకున్నాడు. "ఎందుకివన్నీ అడగడం? శుద్ధదండగ! ఈ గాడిద బాండుంగ్ సమావేశాని కెళ్ళలేదుగాని, వెళ్తే పెద్ద గొడవే జరిగేది" అంటూ విసుక్కున్నాడు.

దాంతో, ఆ ముగ్గురు విలేకరులూ నన్నొదిలపెట్టి అవతలికెళ్లిపోయారు.

ఆ తర్వాత సంగతా పత్రికా విలేకరులు యెన్నో విషయాలనుగురించి యెన్నెన్నో ప్రశ్నలు వేశారు. నాచేతనైనంతవరకూ వాటి కన్నిటికీ సమాధానాలు చెప్పాను. ఇలా ఒక గంటన్నర జరిగింది. తర్వాత విలేకరులంతా ఎవరి ఆఫీసులకి వాళ్లెళ్లిపోయారు. నేను చాలా అలసిపోయాను. చాకలి రాముా ఇంటికివెళ్ళేముందు యమునానది కెళ్ళి స్నానం చేస్తేనేతప్ప ఆ అలసటంతా తగ్గేట్టు కనుపించలేదు. నెమ్మదిగా కాన్‌స్టిట్యూషన్ క్లబ్ బయటికొచ్చాను. ఇంతలో ఒక పెద్దమనిషి – బాగా లావుగా, పొట్టిగావుంటాడు – యెదురుపడ్డాడు. మాంచి ఖరీదైనబట్టలే వేసుకున్నాడు; నెత్తిమీదొక తెల్లటి గాంధీ టోపీవుంది. నన్నుచూచి –

"క్షమించండి మీరేనా మాట్లాడే గాడిదని అంటున్నారందరూ! మీరేగదూ, ప్రధానమంత్రిగారితో మాట్లాడొచ్చింది?"

"ఔనండి."

ఆ పొట్టి పెద్దమనిషి, ఒకసారి నన్ను నఖశిఖ పర్యంతం పరీక్ష చేశి చూచి, "మీ రన్యధా భావించక యీ పూట భోజనం మా యింట్లోనే చేయండి. మా యిల్లుగూడా యిక్కడికి చాలా దగ్గరే; బర్జాటియా భవనం.

"నేను చాలా అలసిపోయాను సుమండీ" అన్నా నేను.

"నాకు బ్యూక్ కా రొకటుందనుకోండి. కాని అది మీకు సరిపోతుందో లేదోనని షెవర్‌లెట్ లారీ ఏర్పాటుచేశాను."

చెవర్‌లెట్ లారీలో ప్రయాణం చెయ్యడం నా జీవితాని కిదే ప్రథమం. ఆ లోహ గార్ధభం మహా గొప్పగా వుంది!

## సేఠ్ బర్జాటియా భవనంలో....

నిజంగానే బర్జాటియా భవనం రాజభవనంలా వుంది. నేను కూర్చున్న సోఫామీద కాళ్ళు బారచాచుకుని రెండు గాడిదలు తేలికగా పండుకోవచ్చు.

నన్ను సోఫామీద ఆశీనింపజేసింతర్వాత, "తమ రేం తాగుతారు? లెమనా, స్క్వాషా, శర్బతా?" అనడిగారు బర్జాటియా గారు.

"ఏమీా అవసరంలేదు; ఇంత పచ్చగడ్డెయితేచాలు" అన్నానేను.

బర్జాటియాగారు నదురూ, బెదురూ లేకుండా, బల్లమీాదున్న చిన్నగంట నొక్కారు. ఆయన్నిచూస్తే వొచ్చేపోయే అతిథులందరికీ గడ్డిపెట్టడమే ఆయన దైనందిన కార్యక్రమమేమో ననిపించింది. ఒక నౌకరొచ్చాడు. ఆ నౌకరు కేదో చెప్పి పంపించేశాడాయన.

కాస్సేపైందో లేదో, ఆ నౌక రొక పెద్ద వెండిపళ్ళెం పట్టుకొచ్చాడు. ఆ పళ్ళెంనిండా అప్పుడే కడిగిపెట్టిన పచ్చని పచ్చిక! ఆ పచ్చిక వాసన తగలగానే నా నోరూరింది. నోట్లో పెట్టుకుంటే దంతాల కతిమెత్తగా తగిలింది. అది తినడం పూర్తయిందో లేదో, యింకో నౌకరొక పెద్ద వెండి బొక్కెనతో నీళ్లట్టుకొచ్చాడు. మంచినీళ్ళు రెఫ్రిజేటర్లో పెట్టిన చల్లని మంచినీరు. మంచినీళ్ళు తాగానో లేదో, మూడో నౌకరొచ్చి, ఒక చక్కని తెల్లనిగుడ్డతో నా మూతంతా శుభ్రంగా తుడిచాడు.

ఇంతలో నాలుగో నౌకరొచ్చి, "అయ్యా, ఏ తాంబూలం తీసుకురమ్మంటారు? సాదాదా? జరదాదా?" అనడిగాడు.

"జరదాదే బావుంటుంది కాని, లఖనవూ (లక్నో) జరదా, అయితే యింకా బావుంటుంది" అని చెప్పి, బర్జాటియా సేఠ్‌గారి వైపుకు తిరిగి "అయ్యా, తమ రింతగా యీ మర్యాదెందుకు చేస్తున్నారో అర్థం కావడంలేదు" అన్నా.

సేఠ్ బర్జూటియా, కుర్చీ కాస్త ముందుకు జరుపుకుని, నా వంక ఒక నిమిషం తదేకదృష్టితో చూచి, "అయ్యా, నిజం చెప్పెయ్యమంటారా?" అనడిగాడు.

"తప్పకుండాను!" అన్నా నేను బలపంతపెడుతూన్నట్టు.

"అసలు సంగతి యేమిటంటే" అంటూ సేఠ్ బర్జూటియా కుర్చీ యింకా స్త దగ్గరికి జరిపాడు. "ఆ పత్రికావిలేకరుల గోష్ఠిలో నేనూ వున్నాను. పండిట్ జీతో మీరు మాట్లాడిన అసలు రహస్యంమాత్రం చెప్పకుండానే దాటేశారు మీరు. నా కప్పుడే సందేహం వేశింది."

"ఓహో!"

"ఆ మాట్లాడిన అసలు రహస్యం యేమిటో యిప్పుడు నాతో చెప్పెయ్యండి."

"మాట్లాడినవన్నీ రహస్యాలే. జాతీయ విషయాలు, అంతర్జాతీయ వ్యవహారాలు, పంచవర్ష ప్రణాళిక."

"పరిశ్రమల్ని గురించేమైనా మాట్లాడారా?"

పండిట్ జీతో నూనె శుద్ధి కర్మాగారాన్ని గురించి మాట్లాడిన సంగతి జ్ఞప్తికొచ్చింది నాకు. "ఆఁ, అవీ మాట్లాడా" అన్నా నేను.

"ఏమాత్రం వుంటుంది? పదిపదిహేను లక్షలుంటుందా?"

"అంతకంటే యెక్కువే."

"ఒక కోటి ఉంటుందా?" అంటూ కుర్చీ మరింతముందుకు జరిపాడు సేఠ్ బర్జూటియా,

"ఇంకా యెక్కువ."

"ఐదుకోట్లా?"

"లేదు, లేదు. మరీ యెక్కువ!"

"పదికోట్లా?" అంటూ కుర్చీ యింకా ముందుకు జరిపి నా ముహంలో ముహంపెట్టి మాట్లాడ్డం ప్రారంభించాడు. అతని శరీరంతో పాటు గొంతుకుకూడా కంపించిపోవడం ప్రారంభించింది.

"ఇరవైకోట్లకంటే గూడా యెక్కువ!" అన్నాన్నేను.

"ఆగం డాగండి!" అంటూ నా నోరతని చేత్తో మూశాడు. "గోడలకి చెవులుంటాయ్!"

"చెప్పేది వినండి!"

"ష్!" అంటూ యీసారి తన పెదవులమీద వేలానించాడు. "నా కంతా తెలిసింది. చాలు, మీరు చెప్పింది చాలు. ఇరవయ్యయిదు కోట్లు! భలే, భలే! వినండి గార్ధభరావుగారూ! యివ్వాళ్టి నుంచి మీరూ, నేనూ పార్ట్నర్లం? భాగస్థులం!?"

"భాగమా? ... భాగం యేమిటి?" అన్నానేను విస్తుపోయి.

"అదే, పండిట్ జీతో మీరు మాట్లాడిన పరిశ్రమలో."

"కాని ..." అని అన్నానేకాని, తర్వాతిక నన్ను మాట్లాడనివ్వలే దాయన.

"కానీ గీనీ అనబోకండి. మీరు తెలివితేటలుగలవారు. మీ దగ్గర డబ్బులేదు; నాదగ్గర వుంది; కావలసినంతుంది. డబ్బంతా నేనే పెడతాను. లాభాల్లో మీకు మూడోవంతు!"

నేను తలడ్డంగా వూపుతూ, "కాని, చూడండి మరి..." అన్నానో లేదో మళ్ళీ నా మాటమధ్యలోనే తుంచి ఆయనే మాట్లాడ్డం ప్రారంభించాడు.

"సరే, సరే, మీకు సంతృప్తిగా లేదన్నమాట. పోనీ, చెరి సగం చేసుకుందాం. ఫిఫ్టీ, ఫిఫ్టీ! యిక మాట్లాడొద్దు. ఇదుగో, ఈ కాగితంమీద సంతకం చేసెయ్యండి. నేను టెలిఫోన్ చేసి, సొలిసిటర్తో మాట్లాడి, అంతా ముందే తయారుచేయించుతాను. చూశారా, నే ననుకున్నది నిజమే అయ్యింది."

"మీరు పొరబడుతున్నారండీ! నేను సంతకం చెయ్యను."

నావంక మిర్రిమిర్రి చూచాడు బర్జూటియా; "యింకా మీరు గాడిద లనుకున్నాను. మీరు నా తలదన్నేట్టున్నారు. సరే, కానివ్వండి, నాకున్న వ్యాపారాలన్నింటిలోనూ సంగంవాటామీది. ఇక కాదనకండి. నిజం చెబుతున్నా, యింతకంటేమించి యింకెవ్వరూ యెక్కువివ్వరు. నా వ్యాపారాల్లో భాగస్థులు కావడంఅంటే అదేవొక పెద్ద గౌరవం."

"చూడండి! నే నొక మామూలు గాడిదని ..."

"ఐతే యేం? వ్యాపారంలో భాగస్తులు గాడిదలైతేనేమంచిది. లేకుంటే అసలు వాళ్ళ కింతింత లాభా లెక్కణ్నుంచొస్తాయి? ఇందులో మీకు తెలియందేముంది?" అంటూ గది అదిరిపోయేట్టు నవ్వాడు సేఠ్ బర్జాటియా. చిన్నప్పట్నుంచీ నాతో కలిశి గడ్డిమేస్తూ తిరిగిన గాడిదలా ఎంతో స్వతంత్రంగా వీపుమీద చెయ్యివేశి నిమరడం మొదలెట్టాడు.

నావంకచూచి, కన్నుగిలిపి, "మీకు నేనొక గది ప్రత్యేకం చేస్తాను. ఫస్టుక్లాసుగా వుంటుంది. ఎయిర్‌కండిషన్డ్ గది! పెద్ద పెద్ద గుర్రప్పందాల్లో తిరిగే మహారాజుల గుర్రాలుగూడా కనీవినీ యెరుగని గది. రాత్రికి మున్నాబాయి ఆటా, పాటా యేర్పాటుచేస్తాను..."

"లేదండీ, నేనొక బీదచాకలి గాడిదని. పాపం, వాళ్లు నా కోసం యింటిదగ్గర యెదురు చూస్తూంటారు. ప్రధానమంత్రి వాళ్ళ కిమ్మని నా చేతికి డబ్బిచ్చారు. ఆ డబ్బు వాళ్ళ కిచ్చెయ్యాలి."

"ఎక్కడి కెళ్ళాలని?"

"యమునానది కవతలి వొడ్డున, కృష్ణనగరం."

"అక్కడికి మీ రెళ్ళటందేనికి? నా బ్యూక్‌కారుపంపి వాళ్ళనే యిక్కడికి తీసుకొస్తాను. వాళ్లొచ్చి యిక్కడే వుంటారు, యిదిగో మన ఆవరణలోనే బయటొక యిల్లుంది. మాకు చాకలీ లేడు. మొన్నే వాడొతి దొంగని వెళ్ళగొట్టేశాం. మా యింటి చాకిరం చేసుకుంటూ బ్రతుకుతారు. ఏం ఫర్వాలేదు. అంతా నేను సరిచేస్తాగా మీరు నిశ్చింతగా వుండండి. కాగితంమీద సంతకం యిప్పుడే చెయ్యనవసరం లేదు. కాస్సేపింకా కావాలంటే ఆలోచించుకో. నా బలవంతం ఏమీ లేదు. కాని నామాట తీసెయ్యక, మా అతిథిగా యింకొన్ని రోజులుండాలని నా మనవి."

ఆ కాగితం తీసి జేబులో పెట్టుకుని, నావంక దిగాలుగా చూచాడు నాకూ జాలేసింది. "పోనీ, యింకొక నాలుగురోజు లిక్కడే వుంటే పోయిందేముంది. రాముా భార్యాబిడ్డల కిక్కడింత నీడ దొరుకుతుంది, మంచిదే'' అనుకున్నా.

# విశ్వవిఖ్యాతి

మర్నాడు—

"మాంచి గాఢనిద్రలో వుండగా చక్కని సంగీతం వినిపించింది. ఆ సంగీత మాధుర్యానికి నా గాడిదనిద్ర (మనుషులు దీన్ని కుంభకర్ణుడి నిద్ర అనంటారేమో) దూరంగా పారిపోయింది. దోమతెర తీసి చూద్దునుగదా నౌకర్లు ఫలహారం తీసుకుని నిలబడున్నారు. ఉడకేసిన ఆ సన్న జొన్నలు చూస్తే నా నోరూరింది. అవసరంవస్తే వసుదేవు డంతటివాడు గాడిద కాళ్లు పట్టుకున్నాడట. ఈ రోజుల్లోనూ, లాభం వుందనుకుంటే 'గాడిదే నా తండ్రి' అని సాగిలబడి మొక్కేవాళ్ళు కొందరున్నారని విన్నానుగాని" యింతవరకు చూడ నోచుకోలేదు. ఈనాటితో ఆ కొరతా తీరింది. ఇంకా నేను ఫలహారం చెయ్యడం పూర్తిగానేలేదు, సేఠ్ బర్జాటియా గంపెడు పత్రికలు చంకనబెట్టుకు నొచ్చాడు. వచ్చీరావడంతోనే, నే నతనికి 'స్వయంగా' తమ్ముణ్నో, తండ్రినో అయినట్టు వాటేసుకుని కౌగలించుకున్నాడు. "చూశారా, మీ పేరు ప్రపంచంలోవున్న పత్రికల కన్నింటిలోకీ యెక్కింది. ప్రతి పత్రిక లోనూ మొదటి పుట వార్తే మీది! తైవాన్ సమస్య, చర్చిల్ ఉపన్యాసం అన్నీ లోపలి పేజీల్లోకి నెట్టి, మీ వార్తకే ప్రధాన ప్రాధాన్యం యిచ్చారు" అన్నాడు.

'డెయిలీ మిర్రర్' పత్రిక ఏడుకాలాల పతాకశీర్షిక యిచ్చింది. 'భారత ప్రధానితో మాట్లాడే గాడిద భేటీ!', 'ప్రపంచంలోని అష్టమ వింత!!' అంటూ.

'న్యూయార్క్ టైమ్స్' పత్రికలో నా బొమ్మా, ఫ్రాన్సిస్ (హాలీవుడ్ 'గాడిద' తార) బొమ్మా ప్రక్కప్రక్కనే వేశారు. ఆ పత్రిక ఒక సంపాదకీయం గూడా వ్రాసింది.

ఆ సంపాదకీయంలో సారాంశం యిది: భారత ప్రధాని ఆ మాట్లాడే గాడిదతో మాట్లాడగాలేనిది, మన మెట్రో గోల్డ్విన్ మేయర్ (హాలీవుడ్ సినీ సంస్థ)కి చెందిన యీ ఫ్రాన్సిస్‌తో యెందుకు మాట్లాడగూడదు? అనతికాలంలో ఫ్రాన్సిస్‌తో భారత ప్రధాని భేటీ

జరిగితే సరేసరి; లేకుంటే మొత్తం ఆసియాలోనే మన పేరు ప్రతిష్టలు దెబ్బతినిపోతై.

ప్రపంచంలోవున్న గాడిదలుకూడా యుద్ధానికి వ్యతిరేకంగా మాట్లాటం ప్రారంభించినై; పశ్చిమదేశాల కిదొక కొత్తవిపత్తు !"

ఫ్రాన్స్‌లోని మితవాద పక్షపత్రిక "లామాం డే' శీర్షికలో కొంత వ్యంగ్యం తొంగిచూచింది.

"నెహ్రూగారి గాడిద—పంచశీలపక్షం !"

'లామాండే' అంతకంటే గొప్పగా రాస్తుందని నేనూ అనుకో లేదు. మనదేశంలో పత్రికలు దాదాపన్నీ పెద్దపెద్ద అక్షరాలతోనే ప్రకటించినై నావార్త. కొన్ని పత్రికలు సంపాదకీయాలూ వ్రాసినై. పండిట్ జీ ఒక మామూలు గాడిదతో మాట్లాడవలసిన ఖర్మేంవచ్చిం దని. కొన్ని పత్రికలు వ్యాఖ్యలూ, విమర్శలూ, మరికొన్ని పత్రికలు తర్జన భర్జనలూ చేసినై.

ఒక్కమాట మట్టుకు నిజం. ఇరవైనాల్గుగంటల్లో నా ఖ్యాతి ప్రపంచమంతటా పర్యటించింది; ఎక్కడ చూచినా నన్నుగురించే చర్చ.

## టెలిగ్రాములు కుప్పతెప్పలు

"ఆ పత్రికల దేంవుందండీ, యిదుగో, యీ టెలిగ్రాములు చూడండి" అంటూ నాముందు టెలిగ్రాముల గుట్టలు పేర్చాడు సేఠ్ బర్జూటియా. అందులో చాలావరకు నాకు ధన్యవాదా లర్పించినవే. కాకపోతే, 'సొంతలాభం' కోసం వచ్చినవీ కొన్నివున్నై.

"ఇది చూడండి, యిది కాంచన గంగ పర్వత శిఖరారోహణ్ణికి సన్నద్ధం అవుతున్న జర్మన్‌దళానిది. మీరు మొదటి వేయి అడుగులూ వారితోపాటు వేస్తే వారు చాలా ఆనందిస్తారట. మీ మీదేమీ బరువులు వెయ్యం అని హామీ యిస్తున్నారు."

"ఇదిగో, యీ టెలిగ్రాం చూడండి, ప్రసిద్ధ హిందీ చిత్ర దర్శ కులు అహ్మదబ్బాస్, రమేష్, సైగల్‌లు యిచ్చారు. నెలకు పదివేలు జీతం యిస్తారట. రానూ పోనూ విమానం, హోటలు ఖర్చులు

వారివే. మీ ప్రక్కన నటించేందుకు నళినీజయంత్, నర్గీస్‌లతో సంభాషణలు నడుపుతున్నారట. మీకు వీళ్ళిద్దరిలో యెవరు యిష్టమో వెంటనే తెలియజేయవలసిం దంటున్నారు.

ఈ వైర్ చూశారా! హిందీ హాస్యనటులు జానీవాకర్, భగవాన్‌లు మీతో కలిశి, ఒక హాస్యచిత్రం తయారుచేయా లనుకుంటున్నారు. మీ పేరే పెద్దక్షరాల్తో వాళ్ళిద్దరిపేర్ల పైనా వేస్తారట. ఇష్టమేనా మీకు?

"ఇది 'ది గ్రేట్ రాయల్ ఇండియన్ సర్కస్' వాళ్ళిచ్చారు. మిమ్మల్ని తీసుకుని ఐరోపా పర్యటన చెయ్యాలనుందట వారికి."

అవన్నీ వింటూంటే నా కోపంవొచ్చింది. చిరాకేసింది. ఆ టెలిగ్రాముల కాగితాలన్నీ తీసి, దూరంగా విసరికొట్టేశా. సేఠ్ బర్జాటియా ముహం ముడుచుకుని, "జనంఅంతా యిలాంటి పేరు ప్రతిష్టలు రావాలని తహతహలాడిపోతూంటే, మీ రిలా చిరాకు పడతా రేమిటి? అయ్యా, యింతపేరు నాకు వొచ్చేట్టే వుండాలిగాని, గాడిదనైనా ఫర్వాలేదు, బురదగుంటలో పొర్లే పందినైనా ఫర్వా లేదు" అన్నాడు.

నేను కోపంపట్టలేక పళ్ళు నూరానంతే. పల్లెత్తు మాట్టాడలేదు.

"మిమ్మల్ని చూడాలని జనం తండోపతండాలుగా వస్తున్నారు. బయటి వరండాఅంతా నిండిపోయింది" అన్నాడు సేఠ్.

"నేనిప్పు డెవర్నీ కలుసుకోను" అంటూ తోక గట్టిగా వూపా కోపంతో.

"కనీసం ఢిల్లీ మునిసిపల్ కమిటీ ఛైర్మన్‌గారికన్నా అవకాశం యివ్వండి!"

"ఆఁ! వారూ వచ్చారా?"

"ఊఁ, యేమిఁటనుకొన్నారు మరి!" అంటూ, యిదంతా తానే చేశానన్నట్టు, నన్నుచూచి కన్నుకొట్టాడు బర్జాటియా. "ఢిల్లీ మునిసిపల్ కమిటీవారు మీ కొక సన్మానపత్రంగూడా సమర్పించదలుచుకున్నారు."

"నాకా ?!" అంటూ ఆశ్చర్యం పట్టలేక అరిచేశా. "ఒక మామూలు గాడిదకా ?! ఈ ఢిల్లీ మునిసిపాలిటీకి పిచ్చెత్తలేదుగద!"

"మీ రిప్పుడు మామూలు గాడిదలటండీ!" అన్నాడు బర్జూటియా సంతోషంతో మొహం చేటంత చేసుకుని. "ఇప్పుడు మీరు సంపూర్ణ భారతదేశంలో, విశ్వవిఖ్యాత గార్ధభంగారు!"

"ఇంత ఖ్యాతి యెందుకొచ్చినట్టు? పొరపాటునో, గ్రహపాటునో నేను ప్రధానిగారింటికి వెళ్లితే, ఆయన ప్రేమగా నా వీపునిమిరి, నా మీదెక్కి సవారీ చేసినందుకేగా ?! ఎవరండీ గాడిదలు, నేనా? మీరా!"

"మీరు 'ఊఁ' అంటే, వెళ్లి పిలుచుకొస్తాను."

"వొద్దొద్దు అయ్యా! నాకా అర్హతలేదు. ఢిల్లీ మునిసిపల్ కమిటీ యేమిటి! నాకు సన్మానం చెయ్యడం యేమిటి ?"

"అదేమిటండీ అలా మాట్లాడతారు? ఇప్పుడు కాదనంటే మనిద్దరిపరువూ పోతుంది. మీ తరపున నేను వూఁ అనే సొచ్చాను. అసలీపాటికి వా ళ్ళేర్పాట్లన్నీ పూర్తిచేసుకునుంటారు. వీధులన్నిట్లో పోస్టర్లేశారు. పట్టణ ప్రముఖు లందరికీ ఆహ్వానాలు పంపారు. మీ రిప్పుడు సన్మానం వొద్దంటే యెట్లా? అంతా నిరుత్సాహపడిపోతారు. చూడండి, అదీగాక యింకోటుంది" అంటూ సేఠ బర్జూటియా నా దగ్గరకు జరిగి, నాకోసమన్నా, నన్ను చూచైనా ఒప్పుకోండి! మన పార్టనర్‌షిప్‌కిది చాలా మంచిదీ, లాభప్రదమూనూ" అని; అతి, నెమ్మదిగా చెప్పాడు.

"పార్టనర్షిప్పేమిటి ?" అంటూ విసుక్కున్నా నేను.

"అరెరే, పొరపాటైపోయింది. ఆమా టెత్తవలసింది కాదు. నాదే తప్పు" అంటూ పక్కికిలించాడు. "సరే, అయితే మరి నే వెళ్ళి మీ కిష్టమేనని చెప్పేసొస్తా" అంటూ లేచాడు.

"అది కాదు, యిటు చూడండి..."

ఇటు చూడనూలేదు; నే చెప్పేది విననూలేదు. గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

# రూపవతీ సందర్శనం

రెండు నిమిషాలైనా గడిచాయో, లేదో; ఇంతలో ఆడపిల్లల గుంపొకటి వచ్చిపడింది గదిలోకి. అందరూ కాలేజీల్లో చదువుకునే ఆడపిల్లలే అనిపించారు. నవ్వుతూ, కేరింతలుకొడుతూ నా చుట్టూ మూగారు. ప్రతీ ఆడపిల్ల చేతిలోనూ ఒక 'ఆటోగ్రాఫ్' పుస్తకం వుంది. ఆ పుస్తకాల్లో పీలారమణి, దేవానంద్, రాజకపూర్, దిలీప్ కుమార్, సినిమాతారల సంతకాలున్నై. వాళ్ళందరూవచ్చి నా సంతకం గూడా ఆ పుస్తకాల్లో కెక్కించుకోవాలని తహతహలాడుతున్నారు. దిలీప్‌కుమార్‌నీ, గాడిదనీ ఒకేగాటకట్టేసే ఘనమతులు వీళ్ళు! ఈ కృత్రిమఖ్యాతిమూలాన్న అంతచక్కని కళ్ళకింత చిక్కని గంతలా!

సరేనని సంతకాలు చేయడం ప్రారంభించా. సేఠ్ బర్జూటియా, ఒకమ్మాయిని వెంటపెట్టుకుని వూరికే నా చుట్టూ కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. కాస్సేవున్న తర్వాత, "మా అమ్మాయి – రూపవతి. అమ్మాయి పుస్తకంలో సంతకంతోపా టింకేమైనా 'వ్రాయండి" అన్నాడు సేఠ్.

రూపవతి నిజంగానే రూపవతి. సన్నగా, పొడుగ్గా, సుకుమా రంగావుంది. ఆచూపుల్లో అదోరకమైన గర్వం, గడుసుదనం,గొంతులో దర్పం, మర్యాదలో కృత్రిమం, రంగూ, రూపమూచూస్తే గిర్రునతిరిగే బొమ్మలా వుంటుంది ...

"యేం రాయను?" అనడిగా రూపవతిని.

"నాకేం తెలుసు? రాయాలనుకుంటే రాయండి. లేకుంటే మానేయ్యండి" అని విసురుకుంటూ పుస్తకం మూసేసింది.

"అమ్మా!" అని ఆప్యాయంగా సంబోధిస్తూనే, కూతుర్ని ముదల కించాడు సేఠ్ బర్జూటియా. అమ్మాయి చల్లబడింది. అంతవరకూ ఆ కనుల్లో వుట్టిపడిన గడుసుదనం మాయమైంది. లేడికన్నుల్లా కదుళ్ళాడినై.

రూపవతి కోమలహస్తం నా భుజాన్ని తాకింది. "మీాయిష్ట మండీ" అంది. ఒక దీర్ఘ నిశ్వాసం విడిచింది. మలయమారుతంవీచింది.

నా చుట్టూ పచ్చని పచ్చికపరచి ఒత్తుగా పేర్చినట్లయింది. నవనవ లాడే పైరు చేయెత్తిపిలిచి ఆహ్వానిస్తోందనిపిస్తుంది. చెట్ల గుబురు లోంచి లేతయెండ చదరంగం ఆడింది. ఆకాశంలో తెల్లని మబ్బు తునకలు దూదిపింజల్లా తేలియాడినై.

నేనిక ఆ ఆనందాన్ని అణచుకోలేక పోయాను. ఒక్కసారి ఓండ్రపెట్టేశాను, జీరలేని గొంతుతో, మనస్ఫూర్తిగా, నిర్విచారంగా వున్న గాడిద, ఆత్మసంతృప్తితో నలుదిశలూ ప్రతిధ్వనించేట్టు ఓండ్ర పెడుతుందే, అలా! ఆ ఉత్తమ సంగీతం!!

ఆ ధ్వనివిని ఆడపిల్లలంతా గదిలోంచి పరుగెత్తుకు పోయారు. చాలామంది పుస్తకాలక్కడే వదలిపోయారు. నేనొక్కదాన్నే,ఏకాకిగా నిలబడిపోయా ఆ గదిలో.

నిజంగానే, యీ మనుషులు చాలా వింతైన మనుషులు. వాళ్ళ సంతోషమే వాళ్ళ కానందం; ఆ ఆనందంలోనే సంగీతం వినగలుగు తారు వాళ్ళు; యితరుల ఆనంద సంగీతాన్ని విని భరించలేరు; పారి పోతారు!

## సన్మాన ఏర్పాట్లు

చాందినీచౌక్ నుంచి మన గాడిద ఊరేగింపు ప్రారంభం. మేడలమీదనుండి, మిద్దెలమీదనుండి పుష్పవర్షం. ఢిల్లీ మునిసిపల్ కమిటీ సమర్పించిన సన్మానపత్రం. దానికి మన గాడిద సమాధానం.

పాఠక మహాశయులారా! ఢిల్లీ మునిసిపల్ కమిటీ నాకెంత గొప్ప సన్మానంచేసిందో యెలా చెప్పను! ఎంత పెద్ద వూరేగింపు లేవదీశారని! లక్షలాదిజనం వీధుల కిరువైపులా బారులుతీరి నిల బడ్డారు. ఇక స్త్రీల సంగతి చెప్పనవసరమేలేదు. మూఢనమ్మకాలకు మూలవిరాట్టులనే ప్రఖ్యాతి వారికుండనేవుంది. అందులో నేను మాటలు నేర్చిన గాడిదని. ఇదంతా యేదో దైవమహిమని చెప్పారట కొందరు. వారికి ఇంకేముంది. చాందినీచౌక్ గుండా నా వూరేగింపు బయలు దేరిందో లేదో, మహిళామణులంతా కిటకీలనిండా కిటకిటలాడి పోయారు; పుష్పవర్షం కురిపించారు నామీద.

ఆ ఊరేగింపులో మాటిమాటికీ "గాడిదకీ జెయ్" అని చెవులు గింగురుమనేట్టొక ఈ నినాదాలు. దారిలో మధ్యమధ్య ఊరేగింపు నాపడం, దర్శనాభిలాషులందరికీ నా దర్శనం చేయించడం, నేను మామూలు గాడిదని కాదని నిరూపించేందుకు నన్ను మాట్లాడమని కోరడం. నేను మాట్లాడగానే కొంతమంది ముఖాలు వివర్ణమైపోయినై; మరికొంతమంది మూర్ఛపోయారు. ఇంకొందరు అక్కడే మోకరించి సాష్టాంగ దండప్రణామంచేసి, నా నామసంకీర్తన దండకం ప్రారంభించారు. మొత్తంమీద పట్టణం అంతటా అదోరకమైన మత ప్రాబల్యం, ధార్మిక ప్రభావం వ్యాపించినట్లనిపించింది. ఇదంతా సేఠ్ బఝాటియా గారి చలవేనని తర్వాతగాని తెలియలేదు నాకు.

ఊరేగింపుకి వెళ్ళేముందు నాకు చక్కగా నలుగుపెట్టి, వాసన సబ్బుతో స్నానం చేయించారు. నా జీవితంలో అంతకుముందెప్పుడూ అంత శుభ్రంగా వుండెరగను. వీపుమీద రంగురంగుల పట్టుజీను పరచారు. నా నుదుటిమీద వేళ్ళాడేటట్లు ఒక ముత్యాలకుచ్చు కట్టారు. మెడనిండా యింతెత్తున పూలమాలలు, నా కటూ యిటూ యిద్దరు సేవకులు. వారిద్దరి చేతుల్లోనూ రెండు బ్రషులు. జన సమ్మర్దంకదూ; అందుకని వీధుల్లో దుమ్మురేగింది. ఆ ధూళి నా మీద వాలివాలకముందే వాళ్ళా బ్రషుల్తో దాన్నికాస్తా దులిపవతల పారేశే వారు. ఇంకో యిద్దరు సేవకులు రెండురెళ్ళు నాలుగు చేతుల్లోనూ నాలుగు అత్తరుబుడ్లు, నాలుగు పన్నీరుపాత్రలూ పట్టుకుని నిత్యం నామీద జల్లుతూ నిలబడ్డారు. అసలు సంగతి చెప్పటం మరచిపోయాను. ఉదయం కళ్ళు తెరిచీతెరవకముందే సేఠ్ బఝాటియా ఒక మంగలిని పిలిపించి నా తోకకి చక్కగా కత్తెరేయించాడు; కాలి గోళ్ళు తీయించాడు. నిజంగానే యీనాడు యావత్ప్రపంచంలోనూ సుందరాతి సుందరమైన గాడిదని నేనే! అందులో అణుమాత్రంకూడా సందేహం లేదు.

## సన్మానం

ఇలా అలంకరించి నన్ను పురమందిరానికి (టౌన్‌హాలుకి) తీసుకెళ్ళారు. నేను పురమందిరంలోకి అడుగుపెట్టగానే అంతవరకూ

అక్కడ నా కోసం వేచి కూర్చున్న మహామహులూ, మహాశయులూ అంతా గౌరవ పురస్సరంగా లేచి, చేతులు జోడించి మళ్ళీ తమతమ స్థానాల్లో వుపవిష్టులయ్యారు. నన్ను వేదికమీదికి తీసుకెళ్ళి ఉన్నతాసనం అలంకరింపజేశారు. తర్వాత అనేక సంఘాల తరఫున ప్రతినిధులొచ్చి పూలమాలలు వేశారు. బహూకృతు లందజేశారు. మునిసిపల్ కమిటీ అధ్యక్షుడు లేచి సన్మానపత్రం చదవడం ప్రారంభించారు.

"తమరు ప్రప్రథమంగా మా మునిసిపల్ కమిటీ భవనంలో అడుగిడినప్పుడు తమ రెవరో మాకు తెలిసిందికాదు. తమ రతి మామూలైన గాడిదే ననుకొని తన్ని బయటికికొట్టాం. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన తమరిని ఆనాడలా అవమానించినందుకు మేం పశ్చాత్తాపులమైనాం. ఈనాడు తమకు మేము చేస్తున్న యీ సన్మానం ఆనాటి అవమానాన్ని తొలగించజాలదు కాని యీ నిండుసభలో మేము తమరి నర్పించే క్షమాపణను తమ హృదయం తప్పక స్వీకరిస్తుందని విశ్వసిస్తున్నాం. శ్రీమాన్ గార్ధభంగారూ! మమ్మల్ని క్షమించండి, ఇదే మా వేడుకోలు.

తమరు తప్పక మమ్మల్ని క్షమిస్తారనే మా ఆశ. తమ హృదయం అంత విశాలమైనది. తమరంత గొప్పగాడిదలు మాకు తెలుసు. మహాశయా! చనిపోయిన చాకలి రాముా కుటుంబాన్ని చూచి తమరు జాలిపడి, ఆ కుటుంబానికి సహాయం చేసే నిమిత్తం, పాదయాత్రతో ఆఫీసులన్నీ గాలించిన విషయం ఒక్కటే చాలు. పేదలపట్ల మీకున్న సానుభూతినీ, ఆదరాభిమానాన్నీ చాటి చెప్పేందుకు తమరు గాడిదయినప్పటికీ, మానవజాతిపట్ల నిక్కుటమైన ప్రేమాదరాలతో తమ హృదయాన్ని పరిప్లుతం చేసుకున్నారు. ప్రతి మానవుడూ తమరిలా గాడిదైతే యెంత బావుండును!

తమ నిస్వార్థ సేవనీ, శాంతి ప్రియత్వాన్నీ, సహానుభూతినీ, మానవ ప్రేమనీచూచి, తమరుచూపే ఉజ్వలాదర్శాన్నీ చూచి పులకించి యీ ఢిల్లీ మునిసిపల్ కమిటీ చంద్రునికో నూలుపోగన్నట్టు తమరికి పుర పౌరహక్కుల నిస్తున్నది. కొత్తఢిల్లీలో గాడిదలు ప్రవేశించగూడదనే నిషేధం వుండిపోయింది. లేకుంటే ఆ పురభాగ పౌరహక్కులుగూడా ఇచ్చి వుండేవాళ్ళమే.

"అస్తు, తమరిపట్ల మాకున్న గౌరవాన్ని యీ విధంగా వ్యక్తం చేసుకుంటున్నాం, స్వీకరించండి! మమ్మల్ని ధన్యుల్ని చేయండి."

సభంతా పదినిమిషాలపాటు కరతాళధ్వనులతో ప్రతిధ్వనించి పోయింది.

తర్వాత, మూగజీవకారుణ్య సంఘంవారూ, జట్కా గుర్రాల సానుభూతి సంఘంవారూ, మరికొందరూ తమ తమ సన్మానపత్రాలు చదివారు. ఆ సన్మానపత్రా లన్నిటిలోనూ నా సేవాతత్పరతని ప్రస్తుతించారు. ఒక్కొక్క టే విన్నకొద్దీ నాలోవున్న లజ్జ తాళ్ళు తెంపుకుని పారిపోవడం ప్రారంభించింది. అవి పూర్తయ్యేప్పటికి వాటిల్లో ఉల్లేఖించిన విషయాలన్నీ వాస్తవాలే ననిపించింది.. అందులో అంతిమ సన్మానపత్రంలో, అంతిమవాక్యం నా కిప్పటికీ గుర్తుంది.

"తమరొక్క యీ ఢిల్లీ గాడిదలకే కాక, భారతీయ గార్ధభాల కన్నిటికీ యెనలేని యశస్సు సమకూర్చిపెట్టారు. ఈ దెబ్బతో భారతీయ గార్ధభాల కీ ప్రపంచంలో అనన్యసామాన్యమైన స్థానం లభించి తీరుతుంది. తమరుచేసిన సేవల నీ భారతజాతి యెన్నటికీ విస్మరించదు. తమ రిలాగే కలకాలం యీ దేశానికి సేవచేస్తూవుండేట్టూ, తమ సానుభూతి ఛత్రచ్ఛాయలో మేమంతా నిర్విచారంగా మనగలిగేట్టూ భగవంతు డనుగ్రహించుగాత!

మరి ఆ సన్మానపత్రాల కన్నిటికి సమాధానం యివ్వాలినేను. అందుకని లేచి, నిలబడి ముందున్న మైక్రోఫోన్‌ని తీసి ప్రక్క నెట్టబోయాను. ఇంతలో అగ్రాసనాధిపతి లేచి, "అయ్యా,అది మైక్రోఫోను!" అన్నారు.

"ఇది మైక్రోఫోనని నాకూ తెలుసునండి. నేను గాడిదని. నా గొంతు చాలా పెద్దది. నాకీ మైక్రోఫోన్ అవసరంవుండదు" అని చెప్పానేను.

అగ్రాసనాధిపతికి నామాట లర్థమైనై, వెంటనే ఒక బంట్రోతుని పిలచి ఆ మైక్రోఫోన్నక్కడనుంచి తొలగించారు. నేను నా వుపన్యాసం మొదలెట్టాను.

"మహాశయులారా! మహిళామణులారా ఇది ఢిల్లీ నగరం. అనేకసార్లభివృద్ధయి పదే పదే పాడైపోయిన నగరం. పాడైనది మళ్ళీ బాగైనది. ఇక్కడి కనేకమంది పాదుషాలొచ్చారు; తమ తమ ప్రతాప విలాసాలుచూపి కాలగర్భంలో కలిసిపోయారు. అనేకగాడిద లొచ్చినై తాము చెప్పదలచుకున్నది చెప్పి వెళ్ళిపోయినై. ఈ నాడు తమ ముందొక గాడిద నిలబడి వుంది. గాడిద ఐనప్పటికీ మనుషుల్లా మాట్లాడగలదన్న దొక్కటే యీ గాడిదలో వున్న విశేషం. కాని, నాదొక్క మనవి. ఇందులో విచిత్రమంటూ యేమీలేదు. మానవ సంతానం తోడేళ్ళ గుంపులో పెరిగి ప్రవర్ధమానమైతే, ఆ సంతానానికి తోడేళ్ళ గుణాలే సంక్రమిస్తూన్నై. అంచేత మనుషులమధ్య మెలిగే గాడిద మనుషుల్లా మాట్లాడంలో అబ్బురం ఏమీలేదు. నేను గాడిదనైనప్పటికీ మనుషుల్లా మాట్లాడగలుగుతున్నానని ఈ నాడు మీరు నాకు సన్మానంచేశారు. కానీ మనుషులయ్యుండీ గాడిదల్లా మాట్లాడేవాళ్ళకి మీరు సన్మానం ఎందుకు చెయ్యనుంకించడం లేదో నాకర్ధం కావడం లేదు.

"మీరన్నమాట నిజమే. మానవుడు మానవుడే. అతనిలో తెలివి వుంది, బుధ్ధివుంది, జ్ఞానంవుంది. ఈ గుణాలన్నీ వుండడంవల్లనే అతను పశువులకంటే మిన్న అని అందరూ అంగీకరిస్తున్నారు.

"కాని మానవుడు తన సంప్రదాయాన్ని మరిచిపోయాడు. తన జాతిని విస్మరించాడు. తన చరిత్ర నేర్పిన గుణపాఠాన్ని ఉపేక్షించాడు. భయంకర మృత్యుగృహాల్లోకి కళ్ళుమూసుకుని ప్రయాణిస్తున్నాడు. ఈ నా డతని గవేషణ జీవితంకోసం కాదు; మృత్యువుకోసం. సురుచిరమైన జీవన మందహాసం కోసం నీ చేతులవంక చూస్తోంది! ఉత్తమ జీవితంకోసం కాదు; నికృష్టమైన చావుకోసం! కోట్లాది జన సమూహాన్నీ, పశుపక్షి వృక్షతలనీ దగ్ధంచేసి, దహించి పారవేసి, బూడిదపాలు చేసే భయానక భయంకర మృత్యువు కొరకు ఈ భూతలాన్ని స్వర్గధామం చేసేందుకు బదులు, నరకయాతనల్ని సృష్టిస్తున్నాడు. మానవుడు చేసే యీ ఘోరపు క్రియలవల్ల ఒక్క గాడిదలకే కాదు, ప్రపంచంలోని జంతు జాలాని కంతటికీ ప్రమాదం ఏర్పడింది.

ప్రతీ చెట్టుకూ, ప్రతీ లతకూ, ప్రతీ పూవుకూ ప్రమాదం ఏర్పడింది. "ఓ మానవుడా! ఓ నా సహోదరుడా!! నీ వీనాడు తలపెడుతూన్న కార్యం మంచిదికాదు. నీ స్వార్థంకోసం నీ ద్వేషానలంతో నీ శత్రు నాశనం చేసే అధికారం నీకున్నదేమో కాని యీ విశాలవిశ్వంలో వున్న జీవసంతతినంతా అణుమృత్యుధూళి కెరజేసే అధికారం నీకులేదు.

"నీలో మానవ సహజమైన బుద్ధిజ్ఞానాలు నశిస్తే, గాడిదల బుద్ధిని యెరువు తీసుకో. చెవులపిల్లి తెలివితేట లలవరచుకో. గాడిద నుంచి నేర్చుకోకపోతేమానె! కనీసం ఆ ఆకుని చూచైనా నేర్చుకో!

-"ఓ మానవుడా! ఓ నా సహోదరుడా! మృత్యుముఖాన్నుంచి వెనక్కి తిరుగు, భూ మండలమంతటా భయభ్రాంతమైన ప్రాణి సమూహం నీ వైపు చూస్తోంది. నీ చేతులవంక చూస్తోంది. నువ్వేమి ప్రసాదిస్తావు మాకు? అణుబాంబులా? జీవితమా? అస్తిత్వమా? సర్వసంహారమా?

సన్మాన సభ ముగిసింది.

సన్మాన సంరంభం ముగిసింతర్వాత, సేఠ్ మన సుఖలాల్ గారు స్వగృహంలో నా కొరక విందుచేశారు. అది చాలా గొప్ప విందు. గొప్పవిందంటే ఎంతోమంది జనం వచ్చారనికాదు. గొప్పవారు, వచ్చిన వారు బహు కొద్దిమందే. కాని, ఆ కొద్దిమందీ చాలా గొప్పవారంటే బాగా వున్నవారు, కలవారు.

## కలవారి మహిళలు

విందులో పాల్గొన్న రెండు వందలమందీ నగరంలో బాగావున్న వారిలో వారే. అందులో అందరూ నాతో కరచాలనం చెయ్యాలనీ, నాతో మాట్లాడాలనీ, నా ప్రక్కన నిలబడి ఫోటో తీయించుకోవాలనీ తహతహలాడారు. ఈ 'గొప్ప' వారుగూడా లోలోపల యెంత చిన్న వారో, చౌకబారు కీర్తికోసం యెలా అర్రులుచాస్తారో అప్పుడుగాని పూర్తిగా అర్థంకాలేదు నాకు. అందరూ అలాంటివారేననికాదు. వారిలోనూ కొందరున్నారు. వారికి నాతోపాటు ఫోటోదిగాలన్న

కోరిక లేదు. బహిరంగంగా నాతో మాట్లాడ్డంకూడా వారికంత సహించినట్టు లేదు. కోటీకి పడగలెత్తిన సేఠ్ భాటియాజీ వారిలో వొకరు. కొన్ని బ్యాంకులకి, మరికొన్ని యంత్రాగారాలకీ, వందలాది భవనాలకీ యజమానిట ఆయన. ఆ లక్ష్మీపుత్రుడి కార్యదర్శి నా దగ్గరకొచ్చి, "సేఠ్ భాటియాజీ తమర్ని ఒంటరిగా కలుసుకోవా లనుకుంటున్నారు. మీ కప్పుడు వీలుంటుందో, చెప్పండి" అన్నాడు నా చెవిలో.

నేనేం చెప్పుదామని ఆలోచించుకోవడం పూర్తికానేలేదు. సేఠ్ మన సుఖలాల్ గా రొచ్చి, నా చేయిపట్టుకుని యింకో దిక్కుక లాక్కెళ్ళి, అక్కడున్నవాళ్ళకి పరిచయంచేశాడు. మళ్ళీ యేదో తలా తోకా లేనిమాటలు మొదలైనై. ఆగుంపులోనూ అందరికంటే గొప్పగా యింకోవ్యక్తి కనిపించాడు. చూచి యే స్వదేశ సంస్థానాధిపతో అను కున్నాను. కాదు, లాలాహరదయాళ్ పుష్కరిణిగారి గుమాస్తా అని తర్వాతతెలిసింది. ఆయనొచ్చి "మా సేఠ్ పుష్కరిణిజి మీతో ఆ యిరవై యైదుకోట్ల వ్యాపారాన్ని గురించి మాట్లాడా లనుకుంటున్నాడు" అన్నాడు.

ఈయనకీ యింకా నేను జవాబు చెప్పనేలేదు. సేఠ్ మన సుఖలాల్ రొప్పుకుంటూ వొచ్చి "శ్రీమతి సరిగమగారు మీతో మాట్లాడాలంటున్నారు, ఆవిడెవరో తెలుసా! వెలింగ్టన్ క్లబ్బుకు అధ్యక్షిణి!!" అని చెప్పాడు.

"సరిగమ అంటే సంగీత సాధన..." అని నేనింకా పూర్తి చెయ్యనేలేదు; "కాదండీ అది ఆవిడపేరు. కాకపోతే భారతీయ సంగీతం అంటే ఆవిడ చెవి కోసుకొంటారనుకోండి. ఇప్పుడా గొడవంతా దేనికిలెండి, రండి. వారిని పరిచయం చేస్తాను." అని నా భుజంమీద చేయివేశి, పుష్కరిణిగారి గుమాస్తావంక "ఆహా నా వస్తువుమీదే చేయి వేయాలని చూస్తావుగా!?" అన్నట్టు కొరకొరా చూచి, ఆ ప్రత్యర్థి దగ్గర్నుంచి శ్రీమతి సరిగమగారి వైపుకి లాక్కుపోవడం ప్రారంభించాడు. దారిలో ఒక మహిళా సమూహం చుట్టుముట్టింది నన్ను.

'మన సుఖలాల్ జీ! ఈ 'హీరో'కి మమ్మల్ని పరిచయం చెయ్యరూ?' అంటూ ముందుకొచ్చింది శ్రీమతి పాండుచంద్. ఆవిడ ముహాని కే రంగు పులుముకుందో యేమోగాని, అచ్చంగా పాండు వర్ణంగానే వుందావిడ ముహం.

మన సుఖలాల్ జీ అటూయిటూ చూశారు. ఆవిడతో పాటు యింకో ఐదారుగురు మహిళలు జోరీగల్లా ముసురుకున్నారు.

వాళ్ళంతా గొప్పగొప్ప సేఠ్‌ల ద్వితీయ, తృతీయ, చతుర్థపత్నీ శిరోమణులు. కొత్తగా ధనవంతులైనవారి కొత్త భార్యలు, ఏడెనిమిది మంది పిల్లల్ని కని, ఒక్క కోకతో కాలం గడపుకుని, ప్రతిదమ్మిడీ వెన కేసిన మొదటి భార్యలు యీ నూతన సౌభాగ్యానికి సరితూగలేక పోయారు. ఈ నవ్యవాతావరణంలో పల్లెటూరి బైతుల్లా కనిపించారు. అందుకని ఆ యా భర్తలు ఆ యా మొదటి పెళ్ళాల్ని పరత్యజించారు, వదిలేశారు. ఈ నవ్య సమాజంలో శరీర సౌందర్యం వుండాలి. నృత్య కళ నగ్నత్వం వుండాలి. గుక్క విడపకుండా యింగ్లీషు మాట్లాడ గలగాలి. ఈ మహిళలదగ్గర అవన్నీ ఉన్నై, అంతకు మించి మరేమీ లేవు. ఈ మహిళల బుర్రలొలిచి చూస్తే, అందులో ఒక భాగంలో చీరెలు, యింకో భాగంలో శృంగారసామగ్రి, మరో భాగంలో నానా రకాల చెప్పులు (సాండల్స్) యింకా యేదైనా భాగం వుంటే అం దులో రెండు మూడు పందలకు మించని యింగ్లీషు మాటలు వుంటై. ఒక ఖానాలో కోతులూ, పిట్టలూ, కుక్కలూ వుంటై. పిల్లల ఖానా మాత్రం ఖాళీ! ఈ నాటి నిత్య నూతన ప్రణాళికలతో వారికున్న సంబంధం అవినాభావం. వాళ్ళ ముద్దు పేర్లుకూడా గమ్మత్తుగా వుంటై. ఒకావిడ భర్తకు సిమెంట్ పర్మిట్ సంపాయించిచ్చిందట; ఆవిడ ముద్దుపేరు 'సిమెంటు వనిత', అలాగే లోహవనిత, వస్త్రవనిత, భారీ యంత్ర వనిత, యిటుక వనిత ... ఒకాయన పెళ్ళిమీద పెళ్ళిళ్ళు యేడు చేసుకున్నాడంటే, యీ వనితలకున్న ప్రాముఖ్యాన్ని ఇక మీరే వూహించుకోండి.

అసలు విషయం మరచిపోయాను యీ గొడవలోపడి. ఎక్కడున్నాను? ఆఁ! సేఠ్ మనసుఖలాల్ అటూ ఇటూ దిక్కులు

చూచాడు. వాళ్ళందరూ ఆయన సంపాదించుకుంటా మనిచూస్తున్న వాతికకోట్లనీ యెగవేసుకు పోదామని చూశే రాంబందుల్లా కనిపించారు.

వాళ్ళ దురాక్రమణ వలయాన్నుంచి నన్నెలా బైటపడెయ్యాలా అనే ఆలోచనలో పడిపోయాడాయన. ఇంతలో, శ్రీమతి పాండుచంద్ నా చెవులు నిమురుతూ, ""ఎంత కోమలం!"" అన్నది.

శ్రీమతి దుల్లారాణి, నా నుదురు తాకుతూ "ఓహో, యేమి అందం!" అని మెచ్చుకుంటూ ""మిష్టర్ గౌల్స్‌ని పంచిన అందం! కాదూ కమలా?"" అనడిగింది ప్రక్కనేవున్న మరోమహిళని.

కమల గౌల్స్‌ని మరిచిపోలేదు. కమల ఒకానొక సేఠ్‌గారి మూడవభార్య.

ఆ సేఠ్, ఒకసారి మిస్టర్ గౌల్స్‌తో పనిపడింది. మిస్టర్‌గౌల్స్ ఒక విదేశీ ఎంజనీరు. ఇక్కడొక ప్రాజెక్టు కట్టించేందుకొచ్చాడు. తర్వాత ఆ వుద్యోగంవూడి వెళ్ళపోయాడనుకోండి. ఆ వుద్యోగం వూడేలోగానే కమలాదేవి భర్త ఏడెనిమిదిలక్షలు పోసేసుకున్నాడు. కమల మరచిపోలేదు. ఎందుకనంటే ఆ రోజుల్లో కమలా, దుల్లారాణీ యిద్దరూ పందెం వేసుకుని మరీ ప్రయత్నం చేశారా గౌల్స్‌ని బుట్టలో వెసుకునేందుకు. చివరికి త్రాసు కమలవైపుకే మొగ్గు చూపింది.

కమల శరీరం చాలా అందంగా వుంటుంది, నున్నగా నీడలు తేలుతూ, ఆ శరీరంచూస్తే యిది భగవన్నిర్మితం అని అనిపించదు, యే ఫోర్డుమోటార్లు సంస్థలోనో తయారైనట్టుంటుంది. నున్నగా నగనిగలాడుతూ ఆపడ గొంతు మానవస్వరంలాగా వుండనే వుండదు; ఏ పియానో స్వరమో ననిపిస్తుంది. ఆ నడక! వెల్లింగ్టన్ క్లబ్బు సర్వసభ్యం మన మోహనం! ఏ గుడ్‌యియర్ కంపెనీయో తాజారకం టైరు తయారుచేసి, కమలపాదాల కంటించిందేమో ననిపిస్తుంది. ఆ కమలాదేవి హృదయం – కమలాదేవికున్న లోటదొక్కటే, ఆవిడకి హృదయంలేదు. ఆ హృదయం వుండవలసిన చోటులో పర్మిట్ల ఆఫీసుంది; రిజిస్ట్రేషన్ పత్రంవుంది, కొత్తప్రాజెక్టు టెండరుంది. ఇన్నివున్నాగాని, హృదయం మాత్రంలేదు. ఆవిణ్ణిచూచి మోహించి

ఆవిడ కావాలన్న వ్యాపార వాంఛని కాదన్నవారందరికీ యీ సంగతి బాగా తెలుసు; ఔనన్న వారికీ తెలుసు, కాని ఆ తెలుసుకోడానికి కొంతవ్యవధి కావలశొచ్చింది! ఆ వ్యాపారవాంఛ తీర్చేసింతర్వాత తెలిశొచ్చింది వాళ్ళకి. అంతే తేడా.

కమల విశాలయనాలు తెరచి, నా కనులలోకిచూచి యెంతో మృదుమధురంగా, "చక్కనిగాడిద! నిజంగానే నాగాడిద బంగారం!" అంటూ తన కోమల హస్తంతో నా వీపు నిమిరింది. కమల అలా నిమురుతుంటే, ఆ చేయి తగిలినంతలెక్కా నా చర్మం మెత్తని వెన్నపూసలా కరిగిపోవడం ప్రారంభించింది. ఇంకాస్సేపలాగే వుంటే, నేను నిలబడలేక మూర్ఛపోవల సొచ్చేదే. కాని యింతలో సేఠ్ మన సుఖలాల్‌గారి పుత్రిక, రూపవతివచ్చి నాకా ఆపద తప్పించింది. రూపవతి వచ్చి, కమలమీద నిప్పులు చెరిగింది, కళ్ళతోనే. కమల వెంటనే నా వీపుమీంచి చేయి తీసివేసింది. నేను కాళ్ళు నిలద్రొక్కుకుని నిలబడ గలిగాను. నా వీపుమీంచి చేయితీసి, ప్రక్కకు.తిరిగింది కమల. ఆ తిరిగేటప్పుడు పమిట సర్దుకుంటూ ఆ నాజూకు మార్దవంచూపి మరీ తిరిగింది.

"మీరు వీళ్ళతో తర్వాత మాట్లాడుదురు గాని శ్రీమతి సరిగమ గారు మీకోసం వేచి కూర్చునున్నారు. యెంత సేపట్నుంచో" అన్నది కుమారి రూపవతి.

నెమ్మదిగా, వారందరిదగ్గరా సెలవు తీసుకుని, రూపవతి వెనకే అడుగులో అడుగేసుకుంటూ బయలుదేరా నేను. "ఛీ నీచురాలు!" అని అన్నారు ఆ మహిళ సమూహంలో ఒకరు, నా చెవినిపడేట్టు.

బహుశా అదంతా రూపవతిమీద వచ్చిన కోపాన్ని వెళ్ళగక్కడం అయ్యుంటుంది.

శ్రీమతి సరిగమ భారీగా, లావుగా బాదంకాయలంతేసి కళ్ళేసుకుని, వెడల్పాటి వక్షంతో, భారీ పిరదుల్తో, హుషారుగా కదులుతుంటుంది. తలజుత్తు సగం నెరిసింది. ఆవిడ మాట్లాడేతీరు, నవ్వేతీరు వేరు వందమంది స్త్రీలలోవున్నా ఆవిడున్నదని కళ్ళు మూసుకుని ఆనమాలు పట్టేయొచ్చును. ఆవిడ యే స్త్రీ సమూహంలోవున్నా తన ప్రత్యేకతని

తాను నిలుపుకుంటూనే వుంటుంది. ముఖాకృతిలోకూడా స్త్రీత్వంకంటే పురుషలక్షణాలే యెక్కుటంగా వుంటై. ఆవిడ బొమ్మ తయారు చేసే ప్పుడు భగవంతుడు చివరినిమిషంవరకూ స్త్రీని చెయ్యాలో, పురుషుణ్ణి చెయ్యాలో నిర్ణయించుకోలేక పోయాడేమో ననిపిస్తుంది.

నన్ను చూచీచూడ్డంతోనే, సోఫామీంచిలేచి నా కుడచనిని యెడమచేత్తో పట్టుకుని గట్టిగాలాగి, "ఎలావున్నావ్, యువకశేఖరా!" అన్నది "బాగానే వున్నాను మేడమ్!" అన్నా మెడవంచి.

మగవాడు నవ్వినట్టు పక పకానవ్వి లాగి వీపుమీదొకటి చరచి, "చూశావా, నిన్ను చూడగానే గుర్తుపట్టేశాను!" అంది. ఆ చరుపుకి నా వీపెక్కడ పెట్లిపోయిందో నని భయం వేశిందినాకు.

"అమ్మా! లక్షమంది మనుష్యుల్లోనైనా ఒకగాడదను గుర్తించ వచ్చును. కాని యీ వందమంది స్త్రీలలోనూ ఒక బుర్రవున్న స్త్రీని గుర్తించడం నా వల్లయ్యేట్టులేదు" అన్నా.

ఆహ్హాహ్హాహ్హా అంటూ మళ్ళీ బిగ్గరగానవ్వి, మళ్ళ నా వీపుమీద గట్టిగా యింకొకటి చరిచి (యీ సారి నా వీపుమీద చర్మమే వూడి పోయిందేమో ననిపించింది) "యిదుగో యీయన నా భర్తసర్ సరిగమ" అని పరిచయం చేసింది ప్రక్కనే ఉన్నవ్యక్తిని.

శ్రీమతి సరిగమ ఉత్తరధృవమైతే, సర్ సరిగమ దక్షిణధృవం అంతభేదం వుంది వారిద్దరికీ. ఆయన సన్నగా, బక్కపలచగా గోగు పుల్లలావుంటాడు. చాలా సిగ్గరిలా కనిపించాడు. ఆయన పెదవులు కదలడమే కనిపించింది కాని, మాటలు వినిపించనేలేదు. భార్య చరచే చరుపులకా బొమికలు యెక్కడ విరిగి పోతాయోననే భయంతో వాటి నన్నిటినీతీసి యే బ్యాంకులోనో పదిలంగా భద్రపరచుకు వొచ్చా డేమో ననిపిస్తుంది ఆయన్ని చూస్తుంటే. శ్రీమతి సరిగమవెనుక, కుంయ్ కుంయ్మంటూ నడిచే బక్క కుక్కపిల్లలా వుంటాడు.

నే నాయన్ని గుచ్చిగుచ్చి చూడడం శ్రీమతి సరిగమ చూచింది. "వారినట్లా గుచ్చి గుచ్చి చూడొద్దు. ఇంకాస్సేపటాగే చూస్తే ఆయన గుండె ఆగిపోయినా ఆగిపోతుంది." ఆ మాటలు వినగానే

సర్ సరిగమగారి చెవులు యెర్రబడినై. మరుక్షణంలోనే మెడవరకూ అంతా తెల్లగా పాలిపోయింది. పెదవు లెండిపోయినై. ఏమిటో మాట్లాడబోయాడుగాని, గొంతు తడి ఆరిపోయిందేమో, నోట్లోనుంచి మాటే పెగల్లేదు.

"మీరు చాలా తెలివిగలవారని విన్నాను. ఇప్పుడు మా కొక పెద్ద సమస్య వొచ్చిపడింది. ఆ సమస్యను పరిష్కరించాలంటే మీ అంతటి మేధావి కావాలి మాకు" అన్నది శ్రీమతి నన్నుచూచి.

"నేనా ! నే నేదో మామూలు గాడిదని."

"మర లా దొంగనటనలు చెయ్యబాకండి. అసలు విషయం యేమిటంటే, రేపు సాయంకాలం మా వెల్లింగ్టన్ క్లబ్బులో సౌందర్య ప్రదర్శనపోటీలున్నై ఈ నగరంలోవున్న అందమైన స్త్రీలంతా ఆ పోటీల్లో పాల్గొంటున్నారు. ఈసారి పోటీలు చూచి న్యాయం నిర్ణయం చెయ్యడానికి మగవాళ్ళని పెట్టగూడదనీ, మిమ్మల్నే నియమించాలనీ నిశ్చయించుకున్నాం."

"నన్నా ? గాడిదనా ? యెందుకని ?"

"ఎందుకా ! మగవాళ్ళు ఆడవాళ్ళ నెప్పుడూ మోహదృష్టితో చూస్తారు గనక."

"గాడిద అలా చూడదని మీకంత గాఢ నమ్మకం యేమిటి ?"

శ్రీమతి సరిగమ మళ్ళీ పకపకా నవ్వింది. "ఏదేమైనా యీసారి మీరే న్యాయాధిపతులు. మా క్లబ్బుదంతా అదొక గొడవ. మగవాళ్ళెవళ్ళకి వాళ్లు తమతమ ప్రేయసీమణులే యీ బహుమానం కొట్టెయ్యాలని చూస్తారు. ప్రేయసీ లేని పురుష సభ్యుడు మా క్లబ్బులో లేనూలేడు. అంచేత నిష్పక్షపాతంగావుండే మగవాడు మా క్లబ్బులో దొరకడం గగనం. మా అదృష్టవశాత్తూ మీరొచ్చారు. మా సమస్య తీరిపోయింది. అదీగాక, బహుశా మీకు స్త్రీలనిగురించి పెద్దగా తెలిసి వుండదు."

"లేదు, లేదు; మీరు పొరపడుతున్నారు. నేనొక గాడిదని, అంచేత యీ సర్వమానవ జగత్తులో నాకు తెలియందీ, యింకో మగ వాడికి తెలిసిందీ యేదీ లేదు."

'అదేవిఁటి ?'

'తమరు చరిత్ర చదివే వుంటారు. రోమను సామ్రాజ్యకాలంలో సుందరీమణులు గాడిద పాలు తాగేవారు. తల్లిపాలలో వుండే గొప్ప గొప్ప గుణాలన్నీ గాడిద పాలలో వున్నాయని ఆనాటి నమ్మకం. నేను హాస్యానికనడం కాదు. ఈనాటికైనాసరే, యే డాక్టర్నడిగినా అదే చెపుతాడు. ఆఁ, ఆ సుందరీమణులు గాడిదపాలే తాగేవారు. గాడిద పాలతోనే స్నానమూఁ చేశేవారు. ఆ పాలతో స్నానంచేస్తే శరీరం నున్నబడుతుంది, తెల్లబడుతుంది. ఈ రోజులు వేరు, గాడిదల్ని పెంచ డంమానేసి, స్త్రీలు కుక్కల్ని పెంచడం ప్రారంభించారు. స్నానాలు మానేసి పౌడర్లద్దుకోపడం మొదలెట్టారు. అంచేతనే అందం నానాటికీ తీసికట్టు అవుతోంది. పైపై రంగులు కడిగేస్తే కొందరు ఆడవాళ్లెంత అసహ్యంగా వుంటారో, మాడమ్! నాకు తెలిసినంతగా యింకెవ్వరికీ తెలియదు.'

శ్రీమతి సరిగమ నా మాటలు విని సంతోషించింది. ఎందు కనంటే క్లబ్బులో స్త్రీ లందరిలోనూ ఆవిడ కురూపి అని ప్రసిద్ధి; పౌడరూ, రంగులూ వెసే అలవాటావిడకు లేదు. అందుకని నే నన్న పంతా, నాకు తెలియకుండానే ఆవిడకొక ప్రశంసాపాత్రమైంది.

శ్రీమతి సరిగమ నా మాటలు విని సంతోషించింద. క్లబ్బులో స్త్రీ లందరిలోనూ ఆవిడ కురూపిఅని ప్రసిద్ధి. పౌడరు రంగులూ వేసే అలవాటు ఆవిడకులేదు. అందుకని నేన్నమాట లామెకు నాకు తెలీకుండానే ప్రశంసాపత్రమైంది. ఆమె యీ విధంగా అంది: 'ఆఁ. మీరే యీ పోటీలకి జడ్జీలుగాపుండాలి; తప్పదు. కాని మరొక్క సంగతి గుర్తుంచుకోవాలి. మా ఆడవాళ్ళని, మీ ఆడగాడిదలతో పోల్చి చూడకూడదు. ఉదాహరణకి మా స్త్రీలకి రెండే రెండు కాళ్ళుంటాయి.' అంది శ్రీమతి సరిగమ.

'ఔనౌను. ఆ గాడిదకు నాలుగు కాళ్ళుంటై, ఎండ్రకాయకి ఎనిమిది కాళ్ళుంటై. ద్విపాద జంతువుల సౌందర్యానికీ, చతుష్పాద జంతువుల అందానికీ వుండేతేడా నాకు బాగా తెలుసు. మీకా సందేహం అవసరంలేదు.'

"ఆఁ! ఐతే మీరు రేపు ఆరున్నరకల్లా వెల్లింగ్టన్ క్లబ్బుకి డయ చెయ్యాలి. నేను మా కారు—అదే ట్రక్కు (లారీ) పంపుతాను. మీ ఘన సుఖలాల్ గారు దీని కేమీ అభ్యంతరం చెప్పరనే ఆశిస్తున్నాను.

ఇంతవరకూ కిమ్మనకుండా నిలబడివున్న మన సుఖలాల్ గారు వెంటనే "అబ్బెబ్బె, నాకేం అభ్యంతరం! మీరు మా అతిథిని గౌరవిస్తే మమ్మల్ని గౌరవించినట్టేగదా. ఆ సౌందర్య ప్రదర్శనలకి నేనూ హాజరౌతాను. మా అమ్మాయి రూపవతి ఆ పోటీల్లో పాల్గొంటోంది" అన్నాడు.

"నిజం!" అంటూ రూపవతిని ఆపాదమస్తకం ఒకసారి పరిశీలించి చూచింది శ్రీమతి సరిగమ. "సేఠ్ జీ! బహు అందమైన అమ్మాయి! యీసారి బహుమానం మీ అమ్మాయే కొట్టేశినా కొట్టెయ్యొచ్చు."

రూపవతి నోటికి మాత్రం తాళం యెక్కడుంది. "నిజమేకానండీ మీ రోక గాడిదని జడ్జిగా వేశారుగదా. మీరే కొట్టేస్తారేమోనని అను మానంగా వుంది నాకు" అంది.

ఒక్క నిమిషంపాటు శ్రీమతి సరిగమ నోరు తెరచింది తెరచి నట్టే వుండిపోయింది. తరవాత సంబాళించుకుని, నోరు మూసుకుని, భర్తవంక చురచురా చూచింది. ఆ మానవుడు ఛీలిల్లి గజగజలాడి పోయాడు. తరువాత నన్ను చూచి "రేపు తప్పక వస్తావుకదూ, బంగారం!" అంది.

"తప్పకుండా వస్తా మాడమ్" అన్నా నేను.

విందు ముగిశేప్పటికి రాత్రి పదకొండయ్యింది. అతిథులంతా కరచాలనాలు చేశి, సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. కుమారి రూపవతి తలనొప్పి వంకపెట్టి, పడకగదిలో కెళ్ళిపోయింది నిద్రపోయేందుకు. నేనూ, సేఠ్ మన సుఖలాల్జీ మాత్రం మిగిలాం "డ్రాయింగ్ రూమ్"లో. ఇవ్వాళ్ల విందు నిజంగానే చాలా మంచివిందు. ఈ విందులో కొచ్చిన అతిథులంతా నేనంటే చూపిన ఆదరణా, ఆప్యాయతా, ముద్దుపెట్టుకున్న తీరూ, వాటేసుకుని కౌగలించుకున్నపద్ధతీ ...

మరచిపోదామన్నా మరపుకురావు. ఆ స్నేహమూ, ఆ మర్యాదా... యిదంతా సేఠ్ మన సుఖలాల్జీ, చేతి చలువ!

ప్రక్కనేవున్న సేఠ్‌జీవంక కృతజ్ఞతతో చూస్తూ, "ఎంత పెద్ద మనిషి! ఒక మామూలు గాడిదకోసం పాపం, యీయనెంత శ్రమ పడ్డాడు! ప్రపంచంలో యింకా మంచితనం మాయం కాలేదనేందుకు యీయన సాక్ష్యాన్నిదర్శనం" అని అనుకున్నా నాలో నేను.

క్రమేపీ నా మనసావాతావరణాని కలవాటు పడిపోయింది. అంటే ఆ సుందర వాతావరణం అంటే నాకపేక్ష యేర్పడింది. ఆనందంగా కాళ్ళు ఝూడించి, తోక పైకెత్తి నాట్యంచేయా లనిపించింది. మనసంత తేలికైంది. గాలిలో తేలిపోవడం ప్రారంభించింది.

"కాస్సేపలా మీ యింటిముందు తోటలోకి వెళ్ళి పచ్చికమీద పొర్లాడా లనిపిస్తోంది" అని చెప్పా సేఠ్‌జీతో.

"అంతకంటేనా! మీ యిష్టం. ఇది మీ యిల్లేననుకోండి, పదండి" అన్నాడు ఆయన.

"ఈ సేఠెంత మంచివాడు!" అని మనస్సులో అనుకున్నా. ఇద్దరంకలిసి వరండాలో కెళ్ళాం. అక్కణ్ణుంచి అటుతిరిగి, తోటలో కెళ్దామని, ఇంతలో దూరాన తోటలో, చెట్టునీడ, ఎవరో ఒకతను చింపిరి గుడ్డలేసుకుని, రెండు గాడిదల్ని పట్టుకుని నిలబడి వుండడం కనిపించింది.

## అష్టవక్ర గ్రామంనుంచి వచ్చిన 'శంభూ'

"ఇతనెవరు?" అనడిగా సేఠ్‌జీని.

"అరెరె, ఎంత పొరపాటైంది, నేను మరిచేపోయాను. మిమ్మల్ని కలుసుకోవాలనొచ్చాడు చాలా సేపైంది, నే నీ విందు హడావుడిలోపడి ఆ సంగతే మరిచిపోయాను. ఇతన్ది అష్టవక్ర గ్రామమట. పత్రికల్లో మీ ఫొటో చూచి మిమ్మల్ని గుర్తించాడట" అని యెద్దేవగా ఒక నవ్వు నవ్వి, "యీయనగారు మీ పాత యజమానట, మిమ్మల్ని తిరిగి తీసికెళ్దామని వచ్చాననంటున్నాడు" అన్నాడు సేఠ్. అని, "మీ పేరుగుడురా?" అనడిగాడు.

"అబ్బే, నే నెరగనే యెరగను" అన్నా నేను.

ఇంతలో "నన్నెరగనంటావేంటి!" అంటూవచ్చి, నా మోకాళ్లు పట్టుకొని, "అప్పుడే నన్ను మరచిపోయావా? అష్టవక్ర గ్రామంలో నా యిటుకలు మొయ్యలానువ్వు! సయ్యద్ కరామతల్లిగారి యిల్లు కట్టేప్పుడు గూడా మోశావు. గుర్తులేదూ? నేను శంభూని!" అంటూ లబోదిబోమన్నా డతను. అత నన్నది నిజమే. అందుకేనేమో నాకు మరీ మంటపుట్టుకొచ్చింది. "ఏమిటా వాగుడు? నేను కరామతల్లినీ యెరుగను గరామతల్లినీ ఎరుగను. నే నెప్పుడూ యిటుకలూ మొయ్యలేదు" అని వాణ్ణి డబాయించి, సేఠ్‌జీవైపుకు తిరిగి, "నక్కెక్కడ, నాగలోక మెక్కడ? ఆ యిటుకలుమోసే గాడి దెక్కడ, నే నెక్కడ!" అన్నా.

"నిజం, నిజం! మీరు చెప్పేది అక్షరాలా నిజమే. నే నప్పుడే అనుకున్నా, వీడేవింటి మీ యజమాని కావడమేవింటీ అని. ఏదో చెప్పుకొస్తున్నాడుగదా, మీకు చెప్పి చూద్దామనుకున్నా; అంతే!" అన్నాడు సేఠ్‌జీ.

పాపం, శంభూకళ్ళల్లో నీళ్ళుతిరిగినై. "అపుడే మరిచి పోయావానన్ను. నన్ను గుర్తుపట్టలేకపోతే మానె, యిదుగోచూడు, నీ తల్లిదండ్రులు, వీళ్ళ నాన్న గుర్తుపట్టలేవూ?" అంటూ ఆ ముసలి గాడిదల్ని రెంటినీ నా ముందుకు తోశాడు.

అవి రెండూ చెట్టునీడ నున్నంతవరకూ నేను గుర్తించలేదు. కాని, విద్యుత్కాంతిలోకి రాగానే గుర్తుపట్టాను. ఆ బక్కచిక్కిన శరీరాలూ, బయటబడ్డ బొమికెలూ, యెండిపుళ్ళు పడ్డపళ్ళూ, కూరుకుపోయి పుసులుకట్టిన కళ్ళూ, ఆ మకిలీమడ్డీ... అవి దగ్గరకొస్తేనే ముక్కోళ్ళు పగిలిపొయ్యేంత దుర్గంధం. దానికితోడు ఝుమ్మని ముసిరే యీగలు.

ఆ గాడిదలు రెండూ నోరుతెరి చేమంటాయోనని భయంవేసింది. అందుకని వాటికవకాశం యివ్వకుండానే బిగ్గరగా "యేవింటీ పొగరు? యింత ఛండాలంగావున్న గాడిదలు నా తలిదండ్రులా? విన్నవాళ్ళు నమ్మొద్దు? నే నసలు హార్డ్‌ఫర్డ్‌షైర్ గాడిదజాతి సంతానాన్ని. మా

సంబంధీకులిప్పటికి లార్డ్‌మౌట్ బాటెన్ దగ్గరున్నారు. అంత వున్నతవంశ సంజాతాన్ని, నన్నీ గాడిదలకి బిడ్డని కమ్మంటూరా సేఠ్‌జీ !" అనడిగా.

"లేదండీ, వీళ్ళేవిటి మీ తల్లిదండ్రులు కావడంయేవిటి. అసంభవం. ఏడుతరాల మధ్యవాళ్ళకీ మీకూ పొత్తున్నదన్నా నమ్మటం కష్టం అని నేను ఘొువకే అనుకున్నా" అన్నాడు సేఠ్‌జీ.

"విడ్డా!" అంటూ ముక్కో ళ్ళగ రేస్తూ దగ్గరకొచ్చింది నా తండ్రి గాడిద.

గాడిదలభాష సేఠ్‌జీ కేం తెలుసు. వెంటనే నౌకర్ని పిలిచి "యీ దొంగ వెధవనీ, యీ గాడిదల్నీ యిక్కణ్ణుంచి బయటకి నెట్టై శేయ్!" అంటూ గద్దించాను.

ముసలిశంభూ నా కాళ్ళమీద పడ్డాడు: "ఎన్ని ఆశలు పెట్టు కొచ్చానూ ఇక్కడికి. నీ తల్లిదండ్రుల్ని – చూచైనా కరగడం లేదా నీ మనసు. ఇంతప్పట్నుంచీ పెంచానే నిన్ను. నా మీదైనా కనికారం కలగడంలేదా? నిన్ను చూద్దామన్న ఆశకొద్దీ అప్పుచేసి రైలు టిక్కెట్లు కొనుక్కునొచ్చానే, యింటికెళ్దామంటే చేతిలో రాగి దమ్మిడీ లేదె! నీ కిది న్యాయమేనా?" అంటూ విలపించడం మొద లెట్టాడు.

"సేఠ్ జీ! వీళ్ళెదో పొరపడ్డారు. వాళ్ల తప్పులేదు. గాడదలన్నీ ఒక మాదిరిగానే వుంటైగదా. అందుకనే పొరపడుంటారు. సరే, కష్ట పడొచ్చారుగదా. టికెట్టు డబ్బులిచ్చి పంపించెయ్యండి" అన్నాను సేఠ్‌జీతో.

శంభూ చేతిలో ఒకొంప రూపాయల నోటు పెట్టాడు సేఠ్‌జీ; "జాగ్రత్త! యికెళ్ళు! మళ్ళీ యెప్పుడైనా, యెవరితోనైనా ఈ గాడి పని (నన్ను చూపుతూ) యెరుగుదుననిగాని, వీళ్ళ (నాతని తల్లి దండ్రుల్నిచూపుతూ) బిడ్డనిగాని చెప్పావో పళ్ళుహూనం చేయిస్తాను. మా గాడిద వున్నతవంశానిది. అసలి దేశపు గాడిద కానేకాదు. ఏడు తరాలనుంచి వీళ్ళ వంశంలో సాంకర్యం అన్నమాటేలేదు. కావాలంటే వంశావళి తెప్పించి చూపిస్తా, ఖబడ్దార్. ఫో, యిక!" అంటూ హెచ్చరించి, గదమాయించాడు.

శంభూ చేతులు రెండూ జోడించి నమస్కరించి, ఆ ముసలి గాడిదల పలుపులు పుచ్చుకుని, బలవంతాన లాక్కుంటూ బయటి కెళ్లిపోయాడు.

"ఆ మూడు జీవాలు గేటుబయటి కెళ్ళింతర్వాతగాని నా ప్రాణాలు కుదుట పడలేదు. ఆ చూశారా... చూశారా..." అంటూ మూడుసార్లన్నానేగాని, ఇంకోమాట పెగల్లేదు నా నోటిలోంచి. అంత కోపంవచ్చినట్టు నటించా నేను.

సేఠ్‌జీ తలూపుతూ "తెలుసండీ, నా కంతా తెలుసు. ఈ జు త్తిలా వూరికే స్నేరిసిం దనుకుంటున్నారా! ఈ లోకమే యింత. కాస్త పైకొస్తే చాలు—యెక్కడ లేనివాళ్ళూ యేదోఒక సంబంధమో, చుట్టరికమో, స్నేహమో కలుపుకుని దగ్గర చేరాలని చూస్తారు. "తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదివేలు చేరు!" అని వూరికే అన్నాడా శతకకారుడు!" అన్నాడు.

"కాకపోతే?" అన్నా నేను యింకా కోపం అభినయిస్తూ; అభినయమే మరి. నిజానికి నా మనసు దుఃఖంలో యీదులాడింది. అంత దూరంనుంచి వచ్చిన తలిదండ్రుల్ని చీదరించుకుని పంపిం చేశానే అన్న దుఃఖం కాని, యేం చెయ్యను? ఆ చోటూ, ఆ సమయమూ, ఆ సంపర్కమూ అలాంటివి.

## సేఠ్‌జీ చేసిన కొత్త సూచన

"సరే, లోపలికెళ్దాం, పదండి!" అంటూ యెంతో స్నేహంగా వీపుమీద చెయ్యివేశాడు సేఠ్‌జీ.

నెమ్మదిగా 'డ్రాయింగ్ రూమ్' వైపుకు నడవడం ప్రారంభించాం. సేఠ్‌జీ యింకా నా వీపు నిమురుతూనే వున్నాడు; చూశారూ! మీకు చాలా చిన్నవయసులోనే అతి గొప్పఖ్యాతి లభించింది. మీ మంచీ, చెడ్డా చూచేందుకు తల్లిదండ్రులు కాకపోయినా, యింకెవరో పైకరుండడం మంచిది" అన్నాడు.

"మంచీ చెడ్డానా?"

నే నాలోచించడం మొదలెట్టా.

"మిమ్మల్ని ప్రేమించగల వ్యక్తి"

"ప్రేమా!" నా కన్నుల్లో కొక వింతకాంత వచ్చింది.

"మీ దైనందిన కార్యక్రమాన్ని మీరు హుషారుగా, నిర్విఘ్నంగా నెరవేర్చుకునేట్టు ఉత్తే జాన్నివ్వగలవ్యక్తి"

"ఉత్తేజనమా! ఎక్కడిదీ సిగ్ధభావన?"

"ఇంకా సూటిగాచెప్పాలంటే, మీ జీవన సాహచర్యానికి!"

"సహచారిణా?" అంత మంచి ఆడగాడి దెక్కడ దొరుకుతుంది!"

సేఠ్‌జీ నడచేవాడల్లా ఆగిపోయాడు, ప్రక్కనేవున్న సోఫాలో చతికిలబడ్డాడు. మళ్ళీ మాట్లాడ్డం మొదలెట్టాడు. "మీరిక మీ గతాన్ని మరచిపోవాలి. మీరు గాడిదలనీ, గాడిదజాతితో మీకు సంబంధంవుందనీ అనుకోవడమే మానేశెయ్యాలి. ఈ నాటినుంచి మీరొక కొత్తజీవితంలో ప్రవేశిస్తున్నారు. కొత్తసంఘంలో, కొత్త ప్రపంచంలో అడుగుపెడుతున్నారు. ఇక్కడి విలువలువేరు అని గుర్తించాలి. ఇకనుంచి రేపటి సంగతి ఆలోచించాలి. రేపేం జరగబోతుందో అది. నిన్నేం జరిగిందో మరచిపోవాలి. గతంనాస్తి! తెలిసిందా?"

"ఓ తెలిసింది. అంతా మరచిపోయాను. గతంనాస్తి!" అని కళ్ళు మూసుకున్నా నేను కాస్సేపు తర్వాతొక్కసారి కళ్ళుతెరచి, "మరచిపోయా సేఠ్‌జీ? గతంనంతా మరచిపోయా. ఇక చెప్పండి?" అన్నా.

"మీరు మా అమ్మాయిని పెళ్ళి చేసుకోండి."

"మీ అమ్మాయినా?" అని ఒక్కసారి అదిరిపడ్డా నేను. "కుమారి రూపవతినా?"

"మీకంత ఆశ్చర్యం దేనికీ? మా అమ్మాయి చక్కగా చదువు కున్నది. అప్ టు డేట్. మంచిది..."

నేను మధ్యలోనే అడ్డుతగిలి "నే నాలోచిస్తున్నది మీ అమ్మాయిని గురించి కాదు. నన్నుగురించే ఆలోచించుకుంటున్నా. నేను

చూడండి; నేనొక అతిసాధారణమైన గాడిదని. జంతువుని. మీరా మానవులు. మనిషికీ జంతువుకీదాంపత్యమా! నాకు బొకాశియో వ్రాసిన "క్రూరమృగమూ – అతిలోక సుందరీ" "గుర్తుకొస్తోంది" అన్నా.

"బొకాశియో ఎవరు ? పెద్ద షావుకారా ?"

"కాదు, కాదు, అతనొక గొప్ప కళామూర్తి."

"ఇప్పుడా కళ గొడవెందుకండీ మనం మాటాడుతూన్న సంగతి చెప్పండి నా మాటవిని ఒప్పుకోండి !" అంటూ నా చెవులతో ఆడుకోవడం మొదలెట్టాడు సేఠ్‌జీ.

"కాని, మరి, మీరు, పూర్తిగా ఆలోచించే ..."

"ఆలోచించక ! ఆలోచించిన తర్వాతే అడుగుతున్నా !

"చూడండి యిది ఒక స్త్రీకి జీవన్మరణ సమస్య. రూపవతి నడగకుండా ఈ నిర్ణయం చెయ్యడం మంచిదికాదు. ఆవిడ ఒప్పుకుంటుందో లేదో ?"

"ఎందుకొప్పుకోదు ? అమ్మాయితో మాట్లాడిం తర్వాతే. మీ ముందు కదిపాను ..."

"నిజం ! నిజంగా ! ! నే న్నమ్మను ! ! !"

"కావాలంటే మీరే స్వయంగా అడగండి"

"కాని ..."

నామాట పూర్తిగా వినకుండానే సేఠ్‌జీ గంట నొక్కారు. వెంటనే ఒక నౌకరు వచ్చాడు.

"వెళ్లి అమ్మాయి నొకసారి కిందకి రమ్మను" అన్నాడు సేఠ్‌జీ.

"రూపవతి నిద్రపోయుంటుందండీ" అన్నా నేను జ్ఞాపకంవచ్చి.

"లేదు" అంటూ మందహాసం చేశాడు. సేఠ్‌జీ. "నిద్రపోలేదు మన నిర్ణయం విందామని మేలుకునే కూర్చునుంది"

నా కింకా ఆశ్చర్యం వేసింది.

# పెళ్ళికూతురు చిలుక పలుకులు

ఇంతలో మెట్లమీద చప్పుడు.

రూపవతి మెట్లుదిగి వస్తోంది. నీలి రంగు 'గరారా" వేసుకునింది. ఆ నీలిరంగుమీద బంగారు వారలు ధగధగా మెరిసిపోతున్నై, పైన లేతగులాబిపైట పాదాలకి ఎర్రటి చిరుమఖమల్ చెప్పులు. అటు రూపవతి మెట్లుదిగి వస్తుంటే, యిటు నా మనసూ మెట్లుదిగడం మొదలెట్టింది. రూపవతి నా దగ్గరకొచ్చి నిలబడింది. నా గుండె రెప్పపాటుకాలం నిలచిపోయింది. సేఠ్‌జీ యెప్పుడు తప్పుకున్నాడో, మెల్లగా జారుకున్నాడు. ఇక గదిలో మేం యిద్దరమే మిగిలాం. నేనూ, రూపవతీ.

"ఏమిటండీ!" అంది రూపవతి పైట చేతివేలికి చుట్టుకుంటూ.

నేను గుటకలుమింగాను. చివరికెలాగో ధైర్యం చిక్కబట్టుకుని, "నిజమేనా? అన్నాను.

"ఏమిటి!?" అంటూ నా కన్నుల్లోకి కొంటెగా చూచింది రూపవతి.

"మీరు నన్ను పెళ్ళిచేసుకునేందుకు అంగీకరించడం..."

"నిజమే!"

ఆ ఒక్క మాటలో యెంత సొగసు! యెంత మాధుర్యం! లేచి ఒక్క గంతు వెయ్యాలనిపించింది. బావుండదేమో అని వూరుకున్నా.

"కాని, చూడండి; మీరు బాగా ఆలోచించుకున్నారా అని. తర్వాత పశ్చాత్తాపపడరుగదా! మీకు తెలుసుగదా, నె నొక గాడిద... ని"

"ఏ భర్తయినా గాడిదగా వుంటేనే మంచిది" ఆ జవాబులో యెంత గట్టిదనం ప్రతిధ్వనించిందని!

"కాని, లోకం యే మంటుంది? సేఠ్‌జీ గొప్పవారు. అంత గొప్పవారి అల్లుడు ఒక గాడిద అనంటే..."

"నాకు తెలిసినంతవరకు గొప్పవారి అల్లుళ్ళంతా చాలవరకు గాడిదలే. అందుకనే వాళ్ళంతటి ఉన్నత పదవుల కెక్కగలుగు

తున్నారు. గాడిదలు కావటం మూలానకాదు; గొప్పవా రల్లుళ్ళవడం మూలాన్న! గొప్పవా రల్లుళ్ళకి తెలివెందుకూ?

ఔను నిజమే! నవ్యసమాజ నియమాల్ని గుర్తించలేకపోయాను, గుడ్డివాణ్ని.

"కాని" అంటూ యింకో అడ్డంకి పెట్టా నేను. "ప్రపంచం మిమ్మల్నేమంటుందో ఆలోచించుకున్నారా? అంతే కోటిమంది నవ యువకులొచ్చి మీముందు వాలతారే, చూస్తూచూస్తూ యీ గాడి దని కట్టుకుంటే, లోకం..."

"లోకులు కాకులు" లోకంతో నాకేం సంబంధం? ఇది నా స్వవిషయం నా యిష్టం ఐతే— నేనీ పెళ్ళి లోకంముందు చేసుకో వడంలేదే! మనం గుప్త వివాహం చేసుకుందాం; రహస్యంగా"

"రహస్యంగానా?"

"ఔను మీ రిదివరకటిలాగా మీ గదిలోనే వుంటారు—నేను నా మేడమీధ గదిలో వుంటాను.

"నేను నా గదిలోనూ, మీరు మీ గదిలోనూనా?"

"ఔను. మీ గదిలో మీ కన్ని సౌకర్యాలూ ఏర్పాటుచేస్తాం. మెత్తని పరుపు. మంచి భోజనం, చక్కని నౌకరు, ఒక టెలిఫోన్ గూడా వుంటుంది కావాలనుకున్నప్పుడు నాతో మాట్లాడ్డానికి!"

"టెలిఫోన్‌లోనేనా మాట్లాడ్డం?"

"ఔను. అప్పుడప్పుడూ అవసరమైనప్పుడు నాన్నగారూ, మీరూ, నేనూ డ్రాయింగ్‌రూమ్‌లో కలుసుకుంటూ వుందాం. అంతే తప్ప నా గదిలోకి మీరు ఒంటరిగా రావడానికి వీల్లేదు."

"మరి షికార్లు? భార్య భర్తలు చక్కగా చేయీచేయీ కలుపు కుని షికారు కెళ్తూంటారుగదా?"

"మనమూ వెళ్దాం షికారుకి. చక్కగా మీ వీపు మీద దోక అందమైన జీనుకడతాను. చూచేవాళ్ళంతా మీరు నేను పెంచుకునే గాడి దనుకుంటారు...".

"సరే, మంచిదే" అన్నా నేను, నా వీపుమీద కట్టబోయె ఆఅందమైన జీనుని తలుచుకుని."

"అంతేకాదు, మరొక షరతుంది. మీ చెక్కుబుక్కు నా దగ్గరే వుంటుంది. ఆ పాతికకోట్ల ఖాతా నా పేరేవుండాలి."

"యే పాతిక కోట్లూ ?"

"నా దగ్గరీ దొంగవేషాలు వెయ్యడం మానెయ్యండి. మీరు ప్రధానిగారితో మాట్లాడొచ్చిందంతా నాకూ తెలుసు."

"అది కాదూ, మీరు పొరపడుతున్నారు. అసలు జరిగిందేమి టంటే ..."

"ఇకా కల్లబొల్లి కబుర్లాపండి. నా దగ్గరీ దొంగవేషాలు సాగవు. నా కంతాతెలుసు. ఆ చెక్కుబుక్కూ, ఆ ఖాతా రెండూ నా పేర వుండవలసిందే."

"కాని ..."

"కానీలేదు, యేగానీలేదు. ఇప్పటికే బాగా ప్రొద్దుపోయింది. మీ గదిలోకెళ్ళి నిద్రపొండి, గుడ్‌నైట్ !" అంటూ వంగి, నా చెవి నొకసారి తన పెదవులతో, తేలికగా తాకింది రూపవతి. ముద్దు నా చెవికి పెట్టడంవల్ల, ఆ ముద్దు పెట్టేప్పుడు రూపవతి ముఖభంగి మెలావుందో చూడలేకపోయాన్నేను.

నా కళ్ళల్లో నీళ్లు తిరిగినై. నా కంఠం గద్గదమైంది నా నాలుగు కాళ్లూ ఆనందాతిరేకంతో వణికిపోయినై. ఆ వూహా ప్రపంచంలో తేలిపోతూ, "రూపా ! నా రూపా !" అని కలవరించా.

"నా చక్కని గాడిదా ! నా బంగారు గాడిదా !" అన్నది రూపవతి.

నేనా భావ ప్రపంచంలో పడి పరవశమై ఓండ్రపెట్టే దాన్నే. కాని యింతలో నా మెడకేదో తగులుతున్నట్లనుమానం వేశింది. వెండి త్రాటిపలుపు ఒక ముసలినౌకరెంతో మర్యాదగా ఆ పలుపు పుచ్చుకొని నన్ను నా గదివైపుకు లాక్కుపోవాలని చూస్తు న్నాడు. నేను ఆశ్చర్యపడ్డంచూచి "ఫర్వాలేదు,- రండయ్యా !" అని ప్రోత్సహించాడు.

రూపవతి సగం మెట్లెక్కి నిలబడుంది. నన్నుచూచి చిరునవ్వు నవ్వి "వెళ్లండి. వెళ్ళి నిద్రపోండి మళ్ళీ రేపు సౌందర్య ప్రదర్శన పోటీలు చూచేందుకు వెల్లింగ్టన్ క్లబ్బుకెళ్ళాలి" అంది.

చేతివేళ్లు తన పెదవుల కానించి, అంతదూరంనుంచి వాయు చుంబనం విసరి "బంగారం!" అన్నది అతిమెల్లగా.

ఆమె గబగబా మెట్లెక్కి మాయమైపోయింది.

నౌకరు ఆ వెండిపలుపు పట్టుకుని క్రింది గదిలోకి లాక్కు పోయాడు.

## అసలు రహస్యం

నా డా వాయుచుంబనం విసరింతర్వాత రూపవతి గబగబా తన గదిలోకి వెళ్ళిపోయిందట. ఆ గదిలో తండ్రి కూర్చున్నాడట. ఆయన్ని చూచి, "మీరు చెయ్యమన్న పని చేసేశాను. పెళ్ళికీ 'ఊఁ' అన్నాను" అని చెప్పి, వెళ్ళి పక్కమీద పండుకుని, యెక్కెక్కి యేడవడం మొద లెట్టిందట.

తండ్రి, కూతురుదగ్గరకెళ్ళి, తల నిమురుతూ, "అమ్మా యిందులో విచారపడాల్సిన పనిగానీ, గాభరా పడవలసిందిగానీ యేమీలేదు. మరి మన స్వార్థం నెరవేరాలంటే, ఒక్కొక్కప్పుడు గాడి దనికూడా పదినిమిషాలపాటు పతిగా స్వీకరించాల్సొస్తుంది. అందులో తప్పులేదు. ఎట్లా గోట్లా ఆ పాతికకోట్లూ నా చేతిలో పడనీ, తర్వాత అంతా నే సరిచేస్తాగదా. పాతిక కోట్లు! పాతిక కోట్లంటే మాటలా! ఇరవయ్యైదు లక్షల వందలు!! ఇదంతా నా కోసమటమ్మా? నీకేగదా ఆ డబ్బు. చేతికొస్తే ప్రపంచంలోవున్న వాళ్ళందరికంటే ధనికుడూ, అందగాడూ ఐన భర్తని కొనుక్కోవచ్చును" అని కూతురికి నచ్చ జెప్పాడట. "ఇవ్వాళంటే యీ గాడిద గుప్పెట్లో మనం వున్నాంగాని, రేపా చెక్కుబుక్కు, ఖాతా నీ పేరటమారగానే ఆ గాడిదే మన గుప్పిట్లో వుంటుంది అని అసలు రహస్యం బయటపెట్టాడట.

ఆ మాటలు విని, అంత కన్నీరూ కార్చిన రూపవతి తండ్రిని చూచి, ఆ తడికన్నులతోనే మందహాసం చేశిందట. ఆ మందహాసంలో తండ్రి తెలివితేటలంటే మెచ్చుకోలు ప్రతిబింబించిందట.

తండ్రి కూతురు భుజంతట్టి, "యేం ఫర్వాలేదమ్మా, యిక హాయిగా నిద్రపో, నేనున్నాగా అంతా సరిజెయ్యడానికి!" అని దిలాసా యిచ్చి, కూతురుని చూచాక చిరునవ్వునవ్వి, వెళ్ళి పోయాడట.

ఇదంతా నాకు తర్వాత తెలిసింది.

## వెల్లింగ్టన్ క్లబ్బులో సుందరీమణుల హడావుడి

ఆవేళ వెల్లింగ్టన్ క్లబ్బంతా హడావిడిగావుంది. క్లబ్బులో పెద్ద హాలునంతా కాగితాల పువ్వుల్తోనూ, కాయల్తోనూ, గుమ్మటాల్తోనూ, పట్టుతెరల్తోనూ, నవీన వధువు నలంకరించి నట్టులంకరించారు. హాలుకి నాలుగు వైపులా చిన్నచిన్న షాపులుపెట్టి, వాటిలో శృంగార సామగ్రి ప్రదర్శిస్తున్నారు. ఈ సౌందర్య ప్రదర్శనలకయ్యే ఖర్చంతా ఆ షాపుల యజమానులే భరిస్తున్నారట. ఆ షాపుల్లో నగలు, లిప్‌స్టిక్ (పెదవుల కేసుకునే రంగు), పౌడరులు, సువాసన నూనెలు, క్రీములు, బట్టలు, చీరెలు, టోపీలు, గొడుగులు, చెప్పులు... అన్నీ వున్నై. కాని ఎక్కడ చూచినా పుస్తకం అన్నమాట కన్పించలేదు. ఐనా పుస్తకాలు చదివితే సౌందర్యం యెమివృద్ధౌతుంది- గనుక!

శ్రీమతి సరిగమ నన్ను క్లబ్బు గౌరవసభ్యులందరికీ పరిచయం చేసింది. తర్వాత యిప్పుడు నేను పైన వర్ణించానే ఆ హాలులోకి తీసు కెళ్ళింది. సౌందర్య ప్రదర్శనల్లో పాల్గొనే మహిళలంతా అక్కడ బారులుతీరి నిలబడ్డారు. వాళ్ళందరినీ నాకు పరిచయం చేసింది శ్రీమతి సరిగమ.

"ఈవిడ సోలన్ సుందరినంబర్‌వన్!"

"అంటే సోలన్ హ్విస్కీ ... ..."

"కాదు, కాదు!" అంటూ నాతప్పు దిద్దింది శ్రీమతి సరిగమ. సోలన్‌లో జరిగిన సౌందర్య ప్రదర్శనల్లో యీవిడకు "రాణి' అని బిరు దిచ్చారు. ఆ పోటీల్లో యీవిడకి ప్రధమ బహుమానం వచ్చింది."

"యీావిడ సిమ్లారాణి
"యీావిడ నైనితాల్ రాణి"
"యీావిడ డల్‌హౌసీరాణి"
""యీావిడ కొడైకెనాల్ రాణి"
""యీావిడ ఊటీరాణి"
""యీావిడ డార్జిలింగ్ రాణి"

ఇలాగే, అందర్నీ, వరుసగా పరిచయం చేసింది, వీళ్లలో యే కర్మాగారపు రాణీలేదు. యే శ్యామల సస్యరాణీలేదు. కార్మికరాణి లేదు. నగర పారిశుద్ధ్య సంఘరాణి లేదు. చినిగిన గుడ్డల్లో దాగిన సౌందర్యాన్ని వీళ్ళెప్పుడూ చూచుండరు. ఆసౌందర్యమే చూస్తే సేర్ క్రీమ్‌జీభాయి తన సౌందర్య సామగ్రి అంతా చుట్ట జుట్టుకుని చంకన బెట్టుకుని పరుగెత్తేవాడే. ఆ సహజ సౌందర్యాని కీకృత్రిమ సామగ్రి అవసరంలేదు. ఆ మాణిక్యా లేమట్టిలో దాగివున్నయ్యో!

శ్రీమతి సరిగమ మళ్ళీ పరిచయం ప్రారంభించింది.

"యీావిడ లక్నో రాణి"
"యీావిడ జలంధర్ రాణి"
"యీావిడ ఢిల్లీ రాణి"

ఆ ఢిల్లీ రాణి యిదివరకునే చూచిన కమలాదేవే. నన్ను చూచి చిరునవ్వు విసిరింది కమల. నేను చెవులు రెండూ జోడించి ముందు కడుగేశా.

"యీావిడ కొత్తఢిల్లీ రాణి"

ఈ ఢిల్లీ రాణి మా రూపవతి. నా కాబోయ్యేభార్య నేను రూపవతినిచూచీ నవ్వలేదు. నేను యథాప్రకారంగా చెవులు జోడించి ముందు కడుగేశా.

ఈ రాణులందరి తోనూ పరిచయం పూర్తికాగానే, నన్నా సుందరీమణుల మధ్య నిలబెట్టి, ఫొటోలు తీశారు. ఎన్ని ఫోటోలు తీశారో నా లెక్క కందలేదు.

తరువాత, సౌందర్య ప్రదర్శనల్లో పాల్గొనే స్త్రీలంతా తమ వుడుపులు తీసివేసి, స్నానవస్త్రాలలంకరించుకుని, వెలింగ్డన్ క బ్బులో

వున్న స్నానాల చెరువు కెళ్ళవలసిందని మైక్‌లో హెచ్చరించారు. మహిళలంతా దుస్తులు మార్చుకునే గది (గ్రీన్ రూమ్) లో కెళ్ళి పోయారు. శ్రీమతి సరిగమ నన్ను స్నానాల చెరువు దగ్గరకు తీసు కెళ్ళింది.

"ఇప్పుడు మీరు చూసినవారంతా ఆయా ప్రాంతాలకి చెందిన సుందరతమ వనితలు, అంటే, యివ్వాళ మీా రెన్నుకునే సుందరి, మన భారతదేశానికంతటికీ ఏకైకసుందరి ఔతుందన్నమాట. ఈ భారత సుందరిని లాసేంజెల్స్‌లో జరిగే అంతర్జాతీయ సౌందర్య ప్రదర్శ నోత్సవాలకి పంపుతాం" అని చెప్పింది శ్రీమతి సరిగమ.

"వెరీగుడ్ !" అన్నా నేను, తలవూపి. "కాని శ్రీమతి సరిగమ గారూ, మీా పేరు చాలా పొడుగ్గావుంది. సరిగమ, మగరిసనో మరిగ సనో అనేస్తానేమోనని భయంగావుంది. గమ అంటే సరిగ్గా పలకదు. అందుకని లేడిగామా అనాలనిపిస్తోంది. మీా కభ్యంతరం లేదు గదా" అనడిగాను.

"అభ్యంతరం యేమిా లేదు గార్ధభా" అన్నదావిడ. అని, చిలి పిగా, నా చెవులు రెండూ పట్టుకొని నలిపేశింది. సరిగ్గా అదే సమ యానికి స్నానాల దుస్తుల్లోకి మారిన రూపవతి బయటికొచ్చింది. మమ్మల్నిద్దర్నీ చూచి, కనుబొమలు చిట్లించి, పృష్ఠం ఊపుతూ స్నానాల చెరువువేపు వెళ్ళిపోయింది.

రూపవతివెనకే మహిళలంతా ఒక్కొక్కరూ బయటికొచ్చారు. వాళ్ళంతా బయటికిరాగానే ఫొటోగ్రాఫర్లు వాళ్ళని చుట్టుముట్టారు. ఆ ఫొటోగ్రాఫర్లలో చాలామంది పశ్చిమ దేశీయులు. మన సుందరీ మణుల చిరునవ్వుల్లో అధికభాగం ఆ విదేశీ ఫొటోగ్రాపర్ల మీాదికే మళ్ళినై.

## బరువులు తూచే భజనానీ

ఇంతలో గంట మోగింది. గంట మోగగానే సుందరీమణులంతా బారులుతీరి, చెరువువొడ్డునయున్న "బరువుతూచే" యంత్రాల దగ్గర

కెళ్ళి నిలబడి ఒక్కొక్కరూ ఆ యంత్రంమీాదెక్కి బరువు చూడడం ప్రారంభించారు. ఆ యంత్రాల ప్రక్కనొక బక్కపలచని మనిషి నిల బడున్నాడు చేతిలో కాగితం కలం పుచ్చుకుని.

శ్రీమతి గామా మమ్మల్నొకర్నొరికి పరిచయంచేసింది. "ఈయన మిస్టర్ గార్ధబ్; యీాయన మిస్టర్ భజనానీ."

ప్రతి సుందరీమణీ ఆ యంత్రంమీాదెక్కి దిగగానే, ఆ యంత్రం లోంచొచ్చే టిక్కెట్ తీసి, బరువుచూచి, తన చేతిలోవున్న కాగితం మీాద ఆ సుందరి కెదురుగా ఆ సంఖ్యవేసుకుని ఒక్కసారి సుందరిని నఖశిఖపర్యంతం పరీక్షగా చూచి, "తర్వా తెవరండీ!" అంటున్నాడు మిస్టర్ భజనానీ.

"మిస్టర్ భజనానీ చాలా విచిత్రమైన వ్యక్తి. చూశారా, యింత వయసొచ్చినా వివాహం చేసుకోనేలేదు" అన్నది శ్రీమతి గామా.

'ఐతే వీరికి మహిళలభారం యేం తెలుస్తుంది?"

"అది కాదు" అంటూ నవ్వింది శ్రీమతి గామా. "ఈ యంత్రం చూశారూ, దిన్ని కనిపెట్టింది మిస్టర్ భజనానీయే. ఇది అన్ని యంత్రా ల్లాంటిది కాదు. ఆ యంత్రంలోంచి వచ్చే టికెట్ మీాద మనిషి మొత్తం బరువూ, విభిన్నభాగాల బరువులూ కూడా వుంటుంది. ఈ కార్డు చూడండి" అంటూ ఒక కార్డుతీసి చూపింది. "చూశారా, యిందులో పాదం దగ్గర్నుంచీ తొడలవరకూ, తొడలనుంచి మెడ వరకూ, మెడమీాది తలబరువూ, మూడూ వేరు వేరుగా వున్నై."

"ఐతే ఆ తలలోవున్న మెదడు బరువు చూపుతుందా యీా యంత్రం?"

"ఆ బరువు చూపదు. ఐనా మెదడుతో మనకేం సంబంధం?"

"ఔనౌను. కనిపిస్తూనే వుందిగా. మెద డెందుకూ మనకి!"

"మిస్టర్ భజనానీ గొప్ప తెలుసుకోవాలంటే యీా యంత్రం వొక్కటే చూస్తే కాదు. యింకావుంది. రెండూ రెండూ కలిస్తే ఐదౌతుందని నిరూపించగలరు!"

"నాలుగు కాదన్నమాట!"

"కాదు!" అన్నాడు మిస్టర్ భజనానీ. "రెండూ రెండూ ఐదు. కావాలంటే యిందుకు గణితశాస్త్రంలో పది ప్రమాణాలు చూపించ గలను. మీ రవకాశం చూచుకు నొకసారి మా యింటికొస్తే, నిరూపించి చూపుతాను" అన్నాడాయన నన్ను చూచి సగర్వంగా నవ్వుతూ.

ఇంతలో కమలాదేవి వచ్చింది. ఆవిణ్ణిచూచి, మిస్టర్ భజనానీ తన డ్యూటీ మరచిపోయాడు. రెప్ప వెయ్యకుండా చూస్తూ నిలబడి పోయాడావిణ్ణి. చివరి కావిడే చిరునవ్వునవ్వి, "నా బరువుచూడండి!" అనవలశొచ్చింది.

## చీలమండలుచూచే శ్రీ దారూవాలా

శ్రీమతి గామా, నేనూ ముందుకు నడిచాం.

శ్రీమతి గామా ఆగింది; నేనూ ఆగాను అక్కడొక కుర్చీ వుంది. ఆ కుర్చీల ముందు మన చెప్పులషాపుల్లో కుర్చీల ముందుంటాయే, యెత్తయిన పీటలు, అలాంటివి వున్నై. బరువుచూచుకున్న స్త్రీలు యిక్కడికొస్తున్నారు. వచ్చిన సాండల్స్ తీసి, ఆ పీటలమీద కాళ్ళుపెట్టి కూర్చుంటున్నారు.

"వీళ్ళందరికీ యిక్కడ కొత్తచెప్పులిస్తారా?" అనడిగా నేను శ్రీమతి గామాని.

"కాదు! కాదు!" అంటూ నవ్విం దావిడ. ఆ కుర్చీదగ్గరే వున్న ఒక బట్టతల ఆసామీని చూపి, "వీరు మిస్టర్ దారూవాలా!" అంటూ పరిచయంచేసింది. ఆ బట్టతలా, గద్దముక్కూ, పొట్టిరూపూ చూచి, "వీరిక్కడ బాటా యేజన్సీ తీసుకున్నారా?" అనడిగా నేను.

"కాదు గార్ధభా!" అంటూ బుజ్జగిస్తూన్నట్టు నా భుజంమీద చేయివేసింది శ్రీమతి గామా. "మిస్టర్ దారూవాలా వీళ్ళందరి పాదాల కొలతలు తీసుకుంటారు. చీలమండ లెంత గుండ్రంగా వున్నాయో చూస్తారు."

"ఓహో!"

"ఇందులో వీరు గొప్ప నిపుణులు."

"మీది బోంబేకాదూ దారూవాలా? మీరక్కడేం జేస్తారు?" అనడిగా.

"అక్కడ కాలిగజ్జెలు తయారుచేసే కంపెనీ వుందినాకు. అందు చేత చీలమండల్ని గురించి నాకు తెలిసినంత యీ భూమండలంలో యింకెవ్వరికీ తెలిశుండదు."

"నిస్సందేహంగా!" అన్నా నేను.

"చూశారా! యీ కళాకారులంతా మీకు సాయంచేస్తారు. అందుకే వీళ్ళందర్నీ పిలిపించాం" అన్నది శ్రీమతి గామా.

"ధన్యవాదాలు!" అన్నా నేను తలపంచి.

అక్కణ్ణుంచి, యింకో పదడుగులు ముందుకువేశాం:

మిస్టర్ దారూవాలా దగ్గర్నుంచొచ్చిన మహిళలిక్కడ నిలబడి తాండవ నృత్యభంగిమలిస్తున్నారు. అక్కడున్నాయన, ఒక "టేప్" తీసుకుని వాళ్ళజఘనాలూ, మోకాళ్లూ కొలుస్తున్నాడు.

"ఈయనెవరు? దర్జీయా?" అనడిగా.

"హుష్! నెమ్మదిగా మాట్లాడండి!"అంటూ నా నోరుమూసింది" శ్రీమతి గామా. "వీరి నెరగరూ మీరు? గొప్ప శిల్పశాస్త్రజ్ఞులు; మిస్టర్ ఖట్ ఖట్ ఖండలియా అని. అజంతా, ఎల్లోరా గుహల్లోవున్న నగ్న స్త్రీ చిత్రాల చుట్టుకొలతలన్నీ వీరికంఠతావచ్చు."

"వీరికి వివాహ మయ్యిందా?"

"వివాహమైంది. కాని భార్యపేరు చెప్పమంటే మరచిపోయా నంటారు."

"ఓ హెలో, మిస్టర్ ఖట్ ఖట్ ఖండలియా! మిమ్మల్ని కలుసుకో గలిగినందుకు బ్రహ్మానందంగా వుంది."

"ఔనౌను మిమ్మల్నిదివరకెక్కడో చూశాను" అన్నాడాయన, గుర్తుకు తెచ్చుకునేందుకు యామయాతన పడుతూ.

"బహుశా, అష్టవక్రగ్రామంలో చూచుంటారు" అన్నా నేను వూరికే మాటవరుసకి, మర్యాదగా.

"కాదు కాదు. అక్కడకాదు. అంటూ చూపుడువేలుతో కణ తలు కొట్టుకుంటూ "ఆఁ, యిప్పుడు జ్ఞాపకంవొచ్చింది. సాంచీ స్థూపం దగ్గర..." అన్నాడు.

"సాంచీలోనా? యెప్పుడూ నే నాఛాయలకైనా వెళ్ళలేదే!"

"మీారబద్ధం ఆడుతున్నారు. మిమ్మల్ని నేనక్కడ చూచాను. సాంచీ రాతిపలక, పదకొండు దగ్గర ఒక బౌద్ధ భిక్షువు బుద్ధభగవానుడి సందర్శనం కోసం వెళ్తున్నాడు. అతని వెనకే ఒక గాడిదుంది. ఆ గాడిద మీారే. సందేహంలేదు."

నేను నిర్ఘాంతపోయాను.

"ఏఁవీఁ అనుమానంలేదు. మీారే ఆ గాడిద. అవేకాళ్ళు. అవే మోకాళ్ళు అవే తొడలు." అన్నాడు మళ్లీ.

"చూచారా, వీరెంత గొప్పవారో" అంది శ్రీమతి సరిగమ. "మీారు మనుషుల్ని చూచి రాళ్ళనుకోరు. రాళ్ళనుచూచి అందులో మనుషుల్నీ, జంతువుల్నీ గుర్తిస్తారు!"

"కాదూమరి, చాలా గొప్పవారు" అని ముందు కడుగేయ బొయ్యా నేను.

మిస్టర్ ఖట్‌ఖట్ ఖండలియా నన్ను ఆపి, "ఇప్పుడా బౌద్ధ భిక్షు వెక్కడున్నాడు" అనడిగాడు.

"ఇంకెక్క డుంటాడు? ఆ సాంచీలోనే వున్నాడేవోఁ" అన్నా నేను కడుపుమండి.

ఖట్ ఖట్ ఖండలియా ముహంమీాద సందేహచ్ఛాయలు పొటమ రించినై. 'యిదేవిఁటి! ఆ సాంచీ గార్దభం యిక్కడికి రావడం యేవిఁటి! ఆ భిక్షువక్కడే శిలాప్రతిమగానే వుండిపోవడఁ వేఁవిఁటి?,' అని అనుమానం కలిగిందో యేమో ఖర్మ. ఇంతలో ఒక సుందరీమణి వొచ్చి ఆయనముందు నిలబడింది. వెంటనే మెడకి తగిలించుకున్న 'టేపు' తీసి, మళ్ళీ తన కార్యక్రమం ప్రారంభించాడు ఖట్ ఖట్ ఖండలియా.

అక్కణ్ణుంచి నాలుగడుగులు ముందుకేశామోలేదో ప్రొఫెసర్ బనారసీ 'ఆహా'గారూ, జనాబ్ హమీద్ హసన్ లఖనవీ 'ఓహో' గారూ యెదురయ్యారు.

ప్రొఫెసర్ బనారసీ 'ఆహా'గారు కాశీ హిందీ సంస్కృత భాషా పండితులు. జనాబ్ హసన్‌లఖనవీ 'ఓహో'గారు లక్నో ఉర్దూ ఫారశీ కవిశేఖరులు. కాశీ హిందీ సంస్కృత గ్రంథాల్లో 'జఘన' సౌందర్యాన్ని గురించివున్న ఉపమానాలన్నీ 'ఆహా'గారికి కంఠస్థమైతే, లక్నో ఉర్దూ ఫారసీ కవితలో 'కౌను'ని గురించి వున్న కవితలన్నీ 'ఓహో' గారికి కంఠస్థం. 'ఆహా'గారు జఘనపదజాల స్పెషలిస్టులు; 'ఓహో' గారు 'కౌను'కవి పాదుషాలు ఇద్దరూ ఆయా శరీరబాగాలకు మార్కు లేస్తారు.

"ఓహోజీ !" అన్నా నేను.

"హాం జీ !" అన్నారు 'ఓహో'గారు.

"ఓహో జీ! లఖనవూ మలికా యెహుస్నె, (సౌందర్యరాణి)కి కౌనులేదని విన్నాను. మీ రేం చేస్తారు మరి.

"నాకు తెలుసండీ అందుకే యీ సూక్ష్మదర్శని తీసుకొచ్చాను" అని జేబులోంచి సూక్ష్మదర్శిని తీసి చూపించాడాయన. ఆ సూక్ష్మ బుద్ధినిచూచి నేను సంతోషించకుండా వుండలేక పోయాను.

అలాగే, నెమ్మదిగా చెరువుచుట్టూ తిరిగాం నేనూ. శ్రీమతి గామానూ.

ప్రతి పదడుగులకి ఒక్కో కళాకారుడు శిరోజాల్ని చూచి మార్కులేసేవారొకరు, కపోలాలుచూచి మార్కు లేసేవారింకొకరు. నఖాలు చూచేవారొకరు; శిఖలు చూచేవారింకొకరు. కనులు చూచే వారొకరు; చెవులుచూచేవారొకరు, చేతులుచూచేవారొకరు ... యిలాగే మరింకెందరో వున్నారు. ప్రతి సుందరి చేతిలోనూ ఒక పత్రం వుంటుంది. ఆ పత్రంలో ఆవిడ పేరూ, ఒక్కొక్క శరీరభాగాని కొక్కొక్క 'కాలమ్' వుంటాయి. ఆయా నిపుణులాయా భాగాలు పరీక్షించి ఆయా 'కాలాల్లో' మార్కు లేస్తారు. తమ తమ అభిప్రాయాలు వ్రాస్తారు.

అదంతాచూస్తూంటే నాలో అవ్యక్తభావ మేదో కదిలింది. నే నున్నది కబ్బేలులోనా? ఒక నిర్జీవమైన కార్ఖానాలోనా? స్నానాల చెరువు వొడ్డునా? స్త్రీ యంత్రాగారంలోనా? సైకిళ్ళూ, కార్లూ తయారుచేసినట్టే ఈ స్త్రీలనిగూడా తయారుచేస్తోందా యీ లోకం! చేతులూ, చెవులూ, కాళ్ళూ, కళ్ళూ, పాదాలూ, పిరుదులూ, ముక్కూ, నోరూ యేభాగాని కా భాగం తయారుచేసి స్త్రీ రూపాని కతికిస్తున్నారా వీళ్ళు? సుందరీమణి! మలికామొహుస్న! ...్యాక్ స్యూపర్ డీలక్స్!!

రెండుమూడు ఘంట లీ కొలతలతోనే సరిపోయింది. ఆ కొలత లన్నీ నమోదుచేసిన పత్రాలూ, ఫొటోలూ నాచేతి కిచ్చారు. నాకు ముప్పావుగంట టైముయిచ్చారు. ఈ టైములో నేను నా నిర్ణయం తెలియజేయాలి. భారత సుందరీమణి పేరు ప్రకటించాలి.

ఆ పత్రాలన్నీ అతి జాగ్రత్తగా చదివా నేను. ఆ ఫొటోలన్నీ యింకెంతో పరీక్షగా చూచాం. కూడిన మార్కులు మళ్ళీకూడా. ఈ పనంతా చేసేందుకొక అరగంట పట్టలేదు. శ్రీమతి సరిగమ ఆశ్చర్య పోయింది.

"ఇంత తొందరగా నిర్ణయం చేశారా!" అంది. "ఓ!"

"అయితే హాల్లోకి పదండి గొప్ప గొప్పవాళ్ళంతా మీనిర్ణయం వినడామని యెంతో కుతూహలంగా కాచుకూర్చున్నారు."

## సౌందర్య ప్రదర్శన - పోటీల ఫలితం

సౌందర్యప్రదర్శనల పోటీల ఫలితాలు ఫలానా టైముకి ప్రకటింపబడతాయని ముందుగానే అందరికీ తెలియజేశారు. అంచేత మళ్ళీ మేం హాల్లోకి ప్రవేశించేప్పటికి హాలంతా కిటకిటలాడిపోతోంది. ముందు వరుసల్లో మంత్రులూ, ధనవంతులూ, విదేశ రాయబారులూ, ఫొటోగ్రాఫర్లూ, భారతీయ పత్రికావిలేకరులూ అంతా వచ్చి కూర్చు న్నారు. హాలు యిప్పుడు యిందాకటికంటే యెక్కువగా మెరసిపో

తోంది. కళ్ళు జిగేలుమన్నై. కలవారి అందమైన ఆడవాళ్ళలో ఒక్కరుగూడా బీరుపోకుండా అందరూవచ్చారనే నా వూహ. అందులో యింతకుపూర్వం, అంటే క్రింద ఏడూ, ఆ క్రింద ఏడూ 'సౌందర్య రాణి'గా ఎన్నికైనవాళ్ళూ వున్నారు. కాకపోతే పాపం, యిప్పుడు వాళ్ళు పాత 'మోడల్స్' అయిపోయారు. పాత మోడలు కారుమీద మోజెవరి కుంటుంది గనక?

హాలులో ఒక పెద్దవేదిక యేర్పాటు చేశారు. వేదికమధ్య ఒక టేబుల్ వేశారు. టేబుల్‌దగ్గర రెండుకుర్చీలువేశి, రెండుమైక్రో ఫోన్లు పెట్టారు. అందరికంటే ముందు శ్రీమతి గామా వేదిక నెక్కి హాజరైన సభ్యులకూ, ప్రేక్షకులకూ ధన్యవాదాలర్పించింది. తరువాత ఆ సౌందర్య ప్రదర్శనల మహోత్యాన్ని విశదీకరించింది. సౌందర్యాన్ని అంచనా వేసేందుకు సహకరించిన వివిధ నిపుణులకు కృతజ్ఞతాభి వందనాలర్పించింది. ఆ తరువాత నన్ను వేదిక మీదికి ఆహ్వానించి, నన్నందరికీ యెరుకపరుస్తూ యీ మహా కార్యక్రమ నిర్వహణకు నన్నెన్నుకొనడంలో వున్న ఔచిత్యాన్ని గురించి మాట్లాడింది. రోమను సుందరీమణులు గాడిద పాలతో స్నానంచేస్తారన్న విషయాన్ని ఈసంద ర్భంలోప్రసక్తించింది. ఆ సంగతి విని సభఅంతా చకితులైపోయారు. హాలంతా కరతాళధ్వనులతో ప్రతిధ్వనించింది. ఆ చప్పట్ల గల్లంతులో నేను నిర్దిష్టాసనాన్నధిష్టించాను. ఇంతలో ఒకమూల బాండువాయిద్యం ఘొల్లుమంది. సౌందర్య ప్రదర్శనాల్లో పాల్గొన్న సుందరీమణు లంతా అర్ధ నగ్నరూపాలతో వేదికమీదికి బారులుతీరి వచ్చారు. ఆ సౌందర్య ప్రదర్శనను చూచి ప్రేక్షకులు స్తబ్ధులయ్యారు. కుర్చీలో కూర్చున్న స్త్రీలు వేదికమీద నడిచే ఒక్కో స్త్రీని చూచి, లోలోపల తమతో పోల్చుకుని చివరికి తమకే యెక్కువ మార్కు లేసుకున్నారు. వేదికమీద నడచే ప్రతి స్త్రీ తమ ముందుకొచ్చి, ఐదు నిమిషాలు నిలబడి, చక్రం తిరిగివెళ్తే బావుండునే అనుకున్నారు పురుషుల్లో యెవరికివారు. కాని, యింతలో ఆ సుందరీమణుల 'పెరేడ్' పూర్తయ్యింది. వారంతావచ్చి నాకుర్చీ వెనుకవున్న ముక్కాలి పీటలమీద వరుసగా ఆసీనులయ్యారు.

# చూపుల తూపులు

శ్రీమతి గామా లేచి, ఒక్కో సుందరినీ మళ్ళీ మైక్ దగ్గరకి పిలిచి, ఆవిడ పేరూ వూరూ చెప్పి, ఆవిడతో ఒకటి రెండు ధన్యవాద వాక్యాలు పలికించి మళ్ళీ ముక్కాలిపీట మీదికి పంపింది. దీనితో అంతకుపూర్వం సరిగా చూడలేదే అని దుగ్ధపడిన ప్రేక్షకుల దాహం కొంత తీరింది. ప్రేక్షకులనే కాదు; నాకూ అందులో కొంతపాలుంది. మైక్ దగ్గరకొచ్చిన ప్రతిసుందరీ ప్రేక్షకులవైపుకొక చిరునవ్వువిసరేది; కాని, తరువాత నావైపుకు తిరిగి విసరిన చిరునవ్వులో ఒక ప్రత్యేక మాధుర్యం తొంగిచూచేది. చిరునవ్వు మొగ్గను తుంచి నా మీదకు విసరేశినట్లనిపించేది. ఆ కాస్తసేపూ. ఆ చిరునవ్వుల్లో యెన్నెన్ని వేడుకోళ్ళు దాగివుండేవని! ఆ కనులు, ఆ చూపులు, ఆ అధరాలు 'మీరు నన్ను రాణిగా ఎన్నికచేస్తే, మీరు గాడిదలని తటపటా యించకుండా కావాలంటే ఏమ్మల్నే వివాహం చేసుకునేందుకు వెనకాడం సుమా!' అని గుర్తు చేస్తున్నట్లుండేది ఆ పెదవుల కదలిక.

అందరి మందహాసాల్నీ మించిపోయింది రూపవతి చిరునవ్వు. ఆ చిరునవ్వులో ఒక విచిత్రమైన సంతోషమూ, సంతృప్తి, అధికారమూ సగర్వంగా వెల్లివిరచుకున్నై.

ఇక కమలసంగతి చెప్పటమే అనవసరం. చిరునవ్వుకుతోడు ప్రతి అంగంతోనూ నామీదికి దాడిచేసిం దనిపించింది. అందులోని మెరపుచూచి నా కళ్ళు చిరతలారినై. ఆ అంగవిన్యాసాన్ని చూచి భరించే శక్తిలేక, నేనే కనులు వాల్చుకోవలశొచ్చింది. నిజంగానే కమల చాల ప్రమాదకరమైన స్త్రీ! 'నన్ను తప్పించుకుని యెక్కడి కెళ్ళగలవ్ నువ్వు? యీ దేశంలోనే కాదు; యీ ప్రపంచం లోనే లేదు నాకంటె అందమైన ఆడది. నువ్వా నా పేరు చెప్పి నన్నెన్నుకోకతప్పదు! అన్నట్లున్నది ఆ అంగవిన్యాసం విదల్చిన ఠీవి. అంతేకాదు, ఆ చిరునవ్వులో యేదో వొక వింతైన ఆహ్వానం వుంది. నా గుండె దడదడలాడింది.

చివరకు శ్రీమతి గామా లేచి, "శ్రీమాన్ గార్ధభంగారు మాట్లాడుతారు" అని చెప్పగానే మళ్ళీ ఒకమారు హాలంతా చప్పట్లతో మార్మోగింది. నేను మెల్లగాలేచి, మైక్రొఫోన్ ప్రక్కకునెట్టి నా ఉపన్యాసం ప్రారంభించాను :

## కటువు మాటలు

"మహిళామణులారా ! సజ్జనులారా ! !

"ఇక్కడకొచ్చిన సుందరీమణుల్లో అనేకమంది పోటీల్లో పాల్గొనలేదు. కారణం యేమిటి? వారి సౌందర్యం జగత్ప్రసిద్ధమైనది. ఈ పోటీల్లో పాల్గొని ఆ సౌందర్యానికి ప్రమాణపత్రం పొందవలసిన అగత్యం వారికి లేదు. నేను యీ మైక్రొఫోన్‌ను వుపయోగించనిదీ అందుకే; నా వాగ్ధాటి మీకందరికీ చిరపరిచితమైనదే గనక !

( సభలో చప్పట్లూ; పకపకలూ )

"తర్వాతింకొకటి వుంది. గాడిదలు మైక్రొఫోన్లు ఉపయోగించగూడదని నిషేధించడం మంచిదని నా వుద్దేశం. ఎందుకంటే నాకంటే పెద్దగాడిద లీ మైక్రొ ఫోన్లు ఉపయోగించడం నే చూచాను.

(ఈసారి చప్పట్లూ, పకపకలూ యిందాకటంత జోరుగా లేవు).

"మహిళామణులారా ! సజ్జనులారా !!

"భారతదేశం నలుమూలల నుంచీ యింతమంది సుందరీమణులిక్కడికొచ్చి, యీ పోటీల్లో పాల్గొనడం చాలా ముదావహం.

కాని, యింకా అనేకమంది ముద్దరాళ్ళీపోటీల్లో పాల్గొననే లేదే అన్న విచారం మాకు లేకపోలేదు.

"నే నొక గాడిదని. అంచేత నా మాటలు కటువుగానే వుండవచ్చును. అందుకు మీరు అన్యథా భావించరనే నా నమ్మకం. అందుకనే నేను కుండపగలగొట్టినట్లు చెప్పదలచుకున్నాను. కాన్పూరులో ఒక కార్మిక స్త్రీ వుంది. ఆవిడ యిద్దరు బిడ్డల తల్లి. కాన్పూరు జౌళి మిల్లులో పనిచేస్తోంది. ఇద్దరు బిడ్డల తల్లయినా, ఆవిడ మీ ముందు కొచ్చి నిలబడితే, మీరా సౌందర్యాన్ని చూచి ముగ్ధులైపోతారు !

"కాని ఆ మానవతి యిక్కడకు రాలేదు. కారణం? ఆవిడ యిద్దరుబిడ్డల తల్లి, ఆవిడ కింత విశ్రాంతీలేదు, రైలుటిక్కెట్టుకు సరిపడ డబ్బులూలేవు. ఈ పోటీల్లో పాల్గొనేందుకు భర్తీ చేయవలసిన పత్రంకోసం పాతిక రూపాయలు వెచ్చించగల స్తోమతా లేదు.

"నే నొక చాకలి గాడిదని. ఆ చాకలి చనిపోయాడు. అతనికొక భార్యవుంది. ఇద్దరు ముద్దుబిడ్డలున్నారు. ఇప్పటికీ ఆ చాకలి భార్యని చూస్తే, 'ఎంత సౌందర్యరాశి!' అనిపిస్తుంది. మీలో చాల మంది ఆవిడకే 'సుందర భారతనారి' అన్న పదవీప్రదానం చేసేందుకు వుద్యుక్తులౌతారు. కాని ఆవిడా యీ ప్రదర్శనల్లో పాల్గొనలేదు. కారణం తెలుసా మీకు? ఈ సౌందర్యప్రదర్శనలో పాల్గొంటూన్న ఒక సుకుమారి వస్త్రాలని ప్పుడా చాకలి వుదుకుతోంది.

(క్రీగంటతో నేను రూపవతిని చూచా. రూపవతి కోపంతో పెదవులు కొరుక్కుంటూ కూర్చుంది.)

"అంతే, నేను మన ముందున్న సౌందర్యాన్ని పరిహసిస్తున్నానని భావించగూడదు మీరు. ఇదంతా యీ నగర వీధుల సౌందర్యం అంటున్నందుకు నన్ను మీరు క్షమించాలి. ఇదంతా గొప్పగొప్ప భవనాల్లో, సుఖవైభవాల్లో పెంపొందిన సౌందర్యం. ఈ సౌందర్యం ఉపవాసాలుచేసి యెరుగదు. దుఃఖాన్ని చూచి యెరుగదు. చింపిరిగుడ్డలు వేసుకోలేదు; వీధుల్లో నిద్రించి చూడలేదు. ఇది ప్రకృతిమధ్య పెరిగిన సౌందర్యంకాదు. కృత్రిమ వాతావరణంలో పెరిగిన సౌందర్యం యిది. అందమైన గాజుప్రమిదలో వెలిగే కొవ్వొత్తి యిది.

"ఇదేనా భారతీయ సౌందర్యం? మానవ ప్రేమనుంచీ, పరిశ్రమనుంచీ పెరిగి పెంపొందే శ్రామిక సౌందర్యం అంటూ లేదా మన దేశంలో? ఆ సౌందర్య మహాత్మ్యాన్ని తెలుసుకోకుండా, గ్రహించకుండా, మనం నడిపే యీ పోటీలకు పూర్ణత్వ మెలా వుంటుంది? సాఫల్యమెలా సాధ్యమౌతుంది?!

## లో కో భి న్న రు చిః

'అదీగాక, లోకోభిన్న రుచిః! కాలాన్ని బట్టీ, స్థలాన్నిబట్టీ యీ సౌందర్య ప్రమాణం మారుతూంటుంది.

'బెంగాలులో సుదీర్ఘ శిరోజాలైతే, హాలీవుడ్‌లో కత్తిరించినవి. ఫ్రాన్సుదేశంలో పలచటి ఊరువులయితే, భారతదేశంలో భారీవి. కాశ్మీర్‌లో యెర్రదనమైతే, తాంగనీకాలో నీలమేఘశ్యామల వర్ణం, కొందరికి చిన్ననోరు యిష్టమైతే, మరికొందరికి పెద్ద పెదవులు యిష్టం. కొందరికి మెడ పొడుగ్గావుంటే బావుంటుంది. మరికొందరు కురచ గానేవుంటే బావుంటుందంటారు. కొందరు ఆకర్ణాంత విశాలనేత్రాలు చూచి ఆనంద పరవశులౌతారు; మరికొందరు చిన్నికనులు చూచి ముచ్చటపడతారు. అయితే మరి సర్వజనాంగీకారమైన సౌందర్య ప్రమాణం ఏమైనట్టు? వీటన్నిటినీ మించిన మరో గొప్ప ప్రశ్న ఉండనే ఉంది. అసలు సౌందర్యం అంటే యేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం రానంతవరకు పోటీలు, ఫలితాలు నిర్ణయించడం సాధ్యంకాదు.

ప్రతి ప్రియుడూ తన ప్రేయసి సౌందర్యం ముందు స్వర్గాప్సరసల సౌందర్యమూ దిగదిడుపనే భావిస్తాడు. అలాంటి వ్యక్తి నొకతన్ని నేను యమునా నది అవతలివొడ్డునవున్న కృష్ణనగరంలో చూచాను. అతను మా పొరుగింటిలోనే వుండేవాడు. దాన్ని యిల్లనడంగూడ తప్పే. అదొక పాతగుడిసె. అతనిభార్య యేమంత పెద్ద అందగత్తెకాదు, చాలా మామూలు మనిషి. చామనచాయగూడా కాదు, నలుపు. మామూలు కనులే, మామూలు పెదవులే. మామూలు గడ్డమే, యేమీ విశేషంలేదు. ఒక్కటి తప్ప.

## సౌం ద ర్యం అం టే ఏ మి టి?

'అతను పగలల్లా పనిచేశి, అలసి సొలసి సాయంకాలం యింటికి రాగానే ఆవిడ అతనికెదురుగా వాకిట్లోకొచ్చేది. వచ్చి అతన్నిచూచి ఒక్కచిరునవ్వు నవ్వేది. ఆ నవ్వును చూచి అతను తాను పడ్డ కష్టమంతా ఒక్క తృటిలో మరచిపోయేవాడు. ఆ చిరునవ్వులో

వున్న ఆశ్వాసన అలాంటిది. అంత మందహాసామృతం యీ ప్రపంచంలో యింకెక్కడైనా వున్నదేమో, నేనుమాత్రం చూడలేదు. ఆ మందహాసాన్ని మీకు ప్రత్యక్షంగా జూపలేక పోతున్నానే అని విచారంగావుంది నాకు. ఆ చిరునవ్వును కొలవలేం, తూచలేము, గ్రాఫు వెయ్యలేం, జామెట్రీ పరికరాల్తో గీయనూలెం. ఎందుకంటే ఆచిరునవ్వుకు పెదవులూ లేవు, తెల్లని పల్లూ లేవు. ముహం లేదు. ఆవిడ సంపూర్ణ వ్యక్తిత్వం అంతా ఆ చిరునవ్వులో ప్రతిఫలిస్తుంది. ఆవిడ జీవితం, ఆత్మ, మనసు... ...అన్నీ అందులో ప్రతిబింబిస్తాయి అంతే కాదు, ఆవిడయెదుట ఆ భర్తలేకుంటే ఆ చిరునవ్వుకు ప్రాణం వుండదు. ఔనుమరి, రెండు నిండుహృదయాల స్వచ్ఛంద ప్రేమ అది. లాసేంజెల్స్‌లో దివ్యభవనాన్ని బహూకరించినా ఆవిడా చిరునవ్వుని మరో పరపురుషుడికి బహూకరించేందు కంగీకరించదనే నా విశ్వాసం. కాని, సూర్య చంద్రులు ఆటలాడుకునే తన పూరిగుడిసెలో నిలబడి తన భర్త కంకితం చెయగలదు.

"మరి మనం యిక సౌందర్యానెలా కొలిచేట్టు? విలువెలా కట్టేట్టు? ఎలా నిర్ణయించేట్టు?

"అసలిప్పుడు మనం యీ పోటీలు జరిపిన విధానమే తప్పనిపిస్తోంది నాకు. ఒక స్త్రీ సౌందర్యాన్ని నిర్ణయించాలంటే మన కావిడ పూర్తి జీవనవిధానం తెలియాలి. ఇంట్లో యెలా మెసలుతుందో, బిడ్డల నెలా పెంచుతుందో, పనిపాట లెలా చేసుకుంటుందో యివన్నీ తెలుసుకోవడం అవసరం. స్త్రీ సౌందర్యాన్ని శూన్యంలోవుంచి యెలా చూడగలం. స్త్రీ వాతావరణంనుంచే వేరుచేసి, ఒక స్నానాల చెరువు ప్రక్కనో, మడుగువొడ్డునో నిలబెట్టి టేపుతో కొలిచి, యంత్రంతో తూచి, యెలా నిర్ధారణచేయగలం? ఏమి నిర్ధారణచెయ్యగలం?

"సౌందర్యమంటే జీవితప్రవాహం. నిలప నీరుగాదు. నిత్యనూతనం, పరివర్తనం, పురోగమనం. జూలియెట్ సౌందర్యాన్ని రోమియో టేపుతో కొలిచాడా? లైలా సౌందర్యాన్ని మజ్నూ యంత్రంతో తూచాడా? సీతాదేవి సౌందర్యాన్ని ఒక నిర్జీవ పాషాణంతో పోల్చి చెప్పగలమా? మీరీ సౌందర్య ప్రదర్శనలో కనులు

పొడుగు వెడల్పులు చూడగలరు. కాని ఆ కనులలో వెలుగునూ, ఆ కనురెప్పలలో దాగుడు మూతలాడే సిగ్గునూ చూడలేరు. ఉన్నత వక్షాన్ని చూడగలరు; కాని మాతృమూర్తి మమతను గుర్తించలేరు.

"ఇలాంటి సౌందర్య ప్రదర్శన చూచి, ఫలితాన్ని నిర్ణయించమంటే నా వల్లెలాకౌతుంది! నేనేం నిర్ణయించగలను? ఏమని చెప్ప గలను? కాని ఒకటిమాత్రం తప్పక చెప్పగలను. నిజమైన సౌందర్యం యీ తొడలూ, మోకాళ్లూ, చీలమండలూ కొలిచే యంత్రాలుండే చోట వుండదు; వక్షస్థలౌన్నత్యాన్నీ, నడుంలోని మాంసాన్నీ తూచే చోట వుండదు; ఈ స్నానాల చెరువువొడ్డున వుండదు. ఈ సువాసన నూనెలూ, యీ పెదవుల రంగులూ, యీ సాలీడుగూటి చీరెలూ, యీ కృత్రిమ శిరోజాల కట్టులూ, యీ తెల్ల పొడరులూ, యీ ఎర్ర ఎర్రటి రంగులూ, యీ యెత్తుమడమల చెప్పులూ, యీ పట్టుకుచ్చుల జాకెట్టులూ, యీ పైపై మెరుగుల వ్యాపార ప్రకటనలూ వుండేచోట మాత్రం వుండదు.

"అంచేత మీరునడిపే ఈ సౌందర్య ప్రదర్శన లన్నీ వ్యర్థం. మీరు జరిపే ఈ పోటీలన్నీ దగా. మోసం. కనికట్టు.

"యీ పోటీలకు ఫలితం యింతే! నేను చెప్పదలచుకున్నదీ, చెప్పేదీ, చెప్పగలిగినదీ యింతే!!"

నా ఉపన్యాసం ముగిసింది. కొద్దిక్షణాల వరకూ హాలంతా నిశ్శబ్దం. ప్రేక్షకుల ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వినిపించేంతటి నిశ్శబ్దం. ఒక్కసారి 'ఓంఫ్రదు'మని ఆ నిశ్శబ్దాన్ని బ్రద్దలు చేద్దామన్నంత కోరిక కలిగింది నాకు.

## సభలో సుడిగాలి

తర్వాత నెమ్మదిగా హాలులో కలకలం ప్రారంభమైంది. నా వెనుక ముక్కాలిపీటల మీద కూర్చున్న సుందరీ మణులుకొందరు మూర్ఛపోయారు. మరికొందరు పిచ్చి పిచ్చి కేకలువేశారు. ఇంకో నిమిషంలో హాలంతా.

"వెధవ !"

"ఛండాలుడు !"

"మూర్ఖుడు !"

"గాడిద !"

"గెంటండి !"

"తన్నండి !"

"చెప్పుతో కొట్టండి !"

"ఛీ, ఛీ ! సున్నంలోకి యెముక లేకుండా చావగొట్టండి !" అంటూ కేకలు, పెడబొబ్బలు.

అంతకుపూర్వం "శ్రీమాన్ గార్ధభం జిందా-బాద్ !" అన్నవారంతా, యిప్పుడు "ఈ గాడిద ముర్దాబాద్ !!" అంటూ ఒకటే నినాదాలు, గొంతులు చించుకొంటూ.

మరీ వుద్రేకం పట్టలేనివాళ్ళు సరాసరి వేదికమీదికే వొచ్చేశారు. వచ్చి, నా పనిపట్టాలని వాళ్ళ వుద్దేశం. నే సది ముందే గ్రహించి వెనక్కితిరిగి వెనకకాళ్లు రెండూఎత్తి ఓపికకొద్దీ ఝాడించి మరీ తన్నా. దాంతో వాళ్ళు కాళ్ళకు బుద్ధిచెప్పారు. నా కాళ్ళబలం చూచింతర్వాత హాలులో గందరగోళం మరీయెక్కువైంది. మైక్రోఫోన్ కింద పడిపోయింది. శ్రీమతి గామా స్పృహతప్పి పడిపోయింది. ఆడవాళ్ళంతా గావుకేకలు వేయడం మొదలెట్టారు. నానాభీభత్సం ఐపోయింది. ఇక అదనుచూచుకుని, దారిబట్టడమే మంచి దనిపించింది. అడ్డం వచ్చినవాళ్ళని నా వెనుక కాళ్ళ కప్ప చెపుతూ ముందుకు దారి చేసుకుంటూ, యెట్లాగైలే నేం, క్లబ్బుబయటకొచ్చిపడ్డా. ఇది చూచిన కొందరు వీరులు నా వెంటబడ్డారు. ఏదేమైనా అది నా జీవన్మరణ సమస్య. అందుకని కళ్ళు మూసుకుని ముందుకురికా. ఏ రోడ్డున పడి పరుగెత్తానో యే మలుపులు తిరిగానో యేమో నా కేమీ తెలియదు; అంత ఒళ్ళుతెలియకుండా పరుగెత్తా. ఇంతలో నా తలకేదో బల్లతగిలినట్లయింది. ఆ బల్లమీదున్న పై పాత్రలన్నీ కిందబడి తునాతునకలై పోయినై. ఏమిటా అని అప్పుడు తెరచి చూచాయి కళ్లు. అప్పటికే ఆ చుట్టుప్రక్కల కుర్చీలమీద కూర్చున్నవాళ్ళంతా హడావిడిగా లేచి,

చేతులుబారలు చాపి, "ఇదేమిటి ఈ గాడిదిట్లా వొచ్చింది. తోలండి బయటికి" అంటూ కేకలేయడం ప్రారంభించారు.

అప్పటికిగాని నా కర్థం కాలేదు, నేను వెల్లింగ్టన్ క్లబ్బునుంచి ఇండియా గేటుగూడా దాటి చాలాదూరం వచ్చానని. ఇదింకో మహా భవనం. భవనం ముందున్న మైదానంలో పెద్ద విందు జరుగుతోంది. నేనొచ్చి ఆ విందునంతా తలకిందులు చేసేశాను!

అయ్యో! ఇది సాహిత్య ఎకాడెమీ భవనం!!

నే నేమీ తోచక దిక్కులుచూస్తూ నిలబడిపోయా, యిప్పుడేం జేద్దాం. యెక్కడికెళ్దాం అని ఆలోచిస్తూనా్నా. ఇంతలో ఒకాయన, వాలకంచూస్తే రచయితలాగానేవుంది, ఆ మెడమీదికి పడే జులు పాలూ అవీ – చేత్తో ఒక మట్టిగడ్డ పుచ్చుకుని నన్ను కొట్టడానికి రావడం కన్పించింది, ముహం పుస్తకంలావుంది, నుదురు మెరశిపో తోంది, గడ్డం తెల్లగావుందీ. నాదగ్గిరిదాకా పరుగెత్తికొచ్చి, కొట్టేం దుకా అన్నట్టూ మట్టిగడ్డవున్న చెయ్యలేపి, అలాగే నిలబడిపోయాడు యింతలో యేదో భయం ఆవేశించినట్టు.

"నేను అహింసావాదిని. లేకుంటే యీ పాటి కీగడ్డతో నిన్ను కొట్టేశేవాణ్నే ఎందుకొచ్చిన గొడవ. నువ్విక్కణ్ణుంచి వెళ్ళిపోవడం మంచిది!" అన్నాడు నన్ను చూస్తూ.

"నా వెనక చాలమంది కర్రలు పట్టుకు పరుగెత్తు కొస్తున్నారు నన్ను కొట్టడానికి. మీరు హింసావాదులైనా, అహింసావాదులైనా నేను మాత్రం వెనక్కెళ్ళను." అన్నానేను.

నేను మాట్లాడ్డం చూచేటప్పటికి, ఆయన చేతిలోవున్న మట్టి గడ్డ అలాగే జారి క్రిందపడిపోయింది. నిలువుగుడ్లు పడిపోయినై. ముహంలో నెత్తురుచుక్క లేదు. గడ్డం వూడిపడిపోతుందేమో నన్నంత యిదిగా వూగిసలాడిపోయింది. కాస్సేపలాగేచూచి, చివరి కెలాగైతేనే ఆ మహానుభావుడు నిలదొక్కు కున్నాడు.

"మీ రెవరు?" అనడిగాడు.

'గాడిదవేషం వేస్తేగాని

లోకం పోకడ తెలియదు "వేమా!" అంటూ నోటికొచ్చినట్టు పద్యం కట్టి చదివేశా నేను.

నా పద్యం వినగానే, గిరుక్కున తిరిగి, సోదర రచయితల దగ్గర కెళ్ళాడాయన. వెళ్ళి, "చూశారా? వింతల్లో కల్లా వింత!" అన్నాడు.

"యేమిటది!" అన్నారు వాళ్ళు.

"వేమన్నగారు గాడిదవేషం వేసు కొచ్చారు."

"ఛ, అబద్ధం!"

"అబద్ధం కాదు; నిజమేఁ! కళ్ళారాచూడండి! చెవులారా వినండి!" అంటూ నా వైపుకు సౌంజ్ఞ చేశాడు. ఇంతలో ఒక బంట్రోతు, సాహిత్య ఎకాడెమీ కార్యదర్శి, ఆ కార్యదర్శిగారి ఎసిస్టెంటూ అందరూ కర్రలు పుచ్చుకొచ్చారు. నన్నుకొట్టి బయటికి నెట్టడానికి, ఇందాకటి పెద్దమనిషి చేయెత్తి వాళ్ళందరినీ ఆపాడు, తర్వాత, నా కోసం ఒక మంచి కుర్చీ తెప్పించి వేశాడు.

నన్ను కుర్చీలో ఆసీనుణ్ణిచేసి, రచయితలంతా నా చుట్టూ మూగారు. వింత జంతువుని చూచినట్టు చూడ్డం మొదలెట్టారు.

"అయ్యో, తమరంతా ఇంత వింతగా చూస్తారెందుకు? ఇంతకు పూర్వం గాడిదనెప్పుడూ చూచెరగరా మీరు?" అన్నా నేను.

"అయ్యో, మాకంతా తెలుసు. కాని తమరిలా వున్నారేమిటి? ఎందుకని!" అనడిగా రందులో ఒకరు.

"ఈ మట్టిబొమ్మ కే వేషం వేస్తే మాత్రం పోయే దేముంది!" అన్నా నేను.

"ఔనౌను. అదీ నిజమే. కాని తమరున్న లోకంనుంచి యీ లోకానికిరావడం ఎవరికీ సాధ్యం కాదే!" అని సందేహం వెలిబుచ్చారు వారు.

"సాధ్యంకాని మాట నిజమే! కాని జనం వెంటబడితే చేయ. గలిగిందేవుంది?

"ఔనౌను. ఎందుకు వెంటబడరూ, మీ కవిత్వంలోవున్న మాధుర్యమే అది!"

"కవిత్వమా ?!" అంటూ కళ్ళు తేలవేశా నేను.

నేను వారికంతా చెప్పేశాన్లెండి. "వేమన్నగారు గాడిద వేషంలో..."అంటూ ముందుకొచ్చాడు, యిందాకటి మహానుభావుడు.

"వేమన్నా ? అన్నా !" అంటూ కళ్ళెర్రజేసి, "అయ్యా ! నే నొక మామూలు గాడిదని. కాకపోతే కాస్త చదువనేర్చుకున్నా నంతే ! వేమన్నగా రెక్కడ, నే నెక్కడ" అన్నా నేను కోపంగా.

"ఓహెూ ! అదా ! తెలిశింది. ఐతే వార్తాపత్రికల్లో పడింది మీ బొమ్మేగదూ ? మీరే నన్నమాట ఆ మాటాడే గాడిదలు !" అన్నాడు సాహిత్య ఎకాడెమీ కార్యదర్శిగారు.

"అయ్యా ! మాట్లాడే గాడిద లనేకమం దున్నారు. కొందరి ఫోటోలు పత్రికల్లోపడతై. అదట్లావుంచి, ఇప్పుడు నే నెక్కడున్నదీ కాస్త తెలియజేస్తారా దయచేసి !" అనడిగా నేను తలవంచుకుని.

## సాహిత్య ఎకాడెమీ పరిచయం

కార్యదర్శిగారు అన్నీ సవివరంగా శలవిచ్చారు.

"ఇది సాహిత్య ఎకాడెమీ కళాకేంద్రం. సంగీత, నాట్య ఎకాడమీల సంయుక్త సభా భవనం. ఇక్కడ భారతదేశంలో కల్లా ఉత్తములైన రచయితలూ, కవులూ, కళాకారులూ, నాటకకర్తలూ, సంగీతజ్ఞులూ; అంతా సమావేశమౌతూంటారు. ఇదిగో. వీరు గణేంద్ర నాథ్ నాగపాల్‌గారని, వీరు గొప్ప హిందీ నవలా రచయితలు. వీరింతవరకూ పెద్దపెద్ద నవలలు పదిపైగా వ్రాసారు. ఒక నవలలో వ్రాసిన విషయాన్ని మరో నవలలో ఖండించి వేయగల సామర్థ్యం వుంది వీరికి. ఆ విశేషప్రజ్ఞతోనే వీరు హిందీ సాహిత్యంలో విశేష స్థానాన్ని సంపాదించుకున్నారు. వీరు మా కార్యనిర్వాహకవర్గసభ్యులు.

"ఇదుగో, వీరున్నారే, కోటూ గడ్డం టోపి వున్నవారు, వీరిపేరు అబ్బూ అదీబ్; చాల గొప్పవారు. గత పదిహేను సంవత్సరాల్లో ఉర్దూ భాషలో ఒక్కమంచి పుస్తకంగూడా రాలేదని వీరి అభిప్రాయం. అంచేతనే వీరీ పదిహేను సంవత్సరాల్లో వచ్చిన యేపుస్తకాన్నీ చదవ

లేదు; ముట్టుకోనే లేపంటే మరింత సమంజసంగావుంటుందేమో. వీరు గూడా మా కార్యవర్గ సభ్యులే.

"వీరు సుందరసింగ్‌గారు. వీరు కవులూగాదు, రచయితలూ కాదు. కాని గొప్ప ధర్మోపదేశకులు. వీరూ మా కార్యవర్గంలోవారే. ఇదుగో, వీరు గొప్ప గుజరాతీ రచయితలు. వీరికి గుజరాతీ సాహిత్యం కంటే, తదితర భాషాచరిత్రలంటేనే మక్కువ యెక్కువ. వీరిపేరు అబ్దుల్ శికూర్. ప్రొఫెసర్, వీరూ రచయితలైతే కాదు గాని, ఉర్దూ సాహిత్యాన్ని గురించి పరిశోధన చేస్తున్నారు. గత పదిహేను సంవత్సరాలుగా, ఉర్దూభాష "లిఫ్"కి బదు "ఎ" తో ప్రారంభిస్తే యెలా వుంటుందీ అని ఆలోచిస్తున్నారు."

"ఎలా వుంటుందంటారు?" అనడిగా నేను.

"ఇప్పుడు ఆరుమాసాల్లో ఉర్దూ నేర్చుకునే వారికప్పుడు ఆరేళ్లు పడుతుంది" అన్నారు అబ్దుల్ శికూర్.

"మరింకా లాభం యేంవుంది."

"లాభంలేకేం? పిల్లలకి పునాది గట్టిపడుతుంది. భాష మరింత జటిలమౌతుంది."

భాష జటిలమైతే యేం లాభం?"

"గూఢభావం చెప్పేందుకు జటిలమైన భాషే వుండాలి. అందుకనే మేం ఒక నియమంగూడా పెట్టాం. తేలికభాషలోనూ, వాడుక భాషలోనూ, సులభశైలిలో వ్రాసేవారికి యీ ఎకాడమీలో స్థానం వుండగూడదని నిర్ణయించేశాం. ఈ విషయంలో మేం ఫ్రెంచి ఎకాడెమీని ఆదర్శంగా తీసుకున్నాం. మీకూ తెలుసుగా ఫ్రెంచి ఎకాడమీ రూసో, వాల్టెయిర్‌లని చేర్చుకోలేదు!"

"అయ్యో, యిది గర్వించదగ్గ విషయం మాత్రం కాదు; సిగ్గు పడవలసిన సంగతి!" అన్నా నేను.

దానిదేంవుంది లెండి. ఎవరి అభిప్రాయాలు వారివి" అన్నారు నాగపాల్‌గారు; ముందున్న రసగుల్లాల పళ్ళెంవంక యోగదృష్టితో చూస్తూ.

"మరి నాకు చిన్నప్పట్నుంచీ చదవడమన్నా, వ్రాయడమన్నా బాగా యిష్టం. నేనీ ఎకాడెమీలో చేరడానికి అర్హుణ్నౌనా, కాదా?" అనడిగా నేను.

"అదేనండీ, మంచిదికాదు!" అన్నారు కార్యదర్శి.

"యేమిటీ"

## చదవడం, వ్రాయడం చెడ్డ అలవాటు

"అదే. చదవడమూ, వ్రాయడమూ, అంటే అభిరుచి!" అని తేల్చివేసి, తర్వాత నా కర్థమయ్యేట్టు విశదీకరించారు కార్యదర్శిగారు. "నిజం చెప్పాలంటే, మా ఎకాడెమీ సభ్యత్వం దొరకడం అంటే చాలా కష్టం. ఎందుకనంటే, యాభయేళ్ళ కిపతలివాళ్ళు బాధ్యతగల వాళ్లు కారని మావుద్దేశం. కావాలంటే. మా సభ్యుల్నే చూడండి. అందరూ ఒకళ్ళకంటే వొకళ్ళు వృద్ధులు.

చదివే కోరికా, వ్రాసే కోరికా పూర్తిగా పరిహరించినవాళ్లు మా కార్యవర్గ సమావేశంలో పుస్తకాలని గురించి చర్చించం. వృద్ధ వయస్కుల్నెదుర్కొనే జబ్బుల్ని గురించి చర్చిస్తాం. అలాగే మీకూ ఏదైనా తీవ్రమైన జబ్బువున్నదీ అనంటే, మా సంఘంలో సభ్యత్వం ...

"లేదండీ, నాకే రోగమూ లేదు. ఇంకా చాలాయేళ్ళు గడిస్తేనేగాని నాకు యాభై నిండవు."

"ఐతే, అన్నేళ్ళూ గడిస్తేనేగాని మీకీ సభ్యత్వం సంప్రాప్తించదు." అంటూ నవ్వాడు కార్యదర్శి. "అదిగాక మా సభ్యులు చదవడం వ్రాయడం మానేసి, ఆలోచించడం ప్రారంభిస్తే మంచిదని మావుద్దేశం. ఆ విధంగా ఎక్కువమంది ఆలోచనాపరుల్ని దేశానికి సమర్పించ గలుగుతాం చూడండి. ఇప్పుడు మా కార్యవర్గంలోగూడా మీకెక్కువ మంది రచయితలు కన్పించరు; ఆలోచనాపరులే ఎక్కువమందున్నారు. పుస్తకాలు వ్రాయడం మానేసి యెంత యెక్కువ కాలమైతే అంత ప్రముఖ స్థానాల్ని ఆక్రమించారు ఆయా సభ్యులు. ఎందువల్ల? వారు రచనల సంగతి మరచిపోయి ఆలోచనల కాధిక్యం యిచ్చారుగనక!"

"ఓహెూహెూ!" అనేశాన్నేను నాకు తెలియకుండానే.

"ఇంకో విశేషం. గత పాతిక ముప్ఫై సంవత్సరాలలోనూ ఆయా సాహిత్య శాఖల్లో పరివర్తనం తీసుకొచ్చిన నూతన సాహిత్యోద్యమాల్ని గురించిగూడా మేము పట్టించుకోవడం మానేశాం."

"అంటే... ...?"

"అంటే— మానవతావాదం. ప్రజాస్వామ్యవాదం, ప్రగతివాదం లాంటి వన్నమాట. ఆయా ఛాయల్ని తమ తమ రచనల్లో ప్రతిబింబించిన వారెవరూ మా ఎకాడెమీలో సభ్యులు కాదని సగర్వంగా చెప్పుకోగలం మేం."

"ఎందుకని?" అనడిగా ఆశ్చర్యంగా నేను.

"ఎందుకనేవుంది? మాకిష్టంలేదు గనక!"

"మరి ఆ కొత్త రచనల్ని మన పాఠకులు బాగానే ఆదరిస్తున్నారుగదా? విదేశీ భాషల్లోకూడా అనువాదం అవుతున్నాయే అవి?"

"ఐతే ఔతున్నాయేమో...ఐనా యిది భారతీయ సాహిత్య ఎకాడెమీ. ఇందులో ప్రగతివాదులకీ, అభ్యుదయరీతులకీ తావులేదు" అన్నాడు కార్యదర్శి.

ఇంతలో శ్రీ సుందర సింగుగారు కటువు మాటల్ని కోమల కంఠంతో కప్పివేస్తూ, "అయ్యా, అసలు సంగతి నే చెబుతావినండి మాకు క్లాసికల్ సాహిత్యం అంటే యిష్టం. ఉర్దూలో గాలిబ్ వరకూ, హిందీలో భారతేందు హరిశ్చంద్ర వరకు సంస్కృతంలో కాళిదాసు వరకూ..." అన్నారు.

"ఐతే, ఆ తర్వాత ఆ యా భాషల్లో వచ్చిన రచనలన్నీ వ్యర్థమనేనా తమ అమూల్యాభిప్రాయం!"

కార్యదర్శిగారు నవ్వారు. "మీరు గడ్డితిని రాలేదుగదా?" అన్నారు.

"ఇంతవరకు తినలేదు. ఇక తినక తప్పేట్టులేదు" అన్నాను.

"ఇప్పుడే తెప్పిస్తాను" అన్నారు కార్యదర్శి తమ అతిథి సత్కారాన్ని తెలియజేస్తూ.

అని, వారక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయారు. ఆయనగారి అసిస్టెంట్ వొచ్చారు నా దగ్గరికి. "అయ్యా, సాహిత్యసంబంధం వున్న వారితోనూ, రచయితలతోనూ మాట్లాడం నా కిదే మొదలు. ఇంతకు పూర్వం అంటే పుస్తకాలు చదివేవాణ్ణి. అంచేత నాకీ గొడవలు తెలియవు. కాని నే నొక్క టడుగుతాను చెబుతారా? ఇప్పు డీ సాహిత్య ఎకాడెమీ, యీ సదస్యులూ అంతా రచయితల కే విధంగా సహాయం చేస్తున్నారు? వాళ్ళ నెలా ప్రోత్సహిస్తున్నారు? ఆదుకుంటున్నారు?" అనడిగా ఆయన్ని.

"గత పదేళ్ళలోనూ పుస్తకాలు వ్రాశినవారిపేర్లూ, ఆ యా పుస్తకాల పేర్లూ జాబితా తయారుచేయిస్తున్నాం."

"జాబితా తయారుచేయిస్తున్నారా? తర్వాతేం జేస్తారు?"

"అది నాకు తెలియదు."

## పగలు వెలుగుచూడని వందలాది రచనలు

"ఐతే, యీ వందేళ్ళలోనూ వ్రాయబడని పుస్తకాల జాబితా యెవరు తయారు జేస్తారు? దారిద్ర్యం మూలాన్న, తినడానికి లేక పోవడం మూలాన్న, పిల్లలు ఆకలితో అలమటించి పోవడంవల్ల, భార్య క్షయవ్యాధిగ్రస్తురాలవడంవల్ల పుట్టిన వూహలకి పురిటిలోనే సంధి కొట్టి, పగలు వెలుగు చూడని వందలాది రచనల సంగతెవరు పట్టించుకుంటారు? అమరకళాకృతుల సూచిక నెవరు తయారు జేస్తారు? ఆ దివ్య సంగీతాన్నెవరు ఆలపిస్తారు?"

"ఏమో, మాకేంతెలుసు! అన్నాడు అసిస్టెంట్, సిగ్గుపడుతూ.

"మీకే తెలియకపోతే యింకెవరికి తెలుస్తుంది? గాయపడిన రచయిత హృదయాన్ని కడిగి కట్టుకట్టేదెవ్వరు? ఒక్కొక్క రచన ఒక్కొక్క నెత్తురు బొట్టును వెచ్చించే ఆ రచయితలకు రక్తదానం చేసేదెవ్వరు? వాళ్ళకింత జీవన భృతినిచ్చి వాళ్ళతో నవలలూ, కథలూ కవిత్వమూ వ్రాయించే దెవ్వరు? సంఘానికి వారుచేసే మేలును గుర్తించి వాళ్ళకి సెలవులూ, పెన్షన్లూ యిచ్చి, ఆర్థిక సహాయ్యం చేసే దెవరు? వాళ్ళ బిడ్డల చదువు సంధ్యలకయ్యే ఖర్చులు భరించేదెవ్వరు?

శచయితలు గూడా సామాన్య మానవులేననీ, వారికీ జీవితావసరా లుంటాయనీ గుర్తించే ఎకాడమీ యింకొక టేదైనావున్నదా? వాళ్లు గాలిని భోంచేసి, శూన్యంలో బ్రతకలేరని తెలిసిన ఎకాడెమీ యింకొకటి లేదా?

"ఇదిగోండి మీ గడ్డి!" అంటూ వచ్చాడు కార్యదర్శిగారు యింతలో. నా ఆవేశంలో నేను మొదట గుర్తించలేదుగాని, తర్వాత తెలిసింది నాకు ఆ మహాశయుడి ముఖారవిందం. ఒలికించిన చిరునవ్వు కృత్రిమహాసం మాత్రమేనని. వచ్చిన అతిథి మారంకెవేస్తే తుపాకి తీసుకుని కాల్చెయ్యాలంటూ ఆ ఎకాడెమీ నిబంధనల్లో లేకపోయింది కాని, వుంటే అంతపనీ చెసేశేవాడే నన్ను. కానేం జేస్తాడు పాపం! గడ్డి వడ్డించక తప్పలేదు!

నే నటూ యిటూ చూచాను. ఎవరి గొడవలో వారున్నారు. శ్రీ గజేంద్ర నాగపాల్‌గారు రసగుల్లా తినేసి, సమాధిలో కెళ్ళి పోయారు. అబ్బా అదీబ్‌గారు గురకలు కొడుతున్నారు. సుందర సింగుగారు యేదో దీర్ఘాలోచనలో వున్నట్టు, గడ్డం బరుక్కుంటున్నారు. సంభాషణలో పాల్గొనేందు కెవరూ సిద్ధంగా లేరని తేలిపోయిం తర్వాత నేనూ నాముందున్న గడ్డి కతకడం ప్రారంభించేశా. ఐనా, ఒక మామూలు గాడిద అంతకంటె ఎక్కువేం చెయ్యగలదు గనుక!

నేను రెండుమూడు బొక్కులు బొక్కానో లేదో, ఒక మహాశయుడు ఒంటినిండా శాలువ కప్పుకుని, చేతిలో తంబూరా పట్టుకుని, నవ్వుతూ నాముందు కొచ్చి నిలబడ్డాడు.

"తమరికి మంచి పాటలు వినడమంటే సరదా అని విన్నాను?" అన్నాడు.

"పాటలు వినడమేం ఖర్మ నేనే బ్రహ్మాండంగా పాడేశెయ్య గలను, వింటారా?"

ఆయన నవ్వాడు "ఇప్పుడొద్దు లెండి. ముందు మీరొచ్చి మా సంగీతజ్ఞులు పాడే "గుణకలీ" విని మమ్మల్ని ధన్యుల్ని చెయ్యండి." అన్నాడు.

"ఆగం డాగండి! మళ్ళీ యిలాంటి గడ్డి దొరుకుతుందో, దొరకదో, ఇది కాస్తా తిని..."

అది 'కళ' లకు సంబంధించిన మూడు ఎకాడెమీల సంయుక్త సమావేశం. అంచేత అందులో యెవరెవరు ఆ 'గుణకలీ' రాగాలాపన నానందిస్తున్నారో చెప్పడం కష్టమే.

## పూలను మొగ్గలుగా మార్చిన సంగీతంమహిమ

ఆ 'గుణకలీ' ఆలాపన ఒక గంటన్నరవరకూ అలా సాగుతూనే వుంది. ఈ లోపుగా నేను నా గడ్డితినడం ప్రారంభించాను. ఆ తన్మయత్వంలో నేను 'గుణకలీ'ని తింటూ, గడ్డిని వినడంలేదుగదా అని సందేహంవేసింది. చాలమంది రచయితలు కుర్చీలమీద తలలు వ్రేళ్ళాడేసి కునుకుతీయడం మొదలెట్టారు. అబ్దుల్ అబీబ్‌గారు ఆదితాళంలో గురకలు కొడుతున్నారు. కళాకేంద్ర సభ్యులు కూర్చుని, ఆ 'గుణకలీ'ని ఆలపించే ఉస్తాద్ కృష్ణదాస్ దేశ్‌పాండేగారి కార్టూన్ వేస్తున్నారు. కార్టూన్‌ని చూచి కార్టూన్ వేయడమంటే మాటలుకాదు; కాబట్టి అందులోనే కనిపించింది ఆ కళాకేంద్ర సభ్యుల గొప్పదనం. ఉస్తాద్ కృష్ణదాస్‌గారి కుటుంబం ఐదారు తరాలనుంచి ఆ 'గుణకలీ' ఆలాపనకు ప్రసిద్ధికెక్కిన కుటుంబం. ఈ ఐదారు తరాలనుంచీ వారా రాగాలాపన ఒక్కటే సాధనచేస్తూ వచ్చారట. బహుశా అంచేతనేనేమో, ఆ రాగాలాపనలో వారి కంఠ ప్రావీణ్యం సిద్ధించింది. ఆ గంటన్నర ఆలాపన వినేప్పటికి పూవులక్కూడా నిద్రొచ్చినట్లనిపించింది. పూలు రేకులు ముడుచుకుని తిరిగి మొగ్గలైపోయినై! క్లాసికల్ సంగీతంలోవున్న మహిమ అలాంటిది మరి!!

ఆలాపన పూర్తయింతర్వాత, పావుగంట విశ్రాంతి. ఆ విశ్రాంతే యివ్వకపోతే, అక్కడ సమావేశమైన సంగీతప్రియుల హృదయా లాగిపోతాయేమోనని భయం వేసింది. ఆ విశ్రాంతి నవకాశంగా తీసుకుని విన్నవారి కొక కప్పు 'టీ', వినిపించినవారి కింత అమ్లజనీ (ఆక్సిజన్) యిప్పించారు.

"ఏఁవండీ, క్లాసికల్ సంగీతంలో కొన్నిరాగాలు రెండు మూడు గంటలు ఆలాపనచేశినా అంతం కావటుగదా ?" అనడిగా నేను నా ప్రక్కనే కూర్చున్న ఒక సంగీతజ్ఞుణ్ణి.

"వెధవ మూడుగంటులేనా ?" అన్నా డాయన కోపంగా. మీారే చూస్తారుగా. ఈ ఏర్పాంతైపోగానే, ఉస్తాద్ రఘుబర్ గంధర్వమాత్ర గారు 'మియాఁ మల్హార్' ఆలపిస్తారు,వినండి. కనీసం ఐదారు గంటలకి తగ్గని ప్రోగ్రామది. అందులో యివ్వాళ ఉస్తాద్ జీ ! బాగా తయారై మరీ వొచ్చారు."

"ఐతే, అంతిమ క్రియఁ కన్ని సన్నాహాలూ సమకూర్చారా?" అనడిగా నేను.

"అంటే ?"

"అంటే యేఁవుందండీ శ్రొంతె! యేదోవొక లెక్క యిచ్చి నన్ను రెండు లక్షలసార్లు చెయ్యమంటే, నేనింత ఆరోగ్యంగానూ వుంటానని నమ్మకం యేఁవిఁటి? పిచ్చాణ్ణయిపోతేనేవోఁ; లే చెవరిజుట్టు పట్టుకు ఝాడిస్తానో, ఎవరిగొంతు నులిఁవేస్తానో, యెవరి కెరుక ?"

ఆ సంగీతజ్ఞుడు, ఓపిగ్గా సర్దుక్కూర్చుని, క్లాసికల్ సంగీతంలో వున్న రహస్యం విప్పిచెప్పాడు; "క్లాసికల్సంగీతం అలాంటి ఆవేశాల్ని ప్రకోపింపజెయ్యదు. మహాఐతే, పాటుగాడు స్పృహతప్పిపడిపోతాడు; అంతే, అంతకంటే యెక్కువ ప్రమాదం యేమీా జరుగదు. విన్నవా ళ్ళవరైనా యింటికి వెళ్ళింతర్వాత ఆత్మహత్య చేసుకుంటూరో లేదో, యిదమిద్ధమని చెప్పడానికి మాకింకా నిదర్శనాలు దొరకలేదు."

"యేఁదోఁనండీ, ఆ ఆలిండియారేడియో క్లాసికల్ సంగీతం ప్రసారం చెయ్యడం ప్రారంభించిం దగ్గర్నుంచీ, దేశంలో పిచ్చివాళ్ళ సంఖ్యా, ఆత్మహత్యల సంఖ్యా యెక్కువైపోయిందని వింటున్నాం."

ఇంతవరకూ కిక్కురు మనకుండా మా సంభాషణ వింటూన్న మరో పెద్దమనిషి "యేఁవండీ, మీాకు క్లాసికల్ భారతీయ సంగీతం వంటే పగేమైనా వుందా ?" అనడిగాడు.

"నా పగవాళ్ళెవరో చెపుంటారు మీాకు. నాకు క్లాసికల్ సంగీతఁవంటే చాలా యిష్టం; చెవికోసుకుంటాను. కాని మీారు ప్రసా

రించే యీ సంగీతంలో నాకు గీతం పూం కన్పించడంలేదు. సంగీతం పూంకన్పించడంలేదు, గణితం తప్ప!" అన్నా నేను.

ఆ మరో పెద్దమనిషి క్కోపం వచ్చింది, "మీకు తెలియదండీ, మన భారతీయ సంగీతం ప్రపంచంలోకల్లా ప్రాచీనమైంది. గత మూడు నాలుగువేలయేళ్ళనుంచీ మన సంగీత స్వరం ఒక్కటీ మారలేదు. మీకు తెలుసా!" అన్నాడు ఛాలెంజీ చేస్తున్నట్టు.

"అయ్యా, ఐనా యిందులో గర్వించదగ్గ గొప్పదనం యేం వుంది? మా వంశసంగీతం సృష్ట్యాదినుంచి యీనాటివరకూ అసలు మారనేలేదు. కాదనే వా ళ్లెవరైనావుంటే ముందుకు రమ్మనండి. మీకు నమ్మకంలేదంటే, యిప్పుడే నా సంగీతం ఆలపించెయ్యడానికి సంసిద్ధంగావున్నా" అన్నా నేను.

మొదటి సంగీతజ్ఞుడు నా వంక మిర్రి మిర్రి చూచాడు.

నాకు ఆవేశం కలిగింది "ఎప్పుడూ యేమీ మారకపోవడం... ఎవరినుంచీ యేమీ నేర్చుకోకపోవడం...వీటిలో గొప్పేమీలేదండీ, పరివర్తనం లేనిదే ప్రగతెక్కణ్ణుంచి పుట్టుకొస్తుంది. అదీగాక, భారతీయ సంగీతం బయటి ప్రభావాల్ని స్వీకరించలేదనడం శుద్ధ అసత్యం. భారతీయ సంగీతం మన సరిహద్దుల్ని దాటి వెళ్లింది; మన సరిహద్దులు దాటి అరబ్బీ సంగీతమూ, పాశ్చాత్య సంగీతమూ మన దేశంలోకి అడుగూ పెట్టినై. మన సంగీతం ఆ సంగీతాలతో సమ్మేళనమూ పొందింది. ఆ సమ్మేళనం వల్ల మరింత ఆహ్లాదకరం గానూ మారింది. మీరీ నాడా ప్రభావాలన్నిటినీ యేరి విసరి పారెయ్యాలని ఎందు కనుకుంటున్నారో నా కర్థం కావడంలేదు. మీ కింత పగెందుకో, నా కంతుపట్టడం లేదు."

"స్వదేశీ సంస్కృతిలో విదేశీ సంస్కృతి నెందుకూ కలపడం. కలగా పులగం చెయ్యడం దేనికి?"

"మీరు పులగం తిన్నారా యెప్పుడైనా? ఆ సంగతలా అట్టి పెట్టండి. నిజమే. ప్రతిదేశ సంస్కృతిలోనూ ఆ దేశం వ్యక్తిత్వం వ్యక్తమౌతుంది. కాదనను. కాని విదేశ సంస్కృతిలో ఏభాగం మన దేశ సంస్కృతిలో సంలీనం కాగలదంటారు? సంలీనమైనదానిని మళ్ళీ

యేరిపారేయ్యడం దేనికి? మనకంటే అభివృద్ధిపొందిన విదేశాల విజ్ఞానశాఖల పదాలు మన భాషలోచేరి మన భాషా పాటవాన్ని పెంపొందిస్తూంటే, ఒక శుభోదయానలేచి ఆ మాటల నన్నిటినీ యేరి దూరంగా పారేస్తే నష్టపోయే దెవరు? మనమూ, మన భాషనూ! ఆలాగే సంగీతమూనూ, క్లాసికల్ సంగీతం వద్దనికాదు నే ననేది. మన జానపద సంగీతాన్నీ సినిమా సంగీతాన్నీ ముట్టరాని సంగీతంగా భావించవద్దనే నా మనవి. సినిమాసంగీతంలో అరబ్బు, పాశ్చాత్య సంగీతాలు కొత్త రూపులు సంతరించుకుంటున్నై. యీ కొత్త బుల పాటంలో. కొన్ని లోటు లుండవచ్చు. ఆ లోటుల్ని సూచించొద్దనడం లేదు నేను. ఆ కొత్తరూపాన్ని ఉపేక్షించొద్దనే నే కోరేది. మన జానపద సంగీతమూ, సినిమా సంగీతమూ మనదేశంలో అందరినోటా ప్రతిధ్వనించుతూన్నై. అంతేకాదు, అరబ్బు దేశాల్లోనూ, యూరోపు లోనూ ఆదరణ పొందుతూన్నై. ఐనా మన సంగీత ఎకాడెమీ చెవులు మూసుకుని, కూపస్థమండూకంలా ఆ సంగీతాన్ని వుపేక్షిస్తున్నది. అదలావుంచండి. సరే, మీరు క్లాసికల్ సంగీతాన్ని ప్రచారం చెయ్యాలనిగదా అనుకొంటున్నారు? ఐతే మరి గొప్ప గొప్ప వుస్తాదుల్ని పిలిపించి, టిక్కెట్లుపెట్టి ఒక్కొక్కటి కెట్టు ఖరీదూ వందరూపాయలు పెడతారెందుకు? టికెట్ ఖరీదు పెరిగినకొద్దీ అభిరుచులవిలువ పెరుగుతుందనా మీ వుద్దేశం?

"ఈ వుస్తాదులంతా మన జాతీయైశ్వర్యం అని గదా మీ అభిప్రాయం. ఐతే, ఈ మన్న జాతీయైశ్వర్యాన్ని జాతి ప్రజల కందరికీ, బహిరంగ వేదికల మీదుంచి, పంచండి. ఏ సప్రూహౌస్‌లోనోవుంచి వింతమృగప్రదర్శనంలా తయారుచేయకండి. మనదేశ సంగీతఎకాడెమీ అంటే దేశంలోని ప్రజలందరికీ ఉపయోగకరంగా వుండాలి. లేకుంటే జాతీయ బొక్కసంలోంచి ఒక్క నయాపైసా గూడా మీరు తీసుకునేందుకు వీలుండగూడదు."

ఉద్రేకం మూలాన్నో, కోపం మూలాన్నో చెప్పలేనుగాని, నాతోక లేచి, నిటారుగా నిలబడింది. అటు ఉస్తాద్ రఘుబలీ గంధర్వ మాత్రగారు, "యీ గాడిద యీ సభలోవుంటే నేను నా 'మియాం

మల్హార్' ఆలాపన వినిపించను" అని పట్టుపట్టి కూర్చున్నారట. ఇక లాభం లేదనుకుని కళాకేంద్ర సభ్యులు శ్రీ యమ్.యమ్. చంద్రేగారు నాదగ్గరకొచ్చి, యెంతో వినయంగా, "అయ్యా, మీరు మా చిత్ర ప్రదర్శనశాలను చూడనేలేదు. ఈ శాలకు ప్రారంభోత్సవం మొన్ననే జరిపాం. మీ రా ప్రదర్శనచూచి మీ అమూల్యాభిప్రాయాల నిచ్చి మమ్మల్ని ధన్యుల్ని చెయ్యాలి" అంటూ అర్థించారు.

## చిత్ర ప్రదర్శనశాల

చంద్రేగారు సామాన్యులు కారు. ఐదేళ్ళు పారిస్‌లో వుండి భారతీయ చిత్రకళ నధ్యయనంచేశి వచ్చారు. 'ముళ్ళముళ్ళు!' అన్న వారి చిత్రానికి యీ ప్రదర్శనలో ద్వితీయ బహుమానం లభించింది. అన్నింటి కంటే ముం దాచిత్రాన్నే చూపారు వారు నాకు. అది చాలా పెద్దపటం. చూడగానే ముందు కొట్టొచ్చినట్టు ఒక నగ్నస్త్రీ వీపు కని పించింది. ఆ స్త్రీ మెడలిప్పి, పాదంలో దిగిన ముల్లు బయటికితీయా లని ప్రయత్నిస్తోంది.

"అయ్యా, యీ స్త్రీ నిలా నగ్నంగా చూపవలసిన అగత్యం యేమొచ్చింది. ఒక్క స్నానాల.గదిలో తప్ప, మరెక్కడ యీ ముల్లు దిగిందనుకున్నా, ఆవిడ సవస్త్రగానే వుండేదేమో" అన్నా నేను, ఆ చిత్రం చూచి.

"మీ కీ భావం అర్థంకాలేదు" అన్నారు శ్రీ చంద్రే. "చూచేం దుకు యీ ముల్లు యీస్త్రీకి గుచ్చుకుంటూన్నట్టుంది కాని, నిజం వది కాదు!" అన్నాడు.

"మరి ?"

"ఈ స్త్రీయే ఆ ముల్లుకు గుచ్చుకుంటోంది." అని ఎంతో ఓపిగ్గా విశదపరిచా డాయన.

"ఓహో! ఆ ముల్లు ఆ స్త్రీకి గుచ్చుకోలేదన్నమాట; ఆవిడే ఆ ముల్లుకు గుచ్చుకున్న దన్నమాట! ఆహా! ఏమిభావం! చూశారా, నాలాంటి మామూలు గాడిదల కీఅ పూర్వభావా లెలా అర్థంవౌతాయి చెప్పండి" అన్నా నేను విన్నబోయిన వదనంపెట్టి.

"ఏం ఫర్వాలేదు. మిగతా చిత్రాలుగూడా చూడండి!" అన్నారు శ్రీ చంద్రే, సానుభూతిచూపుతూ. "ఒక్కసారన్నీ అర్థం కావాలన్నా కష్టమే. నెమ్మది నెమ్మదిగా అవే అర్థంవౌతై. చూశారూ, ఇది కాల్పనిక కళ కొక అద్భుతమైన వుదాహరణ. దీన్ని మిస్టర్ గర్ఫిశ్ గ్రామేగారు పంపారు" అంటూ మరో చిత్రం దగ్గరకు తీసి కెళ్ళా డాయన.

ఆ చిత్రంనిండా త్రికోణాలూ, చతుర్భుజాలూనూ, మధ్య మధ్య అక్కడక్కడా స్త్రీ ఆకృతి లీలామాత్రంగా కనిపించింది. చేతులకు బదులు వాయిలిన్; మెడ వుండవలసిన చోట వీణతీగెలూ వున్నై. మొండెం వుండవలసినచోట తంబూరా పొట్టవుంది.

"ఇదేంచిత్రం?" అనడిగా నేను.

"ఇదాండి? యిది రోషనారా బేగం చిత్రం!"

"ఈ చిత్రకారుడి పేరేవిటున్నారు? యిక్కడే వున్నారా ఆయన?"

"గర్ఫిశ్ గ్రామే. పాకిస్తాన్ పారిపోయారు."

"పారి పోయారా? యెందుకు?"

"ఈ చిత్రంచూచిన ఒకాయన, యిది తన భార్య చిత్రమేననీ, యిది గీశినవాణ్ణి కాల్చిపారేస్తాననీ పిస్తోలు జేబులో పెట్టుకు తిరగడం మొదలెట్టాడు."

సరే, పోనీండి. మంచిదే జరిగింది. లేకుంటే అనవసరంగా హత్య జరిగిపోయేది—చిత్రకారుడిది గాని, చిత్రానిదిగాని ..."

అంటూ మళ్ళీ ఒకసారాచిత్రాన్ని పైనుంచీ క్రిందివరకూ పరీక్షగా పరికించాను. నేను చూచిన రోషనారాబేగంకీ, యీ చిత్రానికీ పోలి కెక్కడా కన్పించలేదు. ఆ మహాగాయని యెక్కడ, యీ చిత్రం యెక్కడ! పరీక్షగా చూస్తుంటే, ఆ చిత్రం మెడలోంచి ఒక సమ్మెట వేళ్ళాడుతూన్నట్లు కనిపించింది.

"ఇదేవిటండోయ్ యీ సమ్మెటేవిటిక్కడ?" అనడిగాను.

"ఓ, అదా! రోషనారా పాడిన ప్రతిరాగమూ యీ సమ్మెటలా హృదయానికి సూటిగా తీవ్రంగా తగిలి స్పందింపజేస్తుందని భావం."

"ఆహాహా! యేమి కల్పన, యేమి ఉపమ!" అని తర్వాత అతి మెల్లగా, "ఐతే, యీ గర్ఫిశ్ గ్రామేగా రీ చిత్రకళ నెక్కడ నేర్చుకున్నారు?" అని అడిగేశాను వుండబట్టలేక.

"పారిస్‌లో యెనిమిదేళ్లు ఇరానీ చిత్రకళ నేర్చుకున్నారు."

"సరే, సరే, ముందుకు పదండి. ఇంకా చాలా చిత్రా లున్నట్లున్నై."

ఇద్దరం ముందుకు నడిచాం. ప్రక్క నొక కిటికీవుంది. ఆ కిటికీ లోంచి ఉస్తాద్ రఫీబలీగారి రాగాలాపన అతి స్పష్టంగా వినిపిస్తోంది: 'ఘన ఘన, గరజ గరజ గరజ్, ఘనఘన గరజ్'.

ఆ కిటికీకి రెండడుగులవతల ఒక పెద్దపటంవుంటుంది. అందులో మూడుచేపలున్నై. ఆ మూడింటిలో అన్నింటికంటె పెద్దచేప నిటారుగా నిలబడుంది. రెండోచేప, ఆమొదటి చేప పొట్టలోకి దూరుతూన్నట్టుంది. మూడో చేప ఆ రెండోచేప పొట్టలోనే వుంది. పటంక్రిద—

"బ్రహ్మాండం — చిత్రకారుడు బగలోల్" అనివుంది.

"ఈ బగలోల్ ఎవరండీ?" అనడిగా నేను.

"వీరు బొంబెలోకల్లా ప్రసిద్ధ చిత్రకారులు. వీ రెప్పుడూ చేపల చిత్రాలే వేస్తుంటారు."

"ఏం? యెందుకని!"

"ఈయన ప్రేయసిని తిమింగలం తినేసింది. ఇకానాటినుంచి చేపల చిత్రాలే వేస్తున్నారు వీరు."

"మరి యీ చిత్రంలో ఆ ప్రేయసెక్కడా కన్పించడం లేదే."

"ఇంకాస్త జాగ్రత్తగా చూడండి. ఆ మత్స్య గర్భంలోనేవుంది ఆ ప్రేయసి. ప్రతీ చిత్రంలోనూ చేపల కనుల్లోనో, పొలుసులోనో యెక్కడో ఒకచోట ఆ ప్రేయసి తప్పకుండా వుంటుంది. వారి చిత్రకళలోవున్న విశేషమే అది" అన్నాడు శ్రీ చంద్రే.

నేను మరింత పరీక్షగా చూశాను. నా కెక్కడా కన్పించలే దా ప్రేయసి. "లేదండీ, యీ చిత్రంలో వేయడం మరచిపోయాడేమో ఆయన" అన్నాను చివరికి విసిగిపోయి.

"అలా యెప్పుడూ మరిచిపోరే" అంటూ చేతిలోవున్న దుర్భిణీ అద్దం కంటికి తగిలించి చూశాడు శ్రీ చంద్రే. చివరికి, నిరాశతో, "ఔనండీ, లేదు బహుశా జీర్ణమై పోయిందేమో. చాలా సుకుమార మైన ప్రేయసి ఆపెద, పాపం, యెంతకాలమని వుంటుందీ చేపల పొట్టలో. పాపం, అరిగి పోయింది; జీర్ణమైపోయింది!" అంటూ దుర్భిణీ అద్దం తీశి, జేబులో పెట్టుకుని, జేబులోంచి జేబురుమాలుతీశి, కనుకొలకుల్లో గూడుకట్టుకోబోతున్న ఒక్క కన్నీటి బొట్టును తుడిచి వేసుకున్నాడు.

"ఈ చిత్రానికెక్కడా బహుమానం వచ్చినట్లుందే;" అంటూ ఆ చిత్రానికి తగిలించిన కార్డుతీశి చూశాను. నా కాశ్చర్యంవేశింది. "ఇదేవిటండీ, మా అష్టవక్ర గ్రామంలో నాలుగోక్లాసు పిల్లలుగూడా యింతకంటే బాగావేస్తారే చేపల బొమ్మలు. అందులో ఈ చిత్రంలో ఆ ప్రేయసి బొమ్మైనాలేదు. ఇంకా యీ బహుమానం యెందుకిచ్చి నట్టు?" అని అడిగేను.

"ఏమోనండీ" అంటూ నుదుటమీద చేయివేసుకున్నారు శ్రీ చంద్రే. "అసలు జరిగిందేవిటంటే, యీ ప్రదర్శన పరిశీలన కొచ్చిన న్యాయనిర్ణేతలు, యీ చిత్రం దగ్గర కొచ్చేటప్పటికి భోజనాల వేళైపోయింది. వారికేమో, పాపం, ఆకలి తీవ్రంగా వేశింది. చూస్తే ఎదు రూగ్గా యీ చిత్రం వుంది."

"యింకేం, ముందు చేపల కూర చూశ పెట్టినట్లయింది!" అన్నా నేను.

"ఆం. సరిగ్గా అంతే ఐంది. వెంటనే, ఆ ఆకలికి తాళలేక అయిదువందల రూపాయలు బహుమాకరించేశారు. సరే, అయ్యిందేదో అయ్యింది. ఒక్కోసారి పెద్ద పెద్దవాళ్ళూ పొరపాటు చేస్తూంటారు చూడండి!" అంటూ ముందుకు దారితీశారు శ్రీ చంద్రే.

నేను ముందుకడుగేద్దామని అనుకుంటూనే వున్నాను; ఇంతలో "యింకెక్కడికి వెళతావ్?" అంటూ ఆనందం, కోపం, సంతృప్తి మేళ వించిన స్వరం నాచెవుల్లో పడింది; ఒక పెద్ద పలుపుతాడు నా మెడలో పడింది. రోషంతో ఒక్కసారి తిరిగి చూస్తే, కుమారి రూప నిలబడుంది!

"ఏమైపోయావో నని వూరంతా గాలించాను. చాల్లే యిక యింటికి నడు!" అంటూ పలుపుపట్టుకు లాగింది.

ఇంతలో రెండో వైపునుంచి యింకో పలుపొచ్చిపడింది నా మెడలోకి. "అక్కెక్కడి కెళ్తావ్; యిటు రా!" అంటూ ఆ పలుపు గుంజింది. ఎవరా అని అటు తిరిగి చూస్తే కమల నిలబడుంది; పలుపు చేత్తో పట్టుకుని.

ఇటు రూపవతి! అటు కమల! ఎవరివేపుకు వాళ్లు గుంజుతున్నారు పలుపులు.

"నీపలు పొదిలెశెయ్! ఇది నా గాడిద!!" అంది కమల రూపవతితో.

"పోవే సిగ్గులేనిదాన! యిది నాది!!" అంది రూప.

ఇంకేముంది? అవిడ "రండా!" అంటే, యీావిడ "ముండా" అంది. ఆ గుంజుడు కాగలేక నేను రుంజుకున్నా. ఆ ఆధునిక చిత్ర కళా ప్రదర్శన శాలంతా నానాబీభత్సమూ ఐపోయింది. ఆ తొక్కిడిలో పటాలూడి కిందపడిపోయినై. కొన్నిపటాలు చిరిగిపోయినై. చిరిగి పోయిన చేపల పొట్టలోకి రోషనారా బేగం వచ్చి పడింది. ఆవిడ మెడలో వ్రేళ్ళాడే సమ్మెట నా నెత్తిమ్మీద పడింది. నాకేమీ పాలుపోక నా రాగాలాపన లంకించుకున్నాను. ఇంతలో పోలీసుల మందొచ్చిపడింది. వాళ్ళ వెనకే మన సుఖలాల్‌గా రొచ్చిపడ్డారు రొప్పుకుంటూ. అదృష్టవశాత్తూ, అప్పటికే, రూపా కమలా నన్నొదిలి ఒకళ్ళజుట్టూ ఒకళ్లుపట్టుకుని క్రింద పొర్లాడుతున్నారు. ఒకళ్ళ ప్రియుళ్ళ నొకళ్ళు పేర్లెత్తి మరీ తిట్టుకుంటున్నారు ఒక్కొక్కళ్ళకీ కనీసం వొక రెండు డజన్లమందైనా ప్రియులున్నారని తెలిసింది ఆ తిట్ల పుణ్యమా అంటూ. సేఠ్‌జీ రాగానే, ముందు నా పలుపు పట్టుకుని, నా కటూ యిటూ యిద్దరు పోలీసుల్ని కాపలా పెట్టారు. మిగతా పోలీసుల్ని సాయం తీసుకుని రణరంగాన్ని సమీపించారు. అప్పటికి కమల రూపని క్రిందపడేసి, రొమ్ము మీాదెక్కి కూర్చుంది. పోలీసులు అతి కష్టం మీాద వాళ్ళిద్దర్నీ విడదీశారు. కమల వెక్కెక్కి యేడవడం మొదలెట్టింది. అవిణ్ణొక బ్యూక్ కారులో ఎక్కించి పంపించేశారు సేఠ్‌జీ.

"కావాలంటే, అప్పుడప్పుడూ నాతో షికారుకి రావచ్చని కూడా చెప్పాగా, బంగారం!" అంటూ బులిపిస్తూ దగ్గరకొచ్చింది రూపవతి.

"ఏం లాభం? నా వీపుమీద జీనుకడతారు గదా!"

"ఛ. జీనూ కట్టను; సింగినాదమూ కట్టను. ఇద్దరమూ కలిసి హాయిగా షికారుకెళ్ళొచ్చు" అంది మరింత చెరువకొచ్చి. "నీ పలువు స్వయంగా నేనే పట్టుకుంటాను, నౌకర్నిగూడా రానివ్వను."

"భార్యలంతా అంతే. భర్త మెడకేసిన తాడు వాళ్ళే పట్టుకుంటారు!"

రూపవతి నా మెడమీదచేతులేసింది. "సంవత్సరానికి రెండుసార్లు నువ్వు హాయిగా నా డ్రాయింగ్ రూమ్‌లోకి రావచ్చు. ఇద్దరం కలిశి హాయిగా ఒకే బల్లమీద భోంచేద్దాం ఆ రెండు సార్లూనూ."

"రెండు సార్లంటే, యెప్పుడెప్పుడు?"

"నీ పుట్టిన రోజు నా డొకసారి... అన్నట్టు నువ్వు పుట్టినరోజు."

"మాకు పుట్టినరోజులంటూ వుండవమ్మా మహారాణీ!" అన్నా నేను విసుగ్గా. "పుట్టిన రోజులు గొప్పవాళ్ళు చేసుకుంటారు; గాడిదలు కాదు! అదట్లావుంచు. ఒకసారి నా పుట్టిన రోజునా? రెండో సారెప్పుడూ మరి?"

"ఇంకెప్పుడు? మన వివాహ వార్షికోత్సవం నాడు!" అంటూ సినీమా తారలా సిగ్గు నభినయించింది రూపవతి. అభినయించి, నా దెవిమీదొక ముద్దుపెట్టింది. ముద్దుపెట్టి నాముందొక కాగితం పెట్టింది.

"యిదేవిటి?" అనడిగా నేను.

"కాంట్రాక్ట్."

"కాంట్రాక్టా? పెళ్ళికూడా కాంట్రాక్టే!"

"పిచ్చోడా! పెళ్ళి కాంట్రాక్టుకాదు. నాన్నగారి వ్యాపారంలో భాగానికి కాంట్రాక్టు."

"వ్యాపారం యేవిటి?"

"ఆ వ్యాపారమే బంగారం!" అంటూ బుగ్గల్తో నా మెడ నిమిరింది రూపవతి. "కమల నీమెడకు పలుపేసి లాక్కుపోబోయిందే; ఆ

వ్యాపారమే! చూడు, నా మేలిమి బంగారానివికదూ; సంతకం చేసే సెయ్ మరి తొందరగా ... "

"కాస్తాబుగ్గల్తో నిమిరడం మానేద్దురూ, నాకు చక్కిలిగింతగా వుంది" అన్నా నేను.

ఒక రెప్పపాటుకాలం రూపవతి కన్నుల్లో కోపం తాండవించింది గాని మరుక్షణంలోనే మాయమైపోయింది. మళ్ళీ నా మెడ కౌగలించు కుని, "చెయ్యండీ సంతకం. నన్నుచూచీ, నా కోసంవైనా చెయ్యండి! చెయ్యరూ ? ! మీరు చాలా మంచివారు!! బాబుగా, బంగారంగా, చేద్దురూ!!" అంటూ బ్రతిమాలింది ముద్దు ముద్దుగా.

నే నన్నాను! "నీ కోసం నే నేమైనా చేసేస్తాను. నిన్ను నా వీపు మీా దెక్కించుకుని, కావాలంటే అష్టవక్ర గ్రామం వరకూ మోసు కెళ్తాను. నువ్వు కొత్తగా యిల్లుకట్టించుకుంటానంటే, కావలశిన యిటుకలన్నీ ఒంటరిగా నేనే మోశేస్తాను. నీ కిటికీ కింద నిలబడి తెల్లవార్లూ పాటలు పాడమన్నా పాడతాను. కాని యీా కాగితం మీాద సంతకం మాత్రం చెయ్యలేను."

"యేం ? ఎందుకని ?"

నేను కారణం చెప్పుదామని అనుకుంటూనే వున్నాను, సేఠ్ మన సుఖ్‌లాల్ గొప్పుకుంటూ రోజుకుంటూ వచ్చిపడ్డారు గదిలోకి, "యింకేం వుందే తల్లీ, సర్వనాశనం వైపోయిందే అమ్మా ... అన్నీ చౌకై పోయినయ్యే. బియ్యం మణుక్కి రెండణాలు తగ్గింది. గుడ్డలు గజానికణా తగ్గినై. సిమెంట్ మీాద కంట్రోలు తీసేశారు. పానుకి నాలుగణాలొక్కసారి పడిపోయింది. అన్నీ చౌకై పోయినై" అంటూ, రెండుచేతుల్తోనూ తల పట్టుకుని, "యేంవై పోతావేంమ్మా!" అంటూ యేడుపు లంకించుకున్నారు.

నాకేం అర్థంకాలేదు. "అదేవిఁటండీ బియ్యవూం, బట్టా, సిమెంటూ చౌకైతే సంతోషించక యేడుస్తారెందుకు ?" అనడిగా.

"ఎందు కేడుస్తున్నానా ? నా సర్వస్వం నాశనమైంది గనక!" అంటూ తలవదిలి, రెండు చేతుల్తోనూ రొమ్ము బాదుకున్నాడు. "లక్షలకి లక్షలు నష్టం. దమ్మిడీధర తగ్గితేచాలు, నేను దివాళాయే!"

"గాభరాపడకండి నాన్నగారూ!" అంటూ రూపవతి తండ్రిని ఓదార్చి, నావైపుకు తిరిగింది. "చూడండి. మీరు దీనిమీద సంతకం చేసెయ్యండి. ఈ పాతికకోట్లతోనూ మా నష్టం పూడుతుంది. మా నాన్నగారి మనసూ కుదటబడుతుంది" అంది.

నేను గుడ్లు మిటకరింపా.

"అట్లా చూస్తావేం, తొందరగా చెయ్యమంటే" అంటూ గదురుతుంది.

నేను ఉలిక్కిపడ్డా. "సంతకానిదేం భాగ్యం యిప్పుడే చేసేస్తా. కాని ఆ పాతికకోట్లూ యెక్కడున్నై?"

"అదేమిటి నువ్వానాడనలా ప్రధానమంత్రిగారు పాతికకోట్లూ."

"మీ రానాడు నన్ను పూర్తిగా చెప్పనిచ్చిందెక్కడ? అదంతా ప్రాజెక్టు...?"

"ప్రాజెక్టా? అయ్యో! నేనేం చెయ్యనురా దేవుడా. ఇటు దివాలా! అటుపాతికకోట్లూ పోయె!" అంటూ నెత్తీ నోరూ కొట్టుకున్నాడు సేఠ్‌జీ. "ఇందుకా నిన్ను యింట్లో పెట్టుకుని నీపొట్ట పూజ చేసింది. ఇల్లరికపుటల్లుణ్ణి చేసుకుందామనుకున్నానే నిన్ను. ఇందుకా! మ్యునిసిపాలిటీతో సన్మానం చేయించానే. పత్రికల్లో ఫొటోలు వేయించానే, ఊరేగింపులు జరిపానే, పూలమాలలు వేయించానే, బొంబాయినుంచి విమానంమీద మేలురకం గడ్డి తెప్పించి మేపానే. ఇదంతా చేసింది యిందుకా? యీ మాట వినడానికా!?"

"పాతిక కోట్లూ లేవూ?" అంటూ వురిమింది రూపవతి "ఐతే నువ్వు మా యింట్లో యెందుకున్నావ్?" అంటూ చూపుల్తో నిప్పులు చెరిగింది.

చెప్పొద్దూ, నాకూ కోపం వచ్చింది. "మాటలు ఖాళీగా రానీ. నేను నీకు కాబోయే మొగుణ్ణి!"

"ఛీ, వెధవ! గాడిద!!"

"కాదు, కాదు, నేను నీ బంగారాన్ని."

"ఛీ ఛండాలుడా!" అంటూ రూపవతి జెత్తంయెత్తింది. సేఠ్‌జీ కఱ్ఱ పట్టుకొచ్చాడు. నౌకర్లూ, చాకర్లూ అంతా చేతి కేదందితే అది పట్టుకు పరుగెత్తుకొచ్చారు.

నే నటూ, యిటూ అన్నివైపులూ చూచాను. నాలుగువైపులా దిట్టమైనగోడలు. కింద నాపరాతి నేల. పైన అడుగుమందాన సిమ్మెంటు కప్పు. కిటికీ అన్నమాట లేదు.

ఇం కేముందీ?... ... ..

## తాజావార్త

మాటలు నేర్చిన గాడిదకి నిన్నరాత్రి ఘోరంగా గాయాలు తగిలినై. నాలుగైదు బొమికలు యిరిగిపోయిన వంటున్నారు. ఒక కాలు గూడా యిరిగిందట. కొట్టిన వారెవరో తెలియదు. వీధిలో పడుంటే చూచి పోలీసులు హాస్పిటల్‌కి చేర్చారు. పరీక్షచేశిన డాక్టర్లు పరిస్థితి ప్రమాదకరంగా వుందంటున్నారు. బ్రదికేఆశ కన్పించ డంలేదు. చికిత్సమాత్రం జరుగుతూనే వుంది. పాఠకులంతా ఆగాడిద ఆయురారోగ్యాలు పెంపొందాలని ప్రార్థించాలని మనవి. బ్రదికి బాగు పడితే, పునర్దర్శనం చేసుకోగలదు.

[ సమాప్తం ]



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | NPRO1B188 | Date | 27/03/23 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 131 | | |
| Missing Pages | 1, 2 TO 125,126 | | |
| Prepared By | chayy | Cutting By | chayy |
| Scanned By | Mounika | Pages | 131 |
| Quality Checking | hema | | |